అపరాధ పరిశోధన అనుబంధం—86

# మూడు నవలలు

(మీకోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## సమాధి పిలుస్తోంది

రచన : సికిందర్

## మానభంగ వివాహం

రచన: వసుంధర

## బ్లాక్ మెయిల్

రచన: వాణిశ్రీ

పొగమంచు—పద్నాల్గవ భాగం

# సమాధి పిలుస్తోంది!

సికిందర్

అనుపమ వస్తానన్న సమయానికి సరిగ్గా వచ్చేసింది.

ఆమెని చూసి ఒక్కసారిగా ఉలికిపడి తేరుకున్నాను. అంతవరకూ ముసురుకొన్న ఆలోచనలన్నీ ఆమె కన్పించడంతోనే ఎగిరిపోయాయి! ఆతృతగా బయటికెళ్ళి, గేటు తెరచుకొని వస్తోన్న ఆమెని సమీపించాను.

ఆమె నన్ను చూసి తలవంచుకోబోతే నవ్వి, "హాయ్!" అన్నాను.

సిగ్గుతో ఆమె ముఖం ఒక్కక్షణం ఎర్రబడింది.

ఈ సిగ్గులోనే ఆమె మరింత ముగ్ధంగా కనపడి మతి చెడగొడ్తోంది!

ఈ లోకంలోకొస్తూ, "సరిగ్గా చెప్పిన టైముకి వచ్చేశారు!" అన్నాను.

ఆమె తలెత్తి చూసింది - మెరుస్తున్న కళ్ళతో ఆ చూపులతో నా రక్తాన్ని గడ్డకట్టించేస్తూ.

నవ్వి, "అది మా నాన్న క్రమశిక్షణ!" అంది.

"మీరుచేసే ప్రతిపనికీ క్రెడిట్ మీ నాన్నకే అపాదిస్తారు!" అన్నాను ఆమెతో లోనికి నడుస్తూ.

"అది క్రెడిట్ కాదు, నిరసన!" అందామె అంతలోనే ఎంతో భారంగా.

ఆందోళనగా చూశాను. "నిరసన ఏమిటి?"

ఆమె అదే స్వరంలో అంది, "ఆయన నన్నెంత కఠినంగా పెంచారో, నన్నెలా విసిగిస్తున్నారో మీకు తెలియదు! వట్టి చాదస్తపు మనిషి!"

నవ్వాను. "మళ్ళీ అదేమాట! మీ రెండుకర్థం చేసుకోరు?"

"ఏమర్థం చేసుకోవాలి ఇంకా?"

"మీరాయనకు ఒక్కరే కుమార్తె. మిమ్మల్ని అపురూపంగా, అల్లారుముద్దుగా పెంచే ప్రయత్నంలో కొన్ని పరిమితుల్ని అతిక్రమించి వుండొచ్చు....అంతేకాని బుద్ధిపూర్వకంగా బాధించాలని కాదూ, విసిగించాలనీ కాదు."

ఇద్దరం లోనికెళ్ళాక ఆమెని కూర్చోబెట్టి ఎ.సి. ఆన్ చేశాను. ఆమె పైన, క్రింద చుట్టూ అంతా పరికించి చూస్తోంటే,నవ్వుకుంటూ వెళ్ళి ఎదురుగా కూర్చున్నాను.

"ఇంత పెద్ద ఇంట్లో మీరొక్కరే వుంటారా?" అందామె ఆశ్చర్యపడుతూ.

"ఉంటారా కాదు, వుంటున్నాను. నేను అన్ని సలాలికీ, ఏ వాతావరణానికై నా అలవాటుపడ్డ ప్రాణిని. నేనిక్కడ ఒంటరిగా వున్నా ఎవరో ఒకరు వచ్చి పోతూనే వుంటారు—"

"మీ బిజినెస్ ఎంతవరకొచ్చింది?"

"మరో మూడు రోజుల్లో ప్రారంభం కావాలి.... ఏర్పాట్లు పూర్తి చేస్తున్నాను. సక్సెస్ అవుతుందనే

నమ్మకం. ఇప్పుడు చెప్పండి, మీరెలా ఫీలవుతున్నారు? కోరగా కోరగా ఇన్ని రోజులకొచ్చారు ఇంటికి. పావన మైంది. చాలా ఆనందంగా వుంది. కాని, మొదట మీరు భయపడ్డారు కదూ?"

"అవును. నాకు పరిచయమైన మొదటి వ్యక్తి— నా ఉద్దేశం మగవారు - మీరే. మగవాళ్ళతో కలవాలంటే నాకు చాలా భయం. కానీ మీ పరిచయంతో ఆ భయాలన్నీ క్రమంగా తొలగిపోయాయి. నాకూ ఇప్పుడు ఆనందంగా వుంది!"

"పొరబడకండి, అందరూ నాలాగే వుండరు."

నవ్విందామె. మొదటిసారి పైకి ప్రత్యేకంగా గలగలా నవ్వేసింది! ముత్యాలు జలజల రాలుతున్నట్టు నా కళ్ళు తిరిగాయి....ఆ ధ్వని తరంగాలు ఇంట్లో ప్రతిచోటా, ప్రతిమూల స్పృశించి పవిత్రం చేశాయి!

తేరుకొని, "కూర్చోండి, ఇప్పుడే వస్తాను" అని లేచాను.

ఆమె దిగ్గున తలెత్తి చూసింది, ఎక్కడికన్నట్టు.

"కాఫీ పెట్టి వస్తాను....మీ రాక ఎంతో ఆనందం కల్గిస్తోన్నా, ఒకవైపు చాలా బాధగా వుంది."

"ఎందుకు?"

"మీకు మంచి విందు చెయ్యాలనుకున్నాను. కానీ నాకు వంటరాదు. మగపురుగుని. హోటల్ పక్షిని—"

"ఓహ్, ఫరవాలేదు. మీరలా బాధపడకండి! రోజూ ఎలాగూ బయట తినిపిస్తునే వున్నారుగా? ఆ భారీ తిండికంటే ఈ రోజు మార్పుకోసం చక్కటి కాఫీ ఇవ్వండి చాలు!"

"మీరు చాలా మంచివారు!" అన్నాను పరధ్యా

నంగా. కిచెన్‌లోకెళ్ళాక అక్కడ చెప్పవల్సిన మాట అదికాదని తట్టింది.

స్టవ్ ముట్టించి పాలగిన్నె పెడుతున్నప్పుడు నా చేతులు వణకసాగాయి....మనసులో అలజడి ప్రారంభమైంది.... అది పరుగులు తీస్తోంది....త్వరపడమంటోంది....ఇన్నాళ్ళుగా ఎదురుచూస్తున్న అవకాశం ఇదే! ఈ రోజు ఇలా నడిచివచ్చింది....దీన్ని వదులుకొంటే మళ్ళీరాదు. ఆమెని చూసిన క్షణంనుంచీ నన్ను తొలుస్తోన్న వాంఛ ఇప్పుడు పరాకాష్ఠ నందుకుంది. దాన్ని తీర్చుకోవాలి! ఉపశమనం పొందాలి! సంతృప్తిచెందాలి.

ఇంతకంటే అవకాశంలేదు. ఇంట్లో ఎవరూలేరు. ఆమె అరిస్తే బయటవిన్పించదు.

ధైర్యం కూడదీసుకొని అలికిడి కాకుండా హాల్లోకెళ్ళాను. నా నరాలు బిగుసుకొని వొళ్ళు సన్నగా కంపిస్తోంది. వేడిసెగల్ని వెళ్ళగ్రక్కుతోంది.

హాల్లో ఆమెలేదు.

ఆగిపోయి చుట్టూ చూశాను. ఎక్కడా కన్పించలేదు. కంగారుగా బయటికెళ్ళి చూశాను. అక్కడా లేదు.

నా ఆవేశమంతా ఎగిరిపోయి ఆందోళనగా, "అనుపమా!" అని పిల్చాను.

"ఏమిటీ....?" ఇంట్లోంచి విన్పించింది ఆమె కంఠం.

గిరుక్కున తిరిగి లోనికెళ్ళాను. ఆమె డ్రాయింగ్ రూం ద్వారంలో నిలబడివుంది, "ఎందుకు పిల్చారు?"

"మీరు కన్పించకపోతే....కాఫీ...." ఆవేశం తెచ్చుకొనే ప్రయత్నంలో ఏదో అన్నాను.

"నేనిక్కడే వున్నాను. పుస్తకాలు చూస్తున్నాను" అందామె.

వేగంగా ఆమెని సమీపించడంతో, ఆమె చటుక్కున తిరిగి పుస్తకాల రాక్ దగ్గరికెళ్ళిపోయింది.

"ఏం పుస్తకాలు! ఓహ్, ఎన్ని పుస్తకాలు!"

నాకింకా అయోమయంగా వుంది. మళ్ళీ ధైర్యం తెచ్చుకుని ఆమె దగ్గరికెళ్ళి నిలబడ్డాను.

"నేను పుస్తకాల పురుగుని" అన్నాను. అంత దగ్గరగా ఆమె వొంటినుండి వస్తోన్న సువాసనకి మన సంతా ఎలాగో అయింది.

ఆమె చటుక్కున దూరంగా జరిగింది.

నేను నవ్వుతూ మళ్ళీ అన్నాను. "పెర్రీ పుస్తకాలంటే పడిచస్తాను. ఎక్కడ ఏ టైటిల్ ఎన్ని సంస్థలు ప్రచురించినా పట్టుకొచ్చి ఇందులో నింపేస్తుంటాను.... ఇప్పుడు అన్ని ఎడిషన్స్ కలిపి ఇంచుమించు రెండొందలుంటాయి. అలాగే ఛేజ్ వి కూడా."

"ఇవన్నీ చదివేశారా?" అందామె కళ్ళు పెద్దవిచేసి.

ఆ చూపుల్లో అమాయకతకి ఇంకా నా మోటివ్ పసిగట్టలేదని కుదుటపడ్డాను.

"చదివేశాను___"

"మరిప్పుడేం చదువుతున్నారు?"

"ఈ క్రైమ్ సాహిత్యమంటే మొహం మొత్తింది. క్లాసిక్స్ చదువుతున్నాను"

"అన్నీ ఇంగ్లీషే నా.... తెలుగు చదవరా?"

నా కిపుడు విసుగుపుట్టింది. "చదువుతాను....మీ రేం చదువుతారు?" అడిగాను ఆసక్తిగా.

"నేనా!" అందామె ఎగాదిగా చూస్తూ, "మా నాన్న ఏదీ చదవనివ్వడు! వారపత్రిక ముట్టుకున్నా తిడ్తాడు!"

"ఏం?"

"అలాటి సాహిత్యం వల్ల మనసు పాడవుతుందట. అదో రకం మత్తులో పడిపోతామట.... ఆ మత్తులో లేనివీ అందనివీ వూహించుకొంటూ వాటికోసం తాపత్రయ పడతామట."

"ఆయన డాక్టర్ కదూ, అలాగే అంటారు."

"వట్టి మూఢవిశ్వాసాల చాదస్తపు మనిషి! ఇంట్లో క్షణం వుండబుద్ధి గాదు!"

"అలా కసురుకోకండి, పెద్దల్ని గౌరవించండి" అన్నాను, ఎలా తెగించాలా అని ఒకవైపు తీవ్రంగా ఆలోచిస్తూ.

"గౌరవానికో హద్దుంటుంది మోహన్. ఆ హద్దుని దాటేలా వాళ్ళే చేస్తారు, క్రమశిక్షణ పేరుతో ప్రాణం తీస్తూ."

"గాడ్, మీతో మాట్లాడను!" అన్నాను ఉలికిపడి.

"ఏం....?"

"మీరు చిన్నవయసులోనే పెద్ద మాటలు మాట్లాడేస్తున్నారు!" ఆమె వయసు 18 మించదని నాకు నమ్మకంగా తెలుసు.

"కొందరు మానసికంగా త్వరగా ఎదుగుతారు."

మాటకుమాట! సరే, ఇప్పుడు నా చర్యకు ప్రతిచర్య ఎలా వుంటుందో చూద్దామా? అనుకున్నాను.

అనుకున్నదే తడవు, నా వొంట్లో ఎక్కడలేని ధైర్యం, శక్తీ వచ్చేశాయి.... రెండు చేతులు మెరుపులా చాచి ఆమె కుడి హస్తాన్ని బలంగా పట్టేసుకున్నాను.

అర చేతి ఎముకలు చిటపటమన్నాయి.

ఆమె కరవాలము ముద్దబంతి పువ్వువంటి మృదు

లత్వమునూ, వెన్నముద్దవంటి సునిశిత్వమున్నూ కలిగి వుండెను....

ఒక్క క్షణమామె అఘాతం తిన్నట్టు కుంచించుకు పోయింది. ఆమె విశాల నేత్రాలు పులివాతపడ్డ లేడివలె బెదిరాయి. రక్తప్రసరణ హెచ్చి చెంపలు ఎర్రబడ్డాయి. కళ్లు నిప్పులు కురిపించాయి. ఆ మరుక్షణం—

"మోహన్!" అర్చిందామె.

"అనుపమా.... మై లవ్!"

"మోహన్! ఏమిటిది?"

"పరిచయం పెరిగిన కొద్దీ దగ్గరవాలనిపిస్తుంది....ఇది సహజం."

ఆమె చెయ్యివదిలి భుజాలు పట్టుకున్నాను. అప్పుడు నా ఆవేశము హెచ్చిన మూలాన, ఆ తరుణీమణి సునిశిత శరీరావయవాత్యాది అలంకారములచే ప్రేరేపించబడిన వాడై, తత్ కోమలాంగిని ఘట్టిగా ఘోరంగా వాటేసుకున్నాను—

"వెరీగుడ్, వెరీగుడ్, వెరీగూ....డ్! ఏమి అదృష్టం! నువ్వు యాక్షన్‌లో వుండగా ఎప్పుడూ చూడలేదు."

పదునైన కత్తి వెన్నులో గుచ్చుకున్నట్టు ఆమెను వదిలేసి వెనక్కి దూకాను. అనుపమ ఈసారి భయంకరంగా, గట్టిగా కేక పెట్టింది.

ద్వారంలో నిలబడివున్న సుభాష్ కళ్ళు అప్పుడే ఆమె పైన ఆకలిగా కదులుతున్నాయి.... గారపట్టిన పళ్ళు చూపిస్తూ వెకిలినవ్వు విసిరాడు.

నేనప్పటికి పూర్తిగా తేరుకొని ముందుకెళ్ళాను ఆవేశంగా.

"నువ్వెందుకొచ్చావ్?" అన్నాను కోపంగా.

మరో వెకిలి నవ్వు విసిరాడు. విస్కీ వాసన గుప్పున కొట్టింది.

"అనుకోకుండా వచ్చేశాను. నువ్వు యాక్షన్‌లో వుంటావనుకోలేదు, సారీ."

"గెటవుట్!"

"అలా అరవకు. ఇప్పుడు వెళ్ళే ఆలోచనలేదు. నువ్విక్కడ చక్కటి ఏర్పాటు చేశావు .... నువ్వు ముందు ప్రొసీడవు. నేను బయట వెయిట్—"

"యూ బ్లడీ.... వెళ్ళిపో ఇక్కడ్నుంచి!"

"నో, మోహన్. నువ్వు నన్నిలా ట్రీట్ చెయ్యకూడదు. నీ ఫ్రెండ్‌ని. నువ్వు ప్రతిదాంట్లో నాకు భాగమిస్తూ వచ్చావు."

"అంటే, నీ చెల్లెలితో కూడా—"

"ఎవరు చెల్లెలు? నువ్వు నీతులు మాట్లాడి టైం వేస్టు చెయ్యకు. వెళ్ళి బయట వెయిట్ చెయ్, నేను ప్రొసీడవుతాను."

నన్ను ప్రక్కకు నెట్టేసి త్రాచుపాములా లోనికి కదిలాడు. అనుపమ భయంతో బిక్కచచ్చిపోయింది.

సుభాష్ బిగ్గరగా నవ్వేసి ఆమెని సమీపించాడు. ఆలస్యంగాకుండా వాళ్ళిద్దరిమధ్యకు దూకాను. సుభాష్ ముఖంమీద చాచికొట్టి వెనక్కినెట్టాను. వెల్లికిలాపడ్డాడు.

"సుభాష్! నువ్వు తెలివిలో లేవు, వెళ్ళిపో!"

"నువ్వు నన్నెప్పుడూ ఇలా ట్రీట్ చెయ్యలేదు, మోహన్" అన్నాడతను లేస్తూ, అనుపమ దగ్గరికి జరిగి నా చెయ్యిపట్టుకుంది, "ఆమెలో నాకూ భాగం వుంది! ఇన్ని రోజులుగా ఆమెని నీతో చూసీ చూసీ విసిగిపోయాను! మొదటి అవకాశం నీకే ఇచ్చాను. కానీ

నువ్వెప్పుడూ ఉపయోగించుకోలేదు. ఇప్పుడు భాగం కూడా లేదంటున్నావ్. ఇది అన్యాయం మోహన్. తప్పుకో!"

అతను రెప్పపాటు కాలంలో వేగంగా కాలెత్తి నా మెడమీద కరాటే కిక్ ఇచ్చాడు. బొంగరంలా తిరుగుతూ వెళ్ళి గోడకి ధభీమని గుద్దుకొని బోర్లాపడ్డాను.

అనుపమ వెర్రికేకతో బయట కరకబోయింది.

సుభాష్ ఆమె చెయ్యిపట్టి వెనక్కి లాగేశాడు విసురుగా.

"కమాన్, డోంట్ బాదర్. నీమీద మోహన్ చాలా టైం వేస్ట్ చేశాడు. నీలాంటి సౌందర్యరాశిని ఎప్పటికప్పుడు ఆస్వాదించాలని వాడికి తెలియదు."

శక్తంతా కూడదీసుకొని గబుక్కున లేచాను. గోడకి వ్రేలాడుతున్న బుల్‌వర్కర్ అందుకొని ముందుకు గెంతాను.

"సుభాష్, ఆమెమీద చేతులేశావంటే మాడు ఏం చేస్తానో!"

"ఏం చేస్తావ్?" వెటకారంగా నవ్వాడతను.

"నీ చేతులిరగ్గొట్టి చెరో జేబులో పెడతాను."

అతని చెయ్యి మెరుపులా జేబులోకెళ్ళి కత్తితో బయటికొచ్చింది. నేను బుల్‌వర్కర్ విసిరి దాన్ని ఎగరగొట్టాను వెంటనే. అతను రెచ్చిపోయిన ఆంబోతులా నామీదికి దూకి గొంతుపట్టుకున్నాడు. నాకు ఊపిరి కష్టమై చేతులు తోటకూర కాడల్లా వేళ్ళాడేశాను. బుల్‌వర్కర్ జారి క్రిందపడింది.

అతికష్టంమీద గొంతు పెగిల్చి, "అనుపమా, నువ్వు పారిపో!" అన్నాను.

అప్పటివరకూ పాతేసిన స్తంభంలా వున్న ఆమె, కాళ్ళకి చక్రాలు కట్టుకొని బయటికి పరుగుతీసింది.

అది చూసి సుభాష్ నన్ను వదిలేసి ఆమెవెంట పడ్డాడు. సగం చచ్చినవాడిలా వెంబడించాను. కాని ద్వారంలో సుభాష్ నేలమీదవున్న కత్తి అందుకొని పిచ్చిగా, కసిగా వెనక్కి తిరిగి నన్ను ఢీకొన్నాడు. అతని చెయ్యి పైకిలేచి నా గుండెల్లో దూసుకుపోయేం తలో, దాన్ని పట్టి మెలేసి అతని కుడి కంటిమీద పిడి కిలితో బిగించి కొట్టాను.

సుభాష్ తల పట్టుకొని బాధగా కత్తివదిలేశాడు.

అప్పుడు నా ఆవేశం పెచ్చుమీరిపోయింది. ఆ క్షణంలో ఏం చేస్తున్నానో నాకే తెలియదు. తటాలున వంగి కత్తి అందుకొని అతని కడుపులో పొడిచాను కసిగా. బయటికిలాగి తిరిగి గుండెలో పొడిచాను బలంగా.

సుభాష్ భళ్ళున రక్తం కార్చుకుంటూ, నిస్సత్తువుగా పెదవులు కదిలిస్తూ క్రిందపడిపోయాడు....

## 2

సిగరెట్ వెల్గించి గది చీకటిచేశాను. బెడ్ మీద బోర్లా పడుకొని ఆకాశంలో చుక్కల్ని చూడసాగాను. ఆందోళన దూరం చేసుకోవాలని వాటిని లెక్కించ సాగాను....కాని మనసు దానిమీద లగ్నంకావడంలేదు.

సుభాష్....వాడు స్టుపిడ్! బద్మాష్! వెధవ! అంతా అప్ సెట్ చేశాడు. ఎంతో సునాయాసంగా సక్సెసయ్యే వ్యవహారాన్ని మొదట్లోనే చెడగొట్టాడు. అంతా బెడిసి కొట్టింది. మళ్ళీ మొదటినుంచి ప్రారంభించాలి....ప్రారం భించాలా? పరిస్థితి ఇలా మూపుదాల్చక అది సాధ్యమా? చాలా కష్టం. ఆమె ఇప్పుడు నన్ను అసహ్యించుకు

కుంటుంది. మళ్ళీ ఆమెని ప్రసన్నం చేసుకోవడం కలలోని మాట!

ఒక్కసారిగా నిరాశ అలుముకుంది....

లేదు! అలా జరక్కూడదు! జరగటానికి వీల్లేదు! ఏ మహమ్మారి ఆవహించిందో, మనసులో దురుద్దేశంతో ఆమెపట్ల అలా ప్రవర్తించాను. ఇప్పుడు ఏడ్వాలి! సిగ్గు పడాలి! ఆ దుర్బుద్ధిని ఇకనైనా మట్టుబెట్టి సంస్కారమున్న ప్రాణిలా క్షమాపణ వేడుకోవాలి. అప్పుడు ఏ కొంత అవకాశం వున్నా వినియోగించుకొని తిరిగి ఆమె అనుగ్రహం పొందాలి.

నో, నేను వూరికే ఆందోళన పడుతున్నాను. అను పమలో అంత కాఠిన్యం లేదు, ఉండదు. నా పరిస్థితిని విశాల హృదయంతో అవగాహన చేసుకుంటుంది.

పైకి కన్పించదుగాని, అంత చిన్న వయసులోనే జీవితంలోని సమస్త వికారాన్ని, విషాదాన్ని, వైరాగ్యాన్నీ, కాచి వడబోసి వంటబట్టించుకొన్న తాత్వికురాలు ఆమె. కాని చాలా అరుదుగా బయటపడుతుంది. వయసులో పదేళ్ళు పెద్దవాడ్ని అయినా మానసికంగా ఆమె నాకంటే బాగా ఎదిగింది. మితిమీరిన గారాబం గల తండ్రి పెంపకంలోని కాఠిన్యం ఆమెనలా తీర్చి దిద్దింది....ఆమె గురించి నేను తప్పగా వూహిస్తున్నాను. ఆమె నన్ను తప్పకుండా క్షమిస్తుంది.

ఈ పదిరోజుల పరిచయంలో ఆమె నాకు చాలా సన్నిహితమైంది. మాక్స్‌ముల్లర్ భవన్‌లో ఫోటో ఎగ్జిబిషన్‌లో కన్పించినప్పుడు నేనే ఆమెని చేరదీశాను. స్వేచ్ఛగా తిరగలేని భయాన్ని వెళ్ళగొట్టాను. నామీద విశ్వాసం కల్పించాను. నేనంటే ఆసక్తి సృష్టించాను.

నాలుగు రోజుల్లో ఆమె సందిగ్ధావస్థనుంచి బయటపడి నాకు పూర్తిగా ఆత్మీయురాలైంది. ఆ ఆత్మీయుతతో ఎన్నో విషయాలు చెప్పింది. వ్యక్తిగతమైనవీ, ప్రాపంచికమైనవీ.

అయితే ఈ పరిచయాన్ని కేవలం స్నేహంగానే తీసుకుంటుందో లేక, ప్రేమించే సాహసానికి పూనుకుంటుందో అర్థం చేసుకోలేకపోయాను. అర్థం చేసుకోకపోగా ఆ కృత్యానికి పాల్పడ్డాను. వెధవపని! ఎంత అవివేకం!

ఆమెకు ఇప్పుడు తండ్రి పెద్ద సమస్య అయి కూర్చున్నాడు. భారత రాజ్యాంగం నిర్దేశిస్తున్న ప్రాథమిక హక్కుల్లో ఏవీ ఆమె అనుభవించనీయకుండా నియంతృత్వాన్ని కొనసాగిస్తున్నాడు. చాదస్తపు మనిషి! మూఢవిశ్వాసాల పుట్ట! తండ్రి ప్రస్తావన వచ్చినప్పుడల్లా అనుపమ ఈ పదజాలం ఉపయోగిస్తుంది....

నిజంగా ఆమె తండ్రి మూఢవిశ్వాసాల మనిషి. మరి కొంత మూర్ఖత్వం కూడా మూర్తీభవించిన వ్యక్తి.

ఆయన్ని నేనింకా చూడలేదుగాని, అనుపమ చెప్పిన దాన్నిబట్టి వయసు 70 వుంటుంది. జవసత్వాలుండగా డాక్టర్ గా విశేషమైన పేరుప్రఖ్యాతులు, డబ్బూ గడించాడు. ఇప్పుడు గుండె జబ్బు రోగి. బయట ప్రపంచంతో సంబంధాలు పూర్తిగా తెంచుకొని ఇంట్లో విశ్రాంతిగా గడుపుతున్నాడు.

అయితే దురదృష్టం ఒకటుంది. అతనికున్న ఇద్దరు సంతానంలో కుమారుడు పెద్ద అప్రయోజకుడు. తండ్రి తర్వాత ఆస్తుల్ని అజమాయిషీ చేసే అర్హత అతనికి లేదు. సకల దురభ్యాసాలు అతని సొత్తు. డాక్టర్ సంగర్షన్

రెడ్డి ఖమ్మంనుంచి వచ్చి ఇక్కడ హైద్రాబాదులో స్థిర పడ్డాడు ఇరవై ఏళ్ళ క్రితం.

ఖమ్మంలో అతను పెద్ద భూస్వామి కూడా. అక్కడ మిరపపంట ఉత్పత్తిలో అతనిదే పైచేయి. హైద్రాబాదులో మూడు పెద్ద భవనాలు, ఒక టూరిస్టు కంపెనీ వున్నాయి. బేగంపేటలో పెద్ద బంగళాలో నివాసం. భార్యలేదు....కోడలికి ఏ పట్టింపూ లేదు. ఆమె ఎవర్నీ పట్టించుకోదు. ఆమె లక్ష్యాలు వేరు, ఉద్దేశాలు వేరు.

సరస్వతిని నేనొక్కసారే చూశాను. ఓ సాయంత్రం అనుపమను ఇంటిప్రాంతాల దిగబెడుతున్నప్పుడు. అప్పుడు ఆమె ఇంట్లోంచి కార్లో ఎక్కడికో బయలుదేరింది. ఆమెకు డ్రైవింగ్ వచ్చు. ఆమెని చూశాక ఎందుకో నాకు నచ్చలేదు. చూసింది కొన్ని క్షణాలైనా, ఆ ఒక్క చూపులో ఆమె మనసులో భావాల్ని పసిగట్టేశాను. ఏదో కుట్ర మనసులో వుంచుకొని డాక్టర్ కోటలో పాగా వేసిన దొంగల రాణిలా కన్పించింది.

అనుపమ అన్నయ్య సునీల్‌ని రెండుమూడుసార్లు చూశాను. అన్నిసార్లూ పేరేడ్ గ్రౌండ్స్ దగ్గర మొగల్ రూంలోనే కన్పించాడు. ఒకరాత్రి అక్కడినుంచి ఇంటికే వెళ్ళలేదు. శృంగార వనితల ముఠాతో పనిబడితే ఆ రాత్రి అతనికి ఇల్లు పట్టదట.

ఇవన్నీ—ఆ ఇంట్లో మనుషులందరి గురించి ఆలోచిస్తోంటే—అనుపమ ఇలా, ఏ అన్యోన్యతకూ ఆప్యాయతకూ నోచుకోకుండా, ఎంతటి కఠోరమైన వాతావరణంలో నలిగిపోతుందో తలపుకొచ్చి నా గుండె తరుక్కుపోతోంది!

లేదు! ఆమెని ఎలాగైనా మళ్ళీ నా వైపుకు తిప్పు

కోవాలి. సభ్యతగా నడచుకోవాలి. అప్పుడు అంతా సవ్యంగా జరిగిపోతుంది....

ఒక్కసారిగా ఫోన్ మ్రోగడంతో అదిరిపడి తేరుకున్నాను. మరుక్షణం తేలికపడ్డాను. సుభాష్ గురించి నేను అణచిపెట్టుకున్న ఆలోచనలే ఇలా భయపడేలా చేశాయి.

అయితే ఇప్పుడు ఫోన్ చేస్తోందెవరు? అనుపమా....? ఇందాకే ఆమె ఇంటికి ఫోన్ చేశాను. కానీ ఆమె వదిన పలకడంతో—పెట్టేశాను. ఇప్పుడు అనుపమ చేస్తోందా?

ఆత్రుతగా రిసీవరెత్తాను.

"హలో, మోహన్!" విన్పించాయి మాటలు.

ఆ గొంతు విని నా వీపు కమ్చీతో కొట్టినట్లు ఝల్లుమంది! లేచి కూర్చున్నాను గబుక్కున.

"హలో, రేణూ....ఏమిటి?" గొణిగాను.

"మోహన్, అక్కడ అన్నయ్య వున్నాడా?"

జాగ్రత్తపడ్డాను. నెమ్మదిగా అన్నాను, "లేదు.... ఇక్కడికి రాలేదు."

"మరెక్కడి కెళ్లాడు? ఇప్పుడు పదవుతోంది.... సాయంత్రమనగా వెళ్ళాడు."

చిన్నగా, బలహీనంగా నవ్వాను. "నీకు తెలియందేమిటి, రేణూ? దారిలో ఏ బారో ఆవోయార్—అని వుంటుంది. అనవసరంగా కంగారుపడకు! కాస్సేపట్లో వచ్చేస్తాడు."

"నీ దగ్గరికి రాలేదా?"

"రాలేదు, వస్తే తెలియజేస్తాను. కాని ఇంత రాత్రి రాడనుకొంటాను."

"నాకేదో భయంగా వుంది, మోహన్."

"మీ ఆడవాళ్ళకున్న ఆయుధాల్లో భయం ఒకటి! దాంతో నన్ను కంగారు పెట్టకు. నువ్వు కంగారుపడకు. వాడెక్కడికి పోతాడు....?" తక్కున ఫోన్ పెట్టేసి మరో సిగరెట్ వెల్గించాను.

రేణుక....సుభాష్ చెల్లెలు!

ఈమెని జాగ్రత్తగా కనిపెట్టాలి. పరమ అసాధ్యురాలు! సుభాష్ గురించి ఏ కొంచెం అనుమానం కల్గినా, అది ఆమె మనసులో మహా వృక్షమై నిలబడుతుంది. అప్పుడామె ఆలోచనలు కుమ్మరి పురుగులా బయలుదేరి దాన్ని తొలచి, తొలచి చివరికి అసలు నిజం బయటికి లాగుతాయి! అప్పుడు నా వినాశనం తప్పదు.

ఆమె పరమ అసాధ్యురాలు!

అసలు ఇలాటి దుర్దినం వస్తుందని నేనెప్పుడూ అనుకోలేదు. సుభాష్‌ని నా చేతులతో చంపుతానని కలలో కూడా అనుకోలేదు. మా అయిదేళ్ళ స్నేహం ఇంత దురదృష్టకరంగా ముగుస్తుందనుకోలేదు. మా మధ్య ఎప్పుడూ ఏ తగవూ లేదు, ఒక్క తాగుడు విషయంలో విభేదాలు తప్ప.

సుభాష్ మితిమీరి తాగుతాడు. తాగితే అతన్నెవరూ అదుపుచేయలేరు. ఎన్నోసార్లు ఎన్నో గొడవల్లో నేనే విడిపించాను. తాగవద్దని హెచ్చరించాను. నాతో స్నేహం వదులుకోమని బెదిరించాను. అప్పుడు తాగనని ఒట్టువేసి, కొన్ని రోజులు బాగానే వుంటాడు. తర్వాత మళ్ళీ వ్యవహారం మామూలే.

పదిరోజులు క్రితమే సీరియస్‌గా మందలించాను. ఈ అలవాటు అతనికేగాక అతని చెల్లెలికీ, నాకూ కష్టాలు

తె స్తుందని. మానుకోవడం చేతగాకపోతే మమ్మల్ని వదలి దూరంగా వెళ్ళిపొమ్మన్నాను. ఆ రోజు మా మధ్య పెద్ద గొడవ జరిగింది....కాని రేణుక జోక్యంతో చల్లారింది.

ఇక అతని గురించి పట్టించుకోకూడదనుకున్నాను. ఏ గొడవలో ఇరుక్కున్నా విడిపించకూడదని నిశ్చయించుకున్నాను. అంతేగాక ఈ మధ్య నన్నూ అనుపమను గమనిస్తున్నాడని తెలిసి నేనే ఇంకా దూరంగా వుంటున్నాను.

సుభాష్ నాకు చెందే ప్రతీదాంట్లో భాగం కావాలనే సోమరి స్వభావం కలవాడు. ఏదీ స్వయంగా సాధించుకోడానికి ప్రయత్నించడు! అనుపమతో అతనికి ఏ మాత్రం అవకాశం చిక్కకుండా వెయ్యికళ్ళతో కని పెట్టాను. కానీ ఈ రోజు ఇలా జరిగింది....ఇలాగే జరగాలి! బాస్టర్డ్. అంతా వాడే కోరి తెచ్చుకున్నాడు.

ఇప్పుడతని శవం మేడమీద ఓవర్ హెడ్ టాంకులో వుంది. అందులో నీళ్లు తీసేసి దాచాను. రహస్యంగా వుంటుంది. ఎవరికీ అనుమానం రాదు. తర్వాత వీలుచూసుకుని తరలించవచ్చు. రేణుకకు ఏ చిన్న అనుమానం కలక్కూడదు. ఆమె అరా తీయవచ్చు....అప్పుడు సుభాష్ ఇంట్లో ప్రవేశిస్తుండగా చూశామని పొరుగువాళ్ళు ఎవరైనా చెప్తే ఏమవుతుంది? నాకు చావో, జైలో తథ్యం! ఆ పరిస్థితిలో ఆమెని కాదని నమ్మించడం నా తరంగాదు!

ఆ పరిస్థితి రాకుండా చూడాలి. సుభాష్ గురించి ఆలోచనలతో ఆమెని జోకొట్టాలి....

ఆలోచనలతో బరువెక్కిన తలపట్టుకొని బాత్

రూంలోకి వెళ్ళాను. అయిదు నిమిషాలు షవర్ క్రింద నిలబడ్డాక గానీ మనసు తేలికపడలేదు. ఎంతో హాయి అనిపించసాగింది....

అప్పుడే అనుపమ జ్ఞాపకం వచ్చింది—

పూర్ క్రీచర్! ఏం చేస్తోందామె? జరిగిన అవమానం ఎవరికైనా చెప్పకుండా? ఎవరికి చెప్తుంది? ఇంట్లో అంతా ఎవరికివారే యమునాతీరే—అయితే ఒంటరిగా కుమిలిపోతోందా? అసలు ఇంటికి వెళ్ళిందా....?

ఈ ఆలోచనకి ఆందోళన చెందాను. వెంటనే ఫోన్ ఎత్తి మళ్ళీ డయల్ చేశాను. నా గుండె అదురుతోంటే సమాధానం కోసం కాచుకున్నాను.

ఇంతలో గొంతు వినిపించింది. "హలో....ఎవరూ?"

అది అనుపమ! సందేహంలేదు....ఆమే!

"అనూ....అనుపమా!" అన్నాను అస్పష్టంగా.

"ఎవరది?"

"నేను మోహన్ని. సారీ, అనుపమా...."

"మోహన్, ఇంత రాత్రి ఎందుకు పిల్చావ్?"

"నీతో....నీతో మాట్లాడాలి."

"నీతో మాట్లాడను, మోహన్."

"ప్లీజ్! పెట్టేయకు! నా మాట విను. జరిగిందానికి నేను చాలా బాధపడుతున్నాను—"

"నీకలాటి ఫ్రెండ్ వుంటాడనుకోలేదు. నీచుడు!"

"వాడొక్కడే అలా దొరికాడు. నన్ను క్షమించు అనుపమా, మళ్ళీ ఎప్పుడూ ఇలా జరగదు! నువ్వంతా మర్చిపో! వాడు మళ్ళీ నా ఛాయలకి రాకుండా—"

"నేనిప్పుడు నీతో మాట్లాడను, మోహన్!"

"ఆగు! నన్నూ వాడిలాగే భావిస్తున్నావా?"

"ఓహ్, నన్ను విసిగించకు! నా మనసు బాగాలేదు."

"అయితే....అయితే నన్ను క్షమించనంటావా?"

"మోహన్, ప్లీజ్, నేనిప్పుడేమీ చెప్పలేను!"

"సరే, సుభాష్‌లాగే నేనూ ప్రవర్తించాను. అలా తెలియని ఆవేశంలో చేశానని సమర్థించుకోలేను. తెలిసీ బుద్ధిపూర్వకంగానే చేశాను. ఇప్పుడు బాధపడుతున్నానని చెప్పుకోను. కాని నువ్వు బాధపడుతుంటే చూడలేను, అనుపమా! నన్ను క్షమించానని చెప్పు!"

"నేనేదీ గ్రహించే స్థితిలో లేను, మోహన్ ఇంట్లో చూస్తే—"

"ఏం జరిగింది అనుపమా?"

ఆమె మాటలు ఒక్కసారిగా ఉప్పెనలా ముంచుకొచ్చాయి. "నాన్న అన్నయ్య పోట్లాడుకున్నారు! ఆ గోల భరించలేక వదిన సినిమాకెళ్ళిపోయింది! అన్నయ్య పైన గదిలో వస్తువులు విసిరేస్తున్నాడు! నాన్న క్రింద హాల్లో ఉద్రేకంతో చిందులు వేస్తున్నాడు! ఆయన్ని చూస్తే....ఆయన దగ్గరికెళ్ళాలంటే....ఓహ్, మోహన్ నాకు దూరంగా పారిపోవాలనుంది!"

"ఎందుకు?....పోట్లాట ఎందుకు జరిగింది?"

"ప్లీజ్ ....ఇప్పుడు నన్నేమీ అడక్కు."

"సరే, నన్ను క్షమిస్తే రేపు కలుసుకుంటావా?"

"ఎక్కడ?"

"సాయంత్రం టాంక్ బండ్ మీద, ఆరుగంటలకి,"

తేలిగ్గా నవ్వుకొని ఫోను పెట్టేశాను.

అప్పుడే ఏదో అలికిడి విన్పించింది. అడుగుల చప్పుడు. అవి వేగంగా పరిగెడుతున్నాయి....తటాలున కిటికీలోంచి తొంగిచూశాను. గేటువేపుకి ఎవరిదో నీడ వురుకుతోంది..

స్త్రీ నీడ!

సంభ్రమించిపోయాను.

నా వొళ్ళు జలదరించింది.... అరిచి ఆమె నా పేరుకు శక్తి చాల్లేదు.

## 3

మర్నాడు ఉదయం తొమ్మిది గంటలకి రేణుక ఫోన్ చేసింది.

"మోహన్, రాత్రంతా అన్నయ్య రాలేదు."

"ఏమిటీ న్యూసెన్స్! నన్నేం చెయ్యమంటావ్?" అర్చాను కోపంగా.

"నీ దగ్గరికి రాలేదా?"

"వస్తే ఫోన్ చేస్తానని చెప్పానా?"

"చంద్రన్‌తో నీ దగ్గరికే వెళ్తున్నట్లు చెప్పాడట."

"చెన్నారెడ్డితో చెప్పి బయలుదేరి వుండొచ్చు. నా దగ్గరికి రాకపోతే ఏం చెయ్యాలి? వెధవ న్యూసెన్స్?"

"మరెక్కడికెళ్ళాడు. అలా నన్నొదిలి ఎన్నడూ వెళ్ళలేదు. వెళ్ళినా ఫోన్ చేస్తాడు. మోహన్ నాకేదో దిగులుగా వుంది ..."

"ఏమిటి నీ అనుమానం?"

"వాడ్ని అరెస్టు చేశారేమోనని.... తాగి ఎక్కడైనా గొడవచేస్తే...."

నవ్వాను. "అలా జరగడం మంచిదేగా? దారికొస్తాడు."

"నేను నీ దగ్గరికి రావాలనుకుంటున్నాను, మోహన్."

"దేనికి?"

"నాకేదీ స్పష్టంగా తెలియడంలేదు. నా మనసేదో కీడు శంకిస్తోంది. ఈ మధ్య నీకు అన్నయ్యతో పడ్డం

లేదు కదూ?"

"అయితే?"

"మీరిద్దరు మళ్ళీ గొడవపడి—"

"చెప్పు,"

"అసలు నాకేదీ అర్థంగావటంలేదు!"

"కీప్ యువర్ ట్రాప్ షట్ అండ్ కీప్ క్వయిట్, రేణూ! పిచ్చి అనుమానాలతో బుర్ర పాడుచేసుకోకు!"

"నేనిప్పుడే వస్తున్నాను—"

"రాకు! నేను బయటికెళ్తున్నాను. సాయంత్రం దాకా రాను!" తక్కున ఫోన్ పెట్టేసి బయటికొచ్చాను. ఏమీ తోచలేదు. ఆమె ఏదైనా పసిగట్టిందా? రాత్రి ఆమె దేనికొచ్చింది? ఏం చేసింది? నామీద ఆమెకే ఆధారం దొరకలేదని ఇప్పుడామె మాటల్నిబట్టి అర్థమవుతోంది. ఆమె మాటల్లో కంగారు వుంది, ఆందోళన వుంది. లేకపోతే ఎప్పుడో ప్రళయం సృష్టించి వుండేది.

ఎవరో ఎనిమిదేళ్ళ కుర్రాడు గేటు తెరుచుకొని లోనికొస్తూ కన్పించాడు.

తేరుకొని, "ఏయ్‌ః! ఎవర్నువ్వు?" అనర్చాను.

అతను నన్నూ, పైన ఆకాశానికేసీ రెండుమార్లుచూసి "మీ ఇంటిమీద గద్దలు వాలుతున్నాయండీ!" అన్నాడు.

"గద్దలా...." అన్నాను తికమకగా.

"అవును, చూడండి!"

అతన్ని చేరుకొని వెనక్కితిరిగి తలపైకెత్తి చూశాను.

నా శరీరం గజగజా వణికింది.

డాబామీద మూడు-నాలుగు గద్దలు ఎగురుతున్నాయి. మరికొన్ని టాంకుమీద కూర్చొని ముక్కుతో పొడుస్తున్నాయి.

"అవెందుకు వాలుతున్నాయి? మా ఇంటిమీ దెప్పుడూ వాలవు!" అన్నమాటలకి తేరుకొని అతన్ని చూశాను. అమాయకంగా చూస్తున్నాడు.

"నువ్వెళ్ళు, వెళ్ళిపో!" అన్నాను, కళ్ళతో భయపెడ్తూ.

అతను వెనుదిరిగి పరిగెత్తాడు. కొన్ని క్షణాలు ఏం చెయ్యాలో పాలుపోలేదు. గద్దలు శవాన్ని పసిగట్టాయి! ప్రమాదకరం! వెంటనే శవం అక్కడినుంచి తొలగించాలి!

వేగంగా ఇంటివెనుక కెళ్ళి షెడ్డులోంచి పొడవాటి కర్రతీశాను. దానితో మెట్లెక్కి డాబా చేరుకున్నాను. ఖాళీ విస్తళ్ళముందు కూర్చున్న అతిథుల్లా కన్పించాయి గద్దలు టాంకు మీద. గొంతుచించుకొని ఒక్క అరుపు అర్చాను. అవి బెదిరాయి. కానీ కదల్లేదు. కర్రతిప్పి టాంకుకేసి బాదాను. అప్పుడవి ఒక్కసారిగా కీ....హ్! హ్!....హ్!! మంటూ నా గుండె లవిసేలా అరుస్తూ పైకెగిరాయి. మరోసారి కర్రతిప్పాను. రెండుమూడు గద్దలకి టపటపమని కొట్టుకుంది....అవింకా అరుస్తూ పైకళ్ళాయి. కొన్ని క్షణాల్లో పూర్తిగా చెదిరిపోయాయి.

అప్పుడు తేలికపడి చుట్టూ చూశాను. చుట్టుప్రక్కల డాబాల మీదెవరూ లేరు. నన్నెవరూ గమనించడంలేదు. కర్రపడేసి ఆయాసంగా టాంకుమీదెక్కాను. నెమ్మదిగా మూతలాగి చూశాను—గుప్పుమని ఒక్కసారిగా కొట్టిన వాసనకి కడుపులో దేవినట్టయింది....కిందికి దూకి గోడదగ్గర కురికి వాంతి చేసుకోబోయాను. కానీ అదుపుచేసుకొని ముక్కూ నోరు కర్చీఫ్‌తో కట్టుకొని తిరిగి టాంకు

ఎక్కాను.

శవం కొయ్యబారివుంది. పెల్లుబికివచ్చిన జీవంలేని కళ్ళు నాలో భయాన్ని పుట్టించాయి. ఆ కళ్ళ వెనుక నుంచి అతని ఆత్మ నన్ను గమనిస్తోందనిపించింది.... కళ్ళు గట్టిగా మూసుకొని రెండు కాళ్ళుపట్టుకొని పైకి లాగాను. చాలా బరువుగా వుంది.

పూర్తిగా పైకితీసి, డాబా గచ్చు మీద దింపసాగాను..

అప్పుడు చూశాను మెట్లదగ్గర—

అతను చూస్తున్నాడు కళ్లూ, నోరు తెరిచేసి—

కాళ్ళూ, చేతులు నా చేతుల్లో శవంలాగేవున్నాయి.

హఠాత్తుగా ప్రాణం వచ్చి దిక్కులదిరేలా కేక పెట్టాడు.

వెనక్కితిరిగి వేగంగా పరిగెత్తాడు.

నా చేతిలో శవం దబ్బుమని వదిలేసి కిందికి దూకేశాను. అతని వెనుక పరుగుతీస్తూ అర్చాను, "ఆగు!" అతను వేగంగా మెట్లుదిగుతున్నాడు. "ఆగక్కడ!"

మరో మూడంగల్లో అతన్ని పట్టుకుంటూ ననగా, కాళ్ళు మెలికపడి మెట్లమీంచి దొర్లి పోయాడు.

గబగబా దిగి అతన్ని పట్టుకున్నాను. గజగజ వణికి పోతున్నాడు. చావు భయంతో చూస్తున్నాడు....

"నువ్విక్కడికెందుకొచ్చావ్?" గర్జించాను.

"నన్ను కొట్టకండి! వెళ్ళిపోతాను—"

"ఇక్కడికెందుకొచ్చావ్?" రెట్టించాను.

"మీరు గద్దల్ని కొడుతోంటే చూద్దామని...."

అతని ముఖంమీద గట్టిగా కొట్టాను. "బద్మాష్! అడక్కుండా ఇళ్ళలో జొరబడే అలవాటుందా నీకు?"

"నన్నొదిలేయండి! కొట్టకండి—"

"ఇప్పుడు వదలను. నువ్వు చాలా చూశావు, పద!" మెడపట్టి ఇంట్లో లాక్కెళ్ళాను. గింజుకొంటోంటే వీపు మీద బాదాను.

బెడ్ రూం ప్రక్కన గదిలో తోసి, "ఇక్కడే వుండు, అరిచావంటే చంపేస్తాను!" అన్నాను. తలుపు గడియ పెట్టి వేగంగా షెడ్ లో కరికి తాడు కొన్ని గుడ్డలు తెచ్చాను.

"చూడు బాబూ! నువ్వల్లరి చెయ్యకుండా వుంటే అన్నంపెడ్తాను, హార్లిక్స్ తాపిస్తాను. నువ్వు కొన్నాళ్ళు ఇక్కడే వుండాలి."

"నన్నొదిలేయండి. ఎవరికీ చెప్పను."

"నువ్వు చూడకూడనిది చూశావు. నిద్రలో కలవరిస్తావు."

"మమ్మి నాకోసం చూస్తుంటుంది!"

"నీ మమ్మీతో నేను మాట్లాడతాను. మీ ఇల్లెక్కడ?"

"ఎదురు వరుసలో పచ్చ ఇల్లు."

"మీ నాన్న ఏంచేస్తాడు?"

"బ్యాంక్ మేనేజర్."

"వెరీగుడ్. ఇంట్లో ఫోన్ వుందా?"

"వుంది."

"నెంబర్ చెప్పగలవా?"

అతను గబగబా చెప్పాడు.

"వెరీగుడ్. నీ పేరేమిటి తమ్ముడూ?"

"వినయ్."

"నాన్న పేరు?"

"నందనరావు."

అతడినుంచి ఇంకా కొన్ని వివరాలు తెలుసుకొని

సిగరెట్ వెలిగించాను. నేనలా స్నేహంగా ప్రవర్తించడంతో వదిలేస్తానన్న ఆశ కన్పించింది అతని కళ్ళలో.

అతని కాళ్ళూ చేతులు తాడుతో కట్టేసి, నోటికి గుడ్డ చుట్టాను. బిత్తరబోయి చూశాడు. మాట్లాడేందుకు ప్రయత్నించాడు.

"నువ్విక్కడ నిశ్శబ్దంగా వుండాలి. త్వరలో వదిలేస్తాను" అన్నాను.

అతని కళ్ళలో గిరుక్కున నీళ్ళు తిరిగాయి. అవి చెంపలమీదుగా జారుతోంటే తలతిప్పుకొని బయటికొచ్చేశాను. గదికి తాళంవేసి డాబా చేరుకున్నాను దుప్పటితో.

శవం దుప్పట్లో చుట్టి మోసుకొచ్చి పెరట్లో బావిలో ఎత్తేశాను. అంతే, ఇదే అనువైనచోటు. ఈ పనిరాత్రి చేసివుంటే ఈ అనర్థం జరిగేది కాదు.

ఇంట్లోకొచ్చి రెండు నిమిషాలు సిగరెట్ తాగుతూ గడిపాను. తర్వాత ఫోన్ ఎత్తి డయల్ చేశాను.

వెంటనే వచ్చింది సమాధానం. "హలో, ఎవరూ?" అది ఆడగొంతు.

"హలో పిన్నిగారూ, బాగున్నారా?" అన్నాను.

"ఎవరు....ఎవరు మీరు?"

"అనామకుడ్ని. మీకో విషయం చెప్పాలని ఫోన్ చేశాను."

"ఏమిటా విషయం?"

"నేను మీ అబ్బాయి నెత్తుకపోయాను—పెద్దబ్బాయిని. గాభరాపడకండి. ఏమీ చెయ్యను. నాకు డబ్బు అవసరమేర్పడింది ....అర్జెంటుగా. నేను వెస్టు ఇండీస్ వెళ్ళిపోవాలి, పిన్నిగారూ. పాస్‌పోర్టు కోసం ప్రయ

త్నిస్తున్నాను. తప్పనిసరి పరిస్థితిలో ఈ పని చెయ్యవలసి వచ్చింది."

"ఎవరు మీరు—ఏమిటి మీర నేది?"

"మీ అబ్బాయి వినయ్ నా బందీగా వున్నాడు. విడుదలకి డబ్బు డిమాండ్ చేస్తున్నాను. కిడ్నాప్ అన్నమాట. కాబట్టి చెప్పినట్టు వినండి! ఈ సంగతి బాబాయిగారితో తప్ప మరెవరికీ చెప్పకండి! కంగారుపడి పోలీసులదగ్గరి కెళ్ళకండి. మీ అబ్బాయి పసిమి వంటిమీద కత్తితో చారలు పెట్టడం నాకిష్టంలేదు. అర్థమైందా? జాగ్రత్త. డబ్బు ఎలా ఇవ్వాలో తర్వాత చెప్తాను."

ఫోన్ పెట్టేసి బైనాక్యులర్స్‌తో డాబామీద కురికాను.

నీళ్ళ టాంకుని ఆసరాచేసుకొని ఎదురు వరుసలో మూడో ఇంటిని చూశాను. బయట ఎవరూ కన్పించలేదు. అలాగే చూస్తూ నిలబడ్డాను....ఆమె బయటికి రాలేదు. బాగా భయపడి వుంటుంది. కొల్లాప్స్ అవలేదు కదా?

ఉలిక్కిపడ్డాను. ఒకవేళ వినయ్ లోనికొస్తున్నప్పుడు ఎవరైనా చూసివుంటే? ఈ అనుమానం కలవరపర్చింది.

ఇరవై నిమిషాలు కనిపెట్టాక ఆ యింటిముందు ఒక స్కూటర్ ఆగింది. అతను దిగి లోపలకురికాడు. కుతూహలంగా చూడసాగాను. లోపలేం జరుగుతోందో తెలియదు. చాలాసేపటి తర్వాత అతను బయటికొచ్చి స్కూటరెక్కాడు. ఆమె వెనక వచ్చింది, కళ్ళు తుడుచుకుంటూ. వెంట మరో నాలుగేళ్ళ పిల్లవాడున్నాడు.

అతను స్కూటర్ స్టార్ట్ చేసి ఆమెని వారిస్తున్నాడు. లోనికెళ్ళమని చెయ్యి వూపుతున్నాడు.

వెంటనే నేను క్రిందికి దిగివచ్చి ఇంటికి తాళంవేసి కారెక్కాను. స్టార్ట్ చేసి వీధిలోకొచ్చాక అతను దూరంగా పోతూ కన్పించాడు. ఆ దూరాన్ని అలాగే వుంచుతూ వెంబడించసాగాను.... వెంబడించి వెంబడించి కాస్సేపయ్యాక అతను పోలీస్ స్టేషన్ దగ్గర ఆగడం చూశాను.

లోంపముంచాడు! నా గుండె పని చెయ్యడం మానేసింది.

## 4

సాయంత్రం అనుపమ సరిగ్గా చెప్పిన సమయానికి కన్పించింది. ఆమెని చూసి నా ఆందోళనంతా దూరమైంది గానీ, ఆమె వాలకం చూసి కలవరపడ్డాను. ఆమె ముఖం నీరసించిపోయింది. కళ్ళు ఎర్రబడ్డాయి. బలహీనంగా కన్పించింది....

"అనుపమా, ఏమిటలా వున్నావ్?"

ఆమె క్రుంగుతున్న సూర్యుడ్ని పరధ్యానంగా చూస్తూ, అప్పుడే ప్రారంభమైన చలిగాలికి ఉన్నట్టుండి వణికింది. తేరుకొని నన్ను చూసింది.

"అనుపమా, నావల్లేనా ఇదంతా?" మళ్ళీ అన్నాను.

"నీ ప్రేమ అంత మొరటుగా, అలా దుడుకుగా వుంటుందనుకోలేదు మోహన్. నువ్వు సున్నితంగా ప్రవర్తించలేవా? నీకు మనోనిబ్బరం లేదా?"

నా గుండె దడదడలాడింది. ఏమిటిది! ఆమె నన్ను ప్రేమిస్తోందా? వెంటనే సర్దుకున్నాను. "సారీ, అనుపమా. నిన్ను అపార్థం చేసుకున్నాను. నువ్వు ప్రేమిస్తున్నావనుకోలేదు. అలా నువ్వెప్పుడూ కన్పించలేదు.... నంగనాచివి!"

ఆమె నవ్వింది. "నే నెప్పుడూ ముందుగా బయట పడను. ముందు ఎదుటివారిని చదివి నాకు తగినట్టున్నారో లేదో చూస్తాను."

"నన్ను చూశావు, నీకేమనిపిస్తోంది?"

మళ్ళీ నవ్విందామె, ఈసారి కొంటెగా. "నువ్వు చేసిన పనికి అప్పుడే చెంపవాయించి, అలాకాదూ ఇలా అని నేర్పివుండాలనిపిస్తోంది!"

"గాడ్! ప్రేమ పాఠాలా.... నాకే?"

"అవును. నీకు స్త్రీ హృదయం ఎలాంటి మార్దవానికి స్పందిస్తుందో తెలియదు!"

"అబ్బా! అలాంటి పెద్దమాటలు చెప్పకు!"

"మోహన్, నాకందరూ వున్నా ఎవరూలేరు. నన్నెవరూ లక్ష్యపెట్టరు. నే నేమైనా, నాకేం జరిగినా వాళ్ళకి పట్టదు. అమ్మవుంటే నేనిలా వుంటానా అనిపిస్తుంది.... విసిగిపోయాను! విసిగి—విసిగి—విసిగి—వేసారిపోయాను. ఈ బ్రతుకు ఇహ ఇంతే నన్పించేది నువ్వు కన్పించేవరకూ. నువ్వు కన్పించినప్పటినుంచి ఆశలు చిగురిస్తున్నాయి. జీవితం మీద మమకారం ఏర్పడుతోంది. ఆ మరమనుషుల మధ్య నలిగిపోతున్న నాకు నీతో సావాసం ఎంతో రిలీఫ్ నిస్తోంది....నీతో వీలైనంత త్వరగా దూరంగా—ఎంతో దూరంగా—సుదూరంగా ఎక్కడికైనా వెళ్ళిపోవాలనిపిస్తోంది, మోహన్."

"నామీద అంతటి విశ్వాసానికి గర్వపడుతున్నాను. కానీ నువ్వెందుకలా నీరసంగా వున్నావ్? వేరే కారణం వుంది....రాత్రి ఏదో జరిగిందన్నావ్?"

"చెప్తాను, మోహన్. నా యోగక్షేమాలడిగేవాడివి నువ్వొక్కడివే" అందామె భారంగా, "నీతో నే చెప్పి

నా బరువు దించుకుంటాను. రాత్రి అన్నయ్య తాగివచ్చాడు. వెంట ఎవతో వుంది. ఆమే టాక్సీలో దిగబెట్టింది. వాణ్ని పట్టుకొని రాసుకుంటూ పూసుకుంటూ వేళ్ళాడుతూ ఇంట్లోకి తెచ్చింది.... అది చూసి నాన్న రెచ్చిపోయాడు. అన్నయ్య ఏదో వాగుతున్నాడు. ఆమె సముదాయిస్తోంది ఎబ్బెట్టుగా పేర్లు పెడుతూ .... అన్నయ్య నిలవలేక సోఫాలో పడిపోయినప్పుడు వాడిమీద ఆమె పడింది! ఇద్దరూ ఒకరిమీదొకరు అలాగే వుండిపోయి పిచ్చిగా వాగుతున్నారు. నాన్న ఇక సహించలేకపోయాడు. వెనుక నుంచి దాని జడ పట్టుకొని లేపి, చెంపమీద ఈడ్చి కొట్టాడు—"

"అప్పుడేమైంది?"

"అది నాన్నను కొట్టబోయింది! నేను వెంటనే మధ్యకి వెళ్ళి దూరంగా నెట్టేశాను. అప్పుడా దెబ్బ నా ముఖం మీద కొట్టింది! ఒక—ఒక—భ్రష్టురాలు నన్ను కొట్టింది, మోహన్!"

"అప్పుడేం చేశావ్?"

"నాన్న నన్ను వెళ్ళిపొమ్మని తిట్టాడు. అప్పుడు వదిన లోపలినుంచి వచ్చింది. నాన్ననూ అన్నయ్యను తిడుతూ, ఇలాటి దరిద్రపు కొంప ఎక్కడా లేదని వెళ్ళిపోయింది—"

"ఎక్కడికి?"

"కారెక్కి సినిమాకెళ్ళిపోయింది. ఎప్పుడు గొడవ జరిగినా ఇంట్లో వుండదు... ఆమె వెనుక ఆ—ఆ—"

"ఆ స్లట్ కూడా వెళ్ళిందంటావ్" అన్నాను పళ్ళు నూరుతూ.

"అవును. అప్పుడు అన్నయ్య తెలివిలోకొచ్చి నాన్నను తిట్టాడు. దాన్ని కొట్టినందుకు అరిచాడు. ఇద్దరూ కొట్టు

కు నేంతవరకూ వచ్చారు. నాకేం చెయ్యాలో పాలు పోలేదు. నేనెప్పుడూ వాళ్ళని అదుపుచెయ్యలేను. గదిలో కెళ్ళిపోయి తలబాదుకుంటూ ఏడ్చాను...."

ఆమె చెప్పడం ఆపేసి ముఖం చేతుల్లో దాచుకుంది.

ఆమె తల నిమురుతూ, నా ఆవేశం అణచుకోడానికి ప్రయత్నిస్తూ అన్నాను. "ఈ సంగతి రాత్రే తెలిసి వుంటే ఆ స్లట్ ని పట్టుకొని నరికేసేవాణ్ని. నువ్వింత కుళ్ళు భరిస్తున్నావనుకోలేదు. ఇంకా నువ్వా ఇంట్లో ఎందుకుండాలి?"

"నేనేదీ తేల్చుకోలేని స్థితిలో వున్నాను, మోహన్. ఒక్కోసారి నాన్నమీద విరక్తి పుడుతుంది, ఒక్కోసారి మనసు పీకుతుంది....ఆయనవన్నీ ఉత్త చాదస్తాలే కదా అనిపిస్తుంది....ఈ వయసులో అలా ప్రవర్తించడం సహాజ మనిపిస్తుంది...."

"సరే, మనం బాగా ఆలోచించి ఏం చెయ్యాలో నిర్ణయానికొద్దాం. నా బిజినెస్ ప్రారంభమైతే తీరుబాటు కలుగుతుంది. అప్పుడేదో ఒకటి నిర్ణయిద్దాం....ఇప్పు డవన్నీ మర్చిపో! ముందు జీవితం గురించి ఆలోచించు. మన భవిష్యత్తు ఎలా వుండాలో పథకాలు వేస్తూండు."

ఆమెని కార్లో ఇంటిప్రాంతాల దిగబెడుతూ అన్నాను. "మళ్ళీ రేపు సాయంత్రం కలుద్దాం. గుండె దిటవు చేసుకో. ఆత్మబలం వున్న వాళ్ళెవరూ బేలగా కనిపించరు. నువ్వు చాలా ఎదిగావు."

తిరిగి ఇంటికొస్తున్నప్పుడు నా ఆవేశం కట్టలు తెంచు కుంది! కానీ వినయ్ జ్ఞాపకం రావడంతో ఒక్కసారిగా పూర్తిగా చల్లబడిపోయాను....మానసికంగానే కాదు, నా వొళ్ళంతా చల్లబడింది. ఆ బ్యాంక్ మేనేజర్ ఏం

చేస్తున్నాడు? పోలీసులేం ఆలోచిస్తున్నారు?

మధ్యాహ్నం అతను చాలాసేపు స్టేషన్‌లో వున్నాడు. ఏం మాట్లాడుకున్నారో తెలియదు. అతను తిరిగి బ్యాంక్ కెళ్ళిపోయాడు. పోలీసులేదేనా వ్యూహం పన్నారా?

నేనిలా జరుగుతుందనుకోలేదు! వినయ్ కన్పించక పోతే తల్లిదండ్రులు పోలీసుల దగ్గరికెళ్ళవచ్చని, వాళ్ళు రంగంలో దూకితే నేను ప్రమాదంలో పడతానని, కిడ్నాప్‌తో ట్రిక్ చేసి వాళ్ళ నోరు నొక్కాలనుకున్నాను. కానీ బెడిసికొట్టింది! వాళ్ళు నా హెచ్చరిక మొండిగా పెడచెవిన పెట్టారు! ఇరకాటంలో పడ్డాను.

ఆ సాయంత్రం వరకూ పోలీసుల్ని గమనించాను. వాళ్లు మరోసారి ఫోన్‌కోసం—డబ్బు చెల్లించే ఏర్పాటు కోసం ఎదురుచూస్తున్నట్లన్పించారు. ఇంటికొచ్చి వీధిలో దర్యాప్తు చెయ్యలేదు. అది మంచిదికాదని వాళ్ళకు తెలుసు. అలాచేస్తే వినయ్ ఇంట్లో ప్రవేశిస్తోండగా చూసినట్టు ఎవరైనా చెప్పేవారేమో....

పోలీసులు రానంతవరకు ఆ అదృశ్య సాక్షి నుండి—ఒకవేళ వుంటే—నాకు ప్రమాదంలేదు. కాబట్టి వినయ్‌ని అక్కడే వుంచదల్చుకున్నాను.

బ్యాంక్ మేనేజర్ ఇల్లు సమీపించడంతో తొంగి చూశాను. ఎవరూ కన్పించలేదు. లైటు వెలుగుతోంది.

ఆలోచిస్తూ నా ఇంటిముందు కారాపాను. దిగి, గేటు తెరిచి తిరిగి లోనికిపోనిచ్చాను....

అప్పుడు హెడ్‌లైట్స్ కాంతిలో సూటిగా వరండాలో చూశాను. ఆ ముగ్గురు—రేణుక, చంద్రన్, యాదవ్.

"హేం, మీరెందుకొచ్చారు?" అన్నాను కారుదిగి వాళ్ళని సమీపిస్తూ.

ఎవరూ పలకలేదు. చీకట్లో నల్లటి ఆకారాలు మాత్రం కన్పిస్తున్నాయి.

జాగ్రత్తగా వాళ్ళ దగ్గరికెళ్ళి ఆగాను, "మనుషులేనా? మీరేం చేస్తున్నారిక్కడ?"

"ముందు లోనికి పద, మోహన్!" రేణుక అంది కటువుగా, "నీతో మాట్లాడాలి."

"యాదవ్? చంద్రన్? ఏమిటిది? ఏం జరిగింది?"

"ముందు లోనికిపద, మోహన్!" రేణుక అంది మళ్ళీ, ఆజ్ఞాపిస్తున్నట్లు.

వీళ్ళేం పసిగట్టారు? ఆలోచిస్తూ తాళంతీశాను. లోని కెళ్ళి లైటు వేయడంతో వాళ్ళంతా జొరపడ్డారు.

అందర్నీ ఓరగా చూశాను. అందరి చూపులు నా మీద అనుమానంగా ప్రసరిస్తున్నాయి.

"కూర్చోండి," అన్నాను సోఫాలో కూర్చుంటూ.

వాళ్ళంతా కూర్చున్నారు. కానీ మాట్లాడలేదు.

"చెప్పండి, ఏం జరిగింది? సుభాష్ ఇంకా రాలేదా?" అన్నాను, నేనే సంభాషణ ప్రారంభిస్తే సహజంగా వుంటుందనే భావంతో.

"వాడింకా రాలేదు," అంది రేణుక కష్టంగా.

"కొత్త వూరు.... కాటు కలిశాదేమో!" అన్నాను.

చంద్రన్ సిగరెట్ వెలిగిస్తూ అన్నాడు, "నాతో చెప్పాడు, నీ దగ్గరకి వెళ్తున్నట్లు."

"దార్లో మనసు మార్చుకుని వుంటాడు. ఇక్కడికి

రాలేదు."

ఈసారి యాదవ్ నోరు విప్పాడు. "నువ్వలా బుకాయించకు, మోహన్. మాతో అబద్ధాలేమిటి? నిన్న సుభాష్ ఇక్కడికొచ్చాడు. అందుకు నిదర్శనం ఈ సగం కాలిన సిగరెట్."

జేబులోంచి ఒక చాక్లెట్ తీసి నోట్లో వేసుకున్నాడతను.

ఆ తర్వాత సిగరెట్ తీసి చూపించాడు.

కళ్ళు పెద్దవి చేశాను. "ఎక్కడిది? పీకలు ఏరడం ఎప్పట్నించీ?"

"బయట మెట్లమీద కన్పించింది. దాంతో నీ పీక నొక్కచ్చని ఏరుకున్నాను."

నేనిక వాదన పెంచదల్చుకోలేదు. ఉన్న నిజాన్ని వక్రీకరించి వాళ్ళని ఇప్పుడు నమ్మించలేను.

"సరే, అయితే వినండి! మీరు రహస్యాన్ని రహస్యంగా వుండనివ్వరు కదా! సుభాష్‌ని ఒకానొకచోటుకి పంపాను. చాలా ముఖ్యమైన ఎసైన్‌మెంట్. త్వరలో వస్తాడు. సరేనా?"

"ఏమిటా ఎసైన్‌మెంట్?" రేణుక అడిగింది.

"సూపర్ సీక్రెట్ ఎసైన్‌మెంట్, చెప్పకూడదు."

"పోనీ, ఎక్కడికి పంపావు చెప్పు."

ఆమె ప్రశ్నలకి రెచ్చిపోయాను. చేసిన నిర్వాకానికి ఆమె చెంపపగులగొట్టి విషయం మార్చేయాలనుకున్నాను.

కానీ ఆవేశం అణచుకొంటూ అన్నాను. "నో. వాడికి మాటిచ్చాను, ఎవరికి చెప్పనని. వచ్చాక వాడ్నే అడుగు."

ఆమె గిరుక్కున తిరిగి యాదవ్‌ని చూసింది.

"నో మోహన్. నువ్వేదో దాస్తున్నావు" అన్నాడు యాదవ్, అంతలోనే మరో చాక్లెట్ నోట్లో వేసుకొంటూ.

బలవంతాన నవ్వాను. "నువ్వలా అతిగా చాక్లెట్లు తినకు! పళ్ళు పుచ్చిపోతాయి. చాక్లెట్లు చిన్నపిల్లలూ, సినీతారలు తింటే బావుంటుంది——"

"ఓ.కే. నువ్వలా విషయం మార్చెయ్యకు. మాకు తెలియకుండా ఏం గూడుపుఠాణీ నడుపుతున్నావ్? మనం దేనికి వచ్చాం? అనుపమతో వ్యవహారం ఎంతవరకొచ్చింది?"

"నిదానంగా ఓ కొలిక్కి వస్తుంది" అన్నాను నింపాదిగా.

"డామిట్! నీ రొమాన్స్ సహించలేకపోతున్నాం! ఇంకెంత ఓపిక్కావాలి? మనం బెంగుళూరు విడిచి పదిరోజులైంది....ఇన్ని రోజులూ నువ్వామెతో రొమాన్స్ సాగించడం తప్ప అనుకున్నది సాధించలేకపోయావు! ఈ ఇంటి అద్దెలూ, అలంకారాలూ, విలాసాలూ, ఖర్చులూ ఇంకెంతకాలం భరించాలి? ఆ వెధవ పుస్తకాలమీద మూడువేలు తగలేశావు! ఏమిటి ప్రయోజనం?"

"మనవాడికసలు చదువే రానప్పుడు ప్రయోజనమేమిటి?" చంద్రన్ నవ్వాడు.

"పిచ్చిమొఖాలు! మీకసలు రొమాన్స్‌లో ఓనమాలు తెలియవు! ఇద్దరిమధ్య పరిచయం ఏర్పడి ఆకర్షణ పెరగాలంటే ఈ పుస్తకాల్ని మించిన సాధనంలేదు. పెట్టుబడి లేకుండా లాభం ఎలా ఆశిస్తున్నారు? అంతా ప్లాను ప్రకారం జరగాలి....తల బద్దలుచేసుకొని ప్లాను రూపొందించింది నేను. ఫలితం అనుభవించేది మీరు! విమర్శించేదీ

మీ రే! అసలు ఒరిజినల్ అయిడియా ఎవరిది? ఇక్కడ కొందరి డాక్టర్స్ ఆదాయం నెలకి కనీసం లక్షవుంటోందనీ, బ్లాక్ మనీ విపరీతంగా మురుగుతోందనీ నీకు తెలుసా? నీకు తెలాసా? ఎవరికి తెలుసు?"

"ఓ.కే! ఒరిజినల్ అ యి డి యా నీదే కావచ్చు" అన్నాడు యాదవ్ చల్లబడుతూ, "మరి నా శ్రమ ఎంత వుంది! నేనిక్కడ నెలరోజులు సర్వే జరిపి ముప్ఫైమంది డాక్టర్స్‌ని స్టడీచేశాను. వీళ్ళందర్నీ ఎనాలిసిస్ చేసి ఫైనల్‌గా ఈ సంగర్షన్ రెడ్డిని సెలెక్టుచేశాను. ఇతని చరిత్రంతా తిరిగేశాను. ఇంట్లో పరిస్థితుల్ని గమనించాను. అతని మూఢనమ్మకాల్ని, చాదస్తాల్నీ తెలుసుకున్నాను. రహస్య పెట్టుబడులెందుకు పెట్టడో, బినామీ ఆస్తులెందుకు కొనడో కనిపెట్టాను. బ్యాంకుల్ని ఎలా నమ్మడో, సొంత సేఫ్‌ని ఎలా పూజిస్తాడో రిపోర్టులో వ్రాశాను. సేఫ్‌లో ముప్ఫైలక్షల ఎస్టిమేషన్ ఇచ్చాను. ఆ సేఫ్ ఎక్కడుందో, కాంబినేషన్ ఏమిటో ఆ అమ్మాయి ద్వారా నే లాగాలని నీకు అయిడియా ఇచ్చాను. ఇన్ని చేసినా నువ్వు సాధించిందేమిటి?"

"ఓ.కే! నువ్వు శ్రమపడ్డావు. కాదనను. కానీ ఓపిక ఎందుకు పట్టవు? ప్లాను ఆలోచించడం కాదు, ఆచరణలో వుంది అంతా! అనుపమని ఆకర్షించి నా వశం చేసుకున్నాను. నన్ను అమాయకంగా నమ్మి ప్రేమిస్తోంది. తన విషయాలూ, ఇంట్లో పరిస్థితులూ వివరిస్తోంది. అలా క్రమంగా నా దగ్గర ఏ రహస్యమూ వుంచదు! సహనం కావాలి. తొందరపడితే ఆమెకు అనుమానాలు కలుగుతాయి...."

"ఎంతకాలం ఓపికపట్టాలి?" రేణుక అడ్డు తగిలింది.

నా కోపం పెచ్చుమీరిపోయింది.

"నీకసలు ఓపిక లేదుకదూ? యూ బిచ్. చూసి రమ్మంటే కాల్చివచ్చే రకానివి. నిన్న డాక్టర్ ఇంటి కెందుకెళ్ళావ్?"

"సునీల్ బాగా తాగేశాడు. దిగబెట్టడానికెళ్లాను."

"సునీల్‌తో నీకు బయటేపని! వారంరోజులుగా అతనితో తిరుగుతున్నావు. డబ్బు నీళ్ళలా ఖర్చుపెడుతున్నావ్. కానీ విలువచేసే సమాచారం రాబట్టలేకపోయావు సేఫ్‌గురించి. పైగా నిన్న ఇంటికెళ్ళి భీభత్సం సృష్టించావు! యూ బిచ్, అనుపమ నీకేం చేసింది? ఆమెనెందుకొట్టావ్?"

"వూరికే కొట్టలేదు___"

"అసూయతో కొట్టావు, అంతేనా? ఆమె నాతో తిరగడం నీ కసూయగా వుంది కదూ? వెల్, అసూయ పుట్టినప్పుడు గొంతు నరుక్కుని చావడమే మంచిది!"

"నీతో ఆ పోరి కులుకులు చూస్తే___"

నా వొంట్లో శక్తంతా కూడదీసుకొని ఆమె చెంప మీద బలంగా కొట్టాను. తూలి వెనక్కిపడ్డంతో చంద్రన్ పట్టుకున్నాడు.

"మోహన్! తెలివిలోకి రా!" యాదవ్ అర్చాడు నన్ను పట్టుకొని.

అతన్ని విదిల్చికొట్టి రేణుకని చూశాను నిప్పులు కక్కుతూ.

"నీ మాటలు జాగ్రత్త! నువ్వు చట్టరీత్యా నాకేమీ కావు! నాతో కలిసివుంటున్నావు, అంతే! నామీద నీకే అధికారంలేదు. నన్ను శాసించే హక్కు నీకు లేదు! నువ్వెక్కడ తిరిగినా, ఏం చేసినా నే నడుగుతున్నానా? నిన్నింకా సహించడం నా బుద్ధితక్కువ! మీ రంతా

వెళ్ళండిక్కడ్నించి! నాతో చెప్పకుండా ఇలా వచ్చా రంటే కాళ్ళు విరిచేస్తాను. అర్థమైందా? గెటవుట్!"

# 6

ఆ రాత్రి మర్నాడు సాయంత్రంవరకూ ఏమీ జరగ లేదు. వినయ్ బందీగా అలాగే వున్నాడు.

రాత్రి మరోసారి అతనింటికి ఫోన్ చేశాను. తండ్రి పలికాడు. వెంటనే పోలీసుల్ని విరమింపజేయకపోతే గ్లాక్సో బేబీలాటి వినయ్ అనవాలు మారిపోతా యన్నాను. ఎల్లవేళలా అతనిమీద నిఘా వుందని చెప్పి, పోలీసు లెలాటి వ్యూహం పన్నుతున్నా వెంటనే విర మించుకోవాలని హెచ్చరించాను. పరిస్థితులు అనుకూలించే వరకూ డబ్బు చెల్లించే గడువు పొడిగిస్తున్నట్లు చెప్పి ఫోన్ పెట్టేశాను.

నా మాటలతనిపైన మంచి ప్రభావమే కల్గించి వుండాలి, మర్నాడు పోలీసుల్లో స్తబ్ధత గమనించాను.

స్టేషన్ముందు టీస్టాల్లో వేడి మిర్చీలు తింటూ వాళ్ళమీదో కన్నేసి వుంచాను. తర్వాత వాళ్ళకే ఫోన్ చేసి, ప్రతిఫలం లేకుండా వినయ్ని విడిపించే ప్రయ త్నాలు కట్టిపెట్టండి – గప్ చిప్! అన్నాను. మళ్ళీ అడుగు ముందుకేస్తే ప్రతిఫలం కోసం ప్రయత్నించను, నా రిస్క్ పెరుగుతుందనుకొంటే నా బందీకి హాని తలపెట్టి క్షేమంగా తప్పుకోవడమే నా కర్తవ్యమవు తుందన్నాను.

ఈ హెచ్చరిక బాగా పనిచేసింది....వినయ్ తండ్రి బలవంతంగా మనసు లగ్నంచేస్తూ బ్యాంకు పనుల్లోనూ, పోలీసులు ఇతర గొడవల్లోనూ మునిగిపోయారు. మధ్యా హ్నం ఇంటికొస్తూ వినయ్ ఇంట్లోకి తొంగిచూశాను.

అప్పుడామె తల్లి ముఖంచూసి హిచ్‌కాక్ సినిమాలో ఓ సీను గుర్తుకొచ్చింది.... భయం! భయం! ఆమె అణువణువునా భయమే!

రేణుకనుంచి మళ్ళీ ఫోన్ రాలేదు. నన్ను కలుసుకో లేదు. చంద్రన్, యాదవ్ కూడా మళ్ళీ రాలేదు. ఎవరికీ సుభాష్ గురించి అనుమానాలు రాలేదనుకున్నాను.... అయితే ఎప్పుడో ఒకప్పుడు వాస్తవం వెల్లడించే పరిస్థితి రాక తప్పదు. ఎంతకాలం వాళ్ళని బుకాయిస్తూ జో కొట్టగలను?

అప్పుడీ చంద్రన్, యాదవ్‌ల గురించి భయంలేదు గానీ, రేణుకవల్ల అపాయం వుంది. వాళ్ళిద్దరికి సుభాష్ అంటే ఏమాత్రం ఇష్టంలేదు. మా గ్యాంగ్ నుంచి అతన్ని తొలగించాలని అనేకసార్లు నాతో విభేదించారు. తాగుబోతులు తలపెట్టిన పనుల్ని తలక్రిందులుజేస్తారు. నిజమే వాడివల్లనే నాకిప్పుడు ఈ అవస్థలన్నీ! కాని వాడ్ని తొలగించడం రేణుక ఒప్పుకోదు. ఆమెని వదిలించుకోడం నా మనసు అంగీకరించదు.

అయితే మొన్న రాత్రి ఆమె అనుపమ మీద చేయి చేసుకోవడం నన్ను కలత పెడుతోంది. అది పూర్తిగా దురుద్దేశంతో, అనూయతో కూడుకున్న చర్య! ఆమె ఇక్కడ సమిష్టి ప్రయోజనాన్ని గుర్తించడంలేదు! వ్యక్తిగత విద్వేషాలతో పూర్తి ప్లానుకే ఎసరుపెట్టేలా వుంది!

అనుపమ గురించి ఇప్పుడు నాకు వేరే ఆలోచనల్లేవు. ఆమెతో పని వెళ్ళదీసుకుని నా దారిన నేను పోవడమన్నదే నా దృష్టి. రేణుక అపార్థం చేసుకుంటోంది....

నేనింకా కాలం వృధాచేయదల్చలేదు. ఇంకా నా విలాసాల్ని నా శిష్యులు సహించరు. రేణుక ఇన్నాళ్ళూ

సునీల్‌తో చేసిందేమీ లేదు. అనుమానాలకి ఆస్కారం లేకుండా వివరాలు ఎలా లాగాలో ఆమెకు తెలిసేలా లేదు. నాకు తెలుసా? కాస్సేపు ఆలోచించాను.

విషయం ఎలా కదపాలి? ఆమెకు కాంబినేషన్ తెలుసా? కనీసం సేఫ్ ఎక్కడుందో తెలుసా? సేఫ్ ఇంట్లో ఎక్కడా కన్పించేచోట లేదని యాదవ్ సర్వే చెప్తోంది.... భూగర్భంలో వుందా? గోడలమధ్య వుందా? ఇంతవరకు ఇంటిమీద ఐ.టి. స్క్వాడ్ రెయిడ్స్ జరప లేదని యాదవ్ రీసెర్చి థీసిస్‌లో వ్రాశాడు. గొప్ప విషయమే.

డాక్టర్ సంపద మీద ప్రభుత్వానికి అనుమానాల్లేవు. అసలు అంత గుప్త ధనముందని తెలీదు. డాక్టర్ చాలా జాగ్రత్తలు తీసుకుంటున్నాడు. కానీ ఆ జాగ్రత్త మా దొంగల పాలిటి బంగారు పంటగా మారిందని అతనికి తెలీదు! దాన్ని కొల్లగొడితే అతను కిక్కురుమనడు. పోలీసులు మా వెంటపడరు!

కాబట్టి ఆ డబ్బుతో భవిష్యత్తులో ఎలాంటి ఆపద వుండదు! ఎవరి బెడదలేకుండా అది అందించే స్వర్గాన్ని స్వేచ్ఛగా అనుభవించవచ్చు!

ఈ సాయంత్రం అనుపమని ఎలాగైనా కదపాలి....

సాయంత్రం 5 గంటలకి ఎప్పటిలాగే ఆమె కన్పించింది.

"ఇవాళ చాలా త్వరగా వచ్చేసినట్టున్నావు?" అన్నాను నవ్వుతూ.

ఆమె నవ్వలేదు. "సమయం కోసం ఎదురుచూసే ఓపిక నాకిప్పుడు లేదు, మోహన్. అసలిక్కడ—ఈ చుట్టూ జనం మధ్య వుండాలనీ లేదు! వీలైనంత త్వరగా

నీతో పారిపోవాలనిపిస్తోంది" అంది.

"అలా తొందరపడకు! నీతో పారిపోతే ఇక్కడ నా బిజినెస్ ఏం కావాలి? ఆలోచించు. నిదానంగా దీని కో పరిష్కారం కనిపెడదాం."

"ముందు ఇక్కడ్నించి పద, మోహన్!"

"ఎక్కడికి?"

"పార్కుకి—ఇందిరా పార్కులోకి."

"గాడ్! అక్కడ పాములున్నాయని విన్నాను."

"ఒకప్పటి సంగతి. ఇప్పుడది లవర్స్ పార్కు."

"సరే, అయితే కారెక్కు. ఈ హుస్సేన్‌సాగర్‌లో గుర్రపు డెక్కల బీడుకంటే ఆ పార్కులో పాములే నయం—ఒకవేళ వుంటే."

"ఉందవన్నాను, పద! ఇప్పుడది హుస్సేన్‌సాగర్ కాదు. వినాయక్‌సాగర్."

"పేరు మార్చేశారా?"

"అవును .... హైద్రాబాదుకి భాగ్యనగర్ ఎంత ప్రాచుర్యం పొందిందో అదీ అంతే అవుతుంది; పద!"

"నామకరణం చెయ్యడం, శంఖుస్థాపనలు చెయ్యడం కాయితాలూ రాళ్ళవరకే కదూ?"

"అంతే. రాళ్ళా అక్షరాలు కదల్లేవుగా?" అందామె నవ్వుతూ.

పార్కులోకెళ్ళాక ఓ పొదచాటున కూర్చుంటూ, "నీకే పువ్వంటే ఇష్టం?" అంది.

ఈ ప్రశ్న నన్ను ఇబ్బందిపెట్టింది. ఇన్నేళ్ళ నేర జీవితంలో ఎన్నడూ పువ్వులూ ప్రకృతి మొదలైన సున్నిత విషయాల గురించి ఆలోచించే సందర్భం, అవ సరం రాలేదు.

"జవహర్‌లాల్ నెహ్రూకి గులాబీలంటే ఎంతో ఇష్టం" అన్నాను.

"నీ గురించి చెప్పు—నిన్నడిగాను."

"ఐ అండ్ బి మంత్రి సాఠే కూడా నెహ్రూలాగే గులాబీ పువ్వు పెట్టుకుంటాడు. నాకూ అదంటే ఇష్టం."

"నీ ఇష్టం గురించి చెప్పడానికా గొప్పవాళ్ళ నుదహరించాలా! ఉదహరించకపోతే నీ ఇష్టాన్ని నేను కాదంటానా?"

"ఓ.కే, నాకు వ్యక్తిత్వం లేదు. ఒప్పుకుంటాను. మరి నీ గురించి చెప్పు?"

"ఆ మాట నువ్వు దూరంగా కూర్చునే అంటున్నావు."

"సరే, దగ్గరికి జరుగుతాను....చాలా?"

ఇప్పుడామె నాకు పూర్తిగా దగ్గరగా, ఆనుకొని కూర్చుంది.

నా మనసులో అలజడి ప్రారంభమైంది. శాల్యూట్ అటెన్షన్! ఆత్మారాముడు అరిచాడు.

తృళ్ళిపడి సర్దుకున్నాను. పెద్దగా నవ్వేసి, "ఇప్పుడు లవర్స్ పార్క్ పేరు సార్థకమైంది! ఇక నీ ఇష్టం గురించి చెప్పు" అన్నాను.

"గులాబి పువ్వే!"

"గుడ్. తెలివైనదానిని. నీ ఇష్టాల్ని నా కనుగుణంగా మార్చుకొంటూ నడుచుకునే మంచి భార్య లక్షణాలు ప్రదర్శిస్తున్నావన్న మాట అప్పుడే?"

ఆమె కిలకిలా నవ్వేసింది.

"ఈ పువ్వులంటే నాకో సంఘటన జ్ఞాపకమొస్తోంది, మోహన్."

"ఏమిటో అది, చెవినపడెయ్యి."

"నాన్న గదిలో ఓ పువ్వుంది. తామర పువ్వు.... కొయ్యతో చెక్కింది. అది టేబిల్ మీద బిగించి వుంది. దానిముందు లక్ష్మీదేవి విగ్రహం వుంది....అక్కడ హారతి వెలుగుతుంటుంది....ఆ పువ్వు ఏమంత అందంగా వుండదు. దానికి సరైన రంగు, పాలిష్ లేవు. అయితే ఒక రోజు ఏమైందో తెలుసా?"

"ఏమైంది?"

"ఆ పువ్వు ఎన్నడూ లేనిది ముడుచుకుంది!"

"అరె, అదెలా?" కుతూహలంగా అడిగాను.

"కుతూహలంగా వుంది కదూ? అప్పుడు నేనూ కుతూహలపడ్డాను. కానీ నాన్న ఎన్ని చివాట్లు పెట్టాడో నీకేం తెలుసు! ఇంట్లో అందర్నీ వరుసబెట్టి తిట్టాడు. ఆ గదిలో కెవరు వెళ్ళారని నిలదీశాడు. తర్వాత చాలా సేపు తలుపేసుకొని లోపల వుండిపోయాడు. తెరిచాక చూస్తే ఏముందో తెలుసా! ఆ పువ్వు విచ్చుకొంది!"

అప్పుడుగానీ నా మెదడు పనిచేయడం ప్రారంభించ లేదు! అనుపమ చెప్పే తామరపువ్వు సేఫ్ కోసం చేసిన రహస్య ఏర్పాటు!

"ఇదెప్పుడు జరిగింది?" అడిగాను, గుండె వేగంగా కొట్టుకుంటోంటే.

"నెల్రక్రితమనుకుంటాను.... ఎందుకలా సీరియస్ గా అడిగావు?"

"సీరియస్ కాదు. అది___అదెలా ముడుచుకుంది?"

నవ్విందామె. నా మెడచుట్టూ చేతులువేసి, "అదెలా ముడుచుకుంటే మనకెందుకు? నీ కౌగిట్లో ఇముడ్చుకో నన్ను గువ్వలా!" అంది.

విజృంభించిన ఆవేశంతో ఆమెని గుండెలకి హత్తుకున్నాను.

"మోహన్ — మోహన్!"

వెదురు బెత్తంతో వీపుమీద కొట్టినట్లు అరుపు వినిపించింది.

ఆమెని విదిల్చికొట్టి గభాల్న లేచినిలబడ్డాను.

"మోహన్ — నన్ను మర్చిపోయావా మళ్ళీ?"

నా వొళ్ళు చల్లబడి నిశ్చేష్టుడైపోయాను. గొంతు పెగలక గుటకలు మింగసాగాను. అయినా ఏమనాలో నాకు తోచలేదు! వూహించని దెబ్బ కొట్టింది—ఈ దౌర్భాగ్యపు రాక్షసి!

అనుపమ నన్నూ రేణుకనూ మార్చి మార్చి చూసింది. ఆమె కళ్ళు విశాలంగా తెరుచుకోసాగాయి. ముఖకవళికలు వేగంగా మారిపోతున్నాయి.... భయంతో—అవమానంతో—చివరకి అసహ్యంతో....

గిరుక్కున నావైపు తిరిగి, కాలరు పట్టుకొని చెంప వాయించింది.

"నన్నింకా నమ్మించకు!" అర్చిందామె ఏడుపు ముంచుకొస్తోన్న కంఠంతో. ఆమె కళ్ళలో తళుక్కున నీళ్ళు తిరిగాయి. "నోరు విప్పకు నువ్వు! నువ్వు నీచుడివి! దుర్మార్గుడివి! అదీ నువ్వూ ఒక్కటే! దానితో—ఇంకెందరితో నువ్వు....ఓహ్! నన్నెంత వంచించావు! నన్ను దోచుకోవాలని చూశావు! దుర్మార్గుడా! నీ ముఖం నాకు చూపించకు! నువ్వు దుష్టుడివి! మీరంతా దగాకోర్లు—"

ఆమె నన్ను వదిలేసి వెనక్కి తిరిగి ఏడుస్తూ పరిగెత్తసాగింది. నా నోట మాటరాలేదు! రాయిలా వుండిపోయాను, దిక్కులు చూస్తూ. మా చుట్టూ జనం వింతగా

చూడసాగారు. ఆమె మరింత వేగంగా వురుకుతూ, అడ్డుకోబోయిన వాళ్ళని నెట్టేస్తూ పూర్తిగా కనుమరుగైంది.

"అనుపమా, ఆగు!" గొంతు చించుకొని అరిచాను.

కానీ లాభంలేకపోయింది.

నిస్సహాయంగా చూస్తూండిపోయాను. నా చెంప ఇంకా మండుతోంది. నెమ్మదిగా తలతిప్పి రేణుకను చూశాను. ఆమె భయం భయంగా చూస్తోంది, పెదవులు చప్పరిస్తోంది. ఇంకా ఆ జనంలో నిలబడ్డానికి మనస్కరించలేదు. వాళ్ళ రకరకాల వ్యాఖ్యలు నా వొంటిమీద ఒక్కొక్క అచ్ఛాదనను తొలిచేస్తున్నాయి.

కట్టలు తెంచుకొంటోన్న ఆవేశమెలా అణచుకున్నానో తెలియదు, "పద వెళ్ళిపోదాం!" అన్నాను రేణుకతో—

ఆమె సంకోచిస్తూ, భయపడ్తూ నా వెంట వచ్చింది. కారెక్కి స్టార్టు చేసి పోనిచ్చాను. ఆమె కర్చీఫ్ తీసి చెమట తుడుచుకోసాగింది. అప్పటికి చీకట్లు ముసురుకుంటున్నాయి. నా దృష్టి డ్రయివింగ్ మీద నిలవటం లేదు. ఆలోచనలు పరిపరి విధాల పోతున్నాయి. అనుపమ ఎటు మాయమైంది? ఏదయినా అఘాయిత్యం తలపెడుతుందా? నా మనసు వికలమైంది.

రేణుక ఏదో చెప్పాలని ప్రయత్నిస్తోంది. కానీ నా వాలకం చూసి సందేహిస్తోంది. ప్రక్కన ఆమె నన్నేమీ చలింపజేయడం లేదు. గంభీరంగా డ్రైవ్ చేస్తూ ఆమె మాట్లాడే అవకాశమీయకుండా తిన్నగా లాల్ బహాదూర్ ఆర్ట్స్ కాలేజి గ్రౌండ్స్‌కి పోనిచ్చాను.

అక్కడంతా చీకటిగా, నిర్మానుష్యంగా వుంది. జన సంచారం లేదు. కారాపి దిగాను. ఆమె కూడా దిగింది

అయోమయంగా.

"ఏమిటిది మోహన్? ఇక్కడెందుకు?"

ఆమె వైపు చిన్నగా కదిలాను.

ఆమె భయపడిపోయింది. వెనక్కి జరిగి, "మోహన్! ఏమిటిది?" అంది.

నేను విసురుగా ముందుకెళ్ళి ఆమె భుజాలు పట్టుకున్నాను.

"మోహన్!....నువ్వేం చేస్తున్నావ్?"

నేనామెని గిరుక్కున వెనక్కి తిప్పి, భుజాలు క్రిందికి వంచి మోకాలు మడిచి మెడమీద చాచి కొట్టాను.

ఆ తాకిడి కామె కండరాలన్నీ ఒక్కసారిగా సంకోచించుకొని సడలిపోయాయి.

హఠాత్తుగా ఆమె దేహం నా చేతుల్లో బరువుగా తోచింది.

క్రిందికి వదిలేశాను....ఆమె దబ్బుమని వెల్లకిలా పడింది నిర్జీవంగా.

"అసూయ ఆరోగ్యానికి చేటు" అన్నాను ఆమెని లేపి డిక్కీలో చేరుస్తూ.

# 7

వారిస్‌గూడలో ఓ యింటిముందు కారాపి హారన్ మ్రోగించాను. యాదవ్ బయటికొచ్చి "మోహన్, ఏమిటి?" అన్నాడు ఆశ్చర్యంగా.

"మీరిద్దరూ కారెక్కండి, నోరు విప్పకు! కమాన్, త్వరగా!"

చంద్రన్ కూడా బయటికొచ్చాడు. ఇంటికి తాళం వేసి ఇద్దరూ కారెక్కారు. స్టార్టుచేసి పోనిచ్చాను. చాలాసేపు ఎవరూ మాట్లాడుకోలేదు.

"ఓ. కే. మీకిప్పుడు జరిగింది చెప్పేస్తాను" అన్నాను.

"ఏం జరిగింది? కొంపదీసి,...." యాదవ్ అన్నాడు.

"గాభరాపడకు! మన కొంప ఎవరూ తీయరు. మనమే తీయబోతున్నాం ఒకరి కొంప! మొన్న సాయంత్రం నేను సుభాష్‌ని చంపేశాను."

వాళ్ళిద్దరు కొయ్యబారిపోయారు. నేను జోక్ చెయ్య లేదని వాళ్ళకు తెలుసు.

"ఎందుకు మోహన్?" చంద్రన్ అడిగాడు కలవరంగా.

ఎందుకు చంపానో అంతా వివరంగా చెప్పాను.

"ఓహ్! వాడలాంటిదేదో చేస్తాడని నాకు ముందే తెలుసు" అన్నాడు యాదవ్ తేరుకుంటూ.

"మరిప్పుడు వాడి గురించి రేణుకకేం చెప్తావ్?" చంద్రన్ అన్నాడు.

"ఆమెకి చెప్పే అవసరం లేదు" అన్నాను.

"ఆమె తెలుసుకోవచ్చు."

"తెలుసుకొనే స్థితిలో కూడా లేదు."

"అంటే?"

"ఆమె వెనక డిక్కీలో వుంది.... ఈ అన్నా చెల్లెళ్ళకి చచ్చేంత ప్రేమ! ఒకర్ని విడిచి ఒకరుండలేరు."

"మోహన్! గాడ్, యేమిటిదంతా? నువ్వేం చేస్తున్నావ్?"

"ఆ బిచ్ చివరి క్షణంలో అంతా చెడగొట్టింది" అంటూ ఆ సాయంత్రం జరిగిన సంఘటన ఓపిగ్గా చెప్పాను.

వాళ్ళు ఆశ్చర్యంగా, భయంగా చూశారు.

"డిసీజ్ టూ మచ్!" అర్చాడు యాదవ్.

"నోర్మమ్! ఇప్పుడు మార్గమేమిటో తోచక ఛస్తున్నాను. చెప్పండి! ముందుకు సాగడమా, విరమించుకోడమా?"

"విరమించుకుంటామా?" యాదవ్ మళ్ళీ అర్చాడు. "ఎంత ప్రయాస! ఎంత ఖర్చు! అంతా వృధా! నో, ముందుకే సాగాలి. ఆ ఇద్దర్ని చంపి నువ్వు మంచిపని చేశావ్. ఇప్పుడా రొక్కం మన ముగ్గురి మధ్య ముచ్చటగా మూడుముక్కలు చేసుకోవచ్చు."

"ఎలా చేస్తావ్? అసలు సేఫ్ గురించి యేమీ తెలియకుండానే? అనుపమతో పూర్తిగా బెడిసింది. ఇప్పుడేమిటి ఉపాయం?"

"నువ్వేదో గిమ్మిక్ గురించి చెప్పావు. దానిమీద వర్క్ చేస్తే?"

"ఓ.కే. ఆ తామరపువ్వు మన టార్గెట్ అనుకుందాం. దాన్ని ఆపరేట్ చేసే మీటలెక్కడున్నాయో ఎలా తెలుస్తుంది? తెలిసినా దాన్ని ఆపరేట్ చేసినా, అది కేవలం సేఫ్ వున్న స్థలానికి రహస్యద్వారం చూపవచ్చు. మరి సేఫ్ ఎలా తెరుస్తాం?"

"తెరుస్తాం మోహన్, బెత్తానికి లొంగకపోతే బరిసె ఉపయోగించాలి. ఆ సేఫ్ ఎత్తుకొచ్చి డైనమైట్‌తో చికిత్స చేస్తే దద్దరిల్లి సొమ్మంతా మన కాళ్ళముందు జల జల రాలుతుంది."

"కనకవర్షమంటే అదే గామోసు!" అన్నాడు చంద్రన్ సంతోషంగా.

నేను మాట్లాడలేదు. కారు ఇంటికి చేరగానే వాళ్ళిద్దరు రేణుక శవం తీసి ఆమె అన్న ప్రక్కన స్థానం కల్పించారు—బావిలో.

"మోహన్, ఈ డాక్టర్ డబ్బు మన వెనుక పోలీసుల్ని ఛార్జి చెయ్యడు. కానీ, ఈ రెండు శవాలు ఆ పని చేస్తాయి. వీటికి శాశ్వత స్థానం ఇక్కడ కాదు....ఏమంటావ్?" అన్నాడు యాదవ్.

చంద్రన్ అన్నాడు "సమస్య అది కాదు, యాదవ్! ముందు దోపిడీ గురించి ఆలోచించు. తర్వాత పలాయనం-వెళ్ళిపోతూ ఈ శవాల్ని కూడా తీసికెళ్ళి ఏ నిర్జన ప్రాంతంలోనో పెట్రోలు పోసి నిప్పంటించేసే.... అవును, రాత్రి సినిమాలో అలాగే చూశాం—ఫ్లైట్ ఆఫ్ ది ఆర్కిడ్—ఆధారాలుండవు."

"ఓ. కే. మరి వినయ్ గురించేమిటి?"

"నువ్వు సిల్లీ ప్రశ్న లేస్తున్నావు. వినయ్ కూడా మన ఫ్రెండ్స్‌తో బాటు...."

"నోర్మూయ్!" గట్టిగా అర్చాను. "చిన్నపిల్లల్ని చంపేంత కిరాతకులమయ్యామా మనం?"

"మరేం చేస్తావ్? అంతా కక్కేస్తాడు."

"ఓహ్, డామిట్! ఏమిటీ మీ తొందర? నా మెదడు తినకుండా అలా తగలడండి" అర్చి గబగబా పైకెళ్ళాను. నాకేమీ తోచడం లేదు. మధ్యాహ్నం నుంచీ వినయ్‌కి భోజనం లేదు. ఇప్పుడు ఇంటికొస్తూ తేవటం మర్చిపోయాను. చంద్రన్‌ని పంపి తెప్పించాలనుకుంటూ గది తాళం తీసి తలుపు తెరిచాను.

లైటువేసి చుట్టూ చూసిన నాకు వినయ్ కన్పించ లేదు.

నా గుండె అదిరింది; కళ్ళు తిరిగాయి; చేతులు చల్లబడ్డాయి.

వినయ్ తప్పించుకొన్నాడు.

ఎలా?

తలుపు తాళం వేసి వుండగా ఎలా పారిపోయాడు?

"చంద్రన్! యాదవ్!" అరిచాను గట్టిగా.

వెంటనే క్రింద అడుగుల చప్పుడయింది. ఆ వెంటనే బెడ్ రూంలో ఫోన్ మ్రోగింది.

చివాలున వురికి బెడ్‌రూంలో కెళ్ళాను. అదింకా మోగుతోంది. ఎవరు? అనుపమా? నా గురించి ఇంకెవరికి తెలుసు....?

"హలో! ఎవరూ?" అన్నాను ఫోన్ యెత్తి.

"నువ్వు మోహనేనా?"

కొత్త గొంతుకి కలవరపడ్డాను, "అవును, మీరు ఎవరు?"

"సరస్వతిని."

"సరస్వతి? ఏ సరస్వతి?"

"నీకు తెలుసు. అనుపమ వదినని."

వెంటనే జాగ్రత్తపడ్డాను. "అనుపమా? ఆమె ఎవరు? మీ రెవరసలు?"

"నీ కంతా తెలుసు, నటించకు. చూడు మోహన్, నువ్వెంటనే బయల్దేరి వచ్చేయ్. నీతో అత్యవసరంగా అతి ముఖ్యమైన విషయం మాట్లాడాలి."

నాకేమీ అర్థం గావడంలేదు "ఏ విషయం?" అరిచాను.

"నే చెప్పిన చోటికిరా, అంతా తెలుస్తుంది. డిఫెన్స్ అకాడమీ దగ్గర హనుమాన్ టెంపుల్ దగ్గరికి. కార్లో వుంటాను. జాగ్రత్త. వెంట ఎవర్నీ తేకు. ఒంటరిగా రా. మరో విషయం—నీ కార్లో రాకు, టాక్సీలో రా. నా

కారుకి వందగజాల దూరంలో పెద్ద రావిచెట్టు వుంటుంది. అక్కడ దిగిపోయి నడిచిరా. అర్థమవుతోందా, మాస్టర్ మైండ్?"

తేరుకుని మళ్ళీ అరిచాను "ఏమిటి— ఏమిటి మీ వుద్దేశ్యం?

"సదుద్దేశం—అంటే నువ్వు సవ్యంగా వున్నంత వరకు. ట్రిక్కులు ఆలోచించే ముందు నీ బ్రతుకు నా చేతిలో వుందని మరువకు! వెంటనే వచ్చేయ్."

తక్కున లైను కట్ అయింది.

అలాగే వుండిపోయాను కాసేపు.

వాళ్ళిద్దరు ద్వారంలో నిలబడి వున్నారు.

"మోహన్, వినయ్ లేడు!" యాదవ్ అరిచాడు.

"ఫోన్ చేసిందెవరు?" చంద్రన్ అడిగాడు.

"సరస్వతి. అనుపమ వదిన" అన్నాను తేరుకుని.

"దేనికి ఫోన్ చేసింది?"

"మనం ఉత్త వెధవలమని చెప్పడానికి."

"అంటే....? యేమిటి?"

"ఆమె వినయ్ నెత్తుకుపోయిందని ఇంకా వేరే చెప్పాలట్రా దద్దమ్మల్లారా!" పొలికేక పెట్టాను. పిచ్చిగా, కసిగా జుట్టు పీక్కున్నాను.

## 8

టాక్సీ దిగి చుట్టూ చూశాను. చీకటిగా నిర్మానుష్యంగా వుంది. దూరంగా రోడ్డు వారగా ఆగి వున్న అంబాసిడర్ అస్పష్టంగా కన్పించసాగింది. వడివడిగా నడవసాగాను. నా మెదడంతా గజిబిజిగా పిచ్చెక్కినట్లుంది. ఎవరయినా మనశ్శాంతిగల మెదడు అరువిస్తే బావుండుననిపించింది....ఇంకా సగం దూరమైనా నడి

చానో లేదో, చీకట్లోంచి ఓ ఆకారం నా ముందు ప్రత్యక్షమైంది. ఆగిపోయాను.

"హాలో సార్! మిమ్మల్నెవరయినా ఆలా వెళ్తుంటే ఆపి ఫోటో తీశారా?"

అడ్డంగా తలూపాను.

పక పకమని నవ్వు.

"ఆ గుర్తింపూ అదృష్టం ఎందరి కుంటుంది? ఒక్క క్షణం—అలాగే నిలబడండి!"

ఏం జరుగుతోందో గ్రహించే లోపున ఆగంతకుడు కెమెరా ఎత్తి ఫ్లాష్‌గన్ జిగేలు మన్పించాడు.

నా కళ్ళు మిరుమిట్లు గొలిపి కాసేపు యేమీ కన్పించ లేదు. నులుముకొని చూస్తే అతను అల్లంత దూరంలో పరిగెడుతున్నాడు వేగంగా.

"ఏయ్ ఆగు! యెవర్నువ్వు?" అరిచి అతని వెనుక ఉరకబోయాను. ఇంతలో నా వెనుక అరుపు విన్పించింది "మోహన్, నువ్విలా వచ్చేయ్!"

ఆగిపోయి వెనక్కి చూశాను. ఆ అరుపు కారులోంచి వచ్చింది. ఏం చెయ్యాలో తోచలేదు. ఇప్పుడా ఆగంతకుడ్ని వెంబడించడం పూర్తిగా వ్యర్థప్రయత్నం. నీరసంగా కారు దగ్గరికి నడిచాను.

"నన్నెవరో ఆపి ఫోటో తీశాడు" అన్నాను.

"ఎవరో కాదు—మనవాడే" అందామె.

"మనవాడా....యెందుకు?? ఏమిటి మీరు చేస్తున్నది?"

"ముందు కారెక్కి కూర్చో" అందామె అవతలి డోర్ తీస్తూ, "మిలటరీవాళ్ళు తిరుగుతుంటారిక్కడ.... చూస్తే బావుండదు."

కాస్సేపు సందేహించి యెక్కి ఆమె ప్రక్కన కూర్చు

న్నాను."

"నన్నెందుకు ఫోటో తీశారు?" అడిగాను మళ్ళీ.

"అలా తొందరపడకు. అనుపమతో వ్యవహారం ఏమైంది? ఏదో బెడిసి కొట్టినట్టుందే....? ఆమె గదిలో పడుకుని యేడుస్తోంది."

"అలా జరుగుతుందనుకోలేదు. మీకేం చెప్పింది?"

"ఏమీ లేదు. నీకు తెలుసా? మేం అసలు మాట్లాడుకోం. కానీ నాకంతా తెలుసు. నీ గురించీ, నీ ముఠా గురించీ మా ఇంట్లో నీ క్కావల్సిన రహస్యం కోసం అనుపమతో వేస్తున్న యెత్తుగడల గురించీ—"

"హలో, యేమిటి మీరనేది?"

"లుక్ మైడియర్ రెస్పెక్టెడ్ గ్యాంగ్ స్టర్! తమరు శిష్య సమేతంగా బెంగుళూరునుంచి ఇక్కడికి వేంచేసినట్లు తెలిసింది. మా ఇంట్లో సేఫ్ తెరిచే శుభకార్యం కోసం సన్నాహాలు పూర్తి చేస్తున్నట్లు విశ్వసనీయవర్గాల ద్వారా తెలియవస్తున్నది."

"స్టాపిట్! పిచ్చి పట్టింది మీకు!"

"షటప్, యూ చీప్ క్రూక్. నువ్వింకా నటించకు. అబద్ధాలాడకు. ఆవేవీ నిన్నిప్పుడు రక్షించలేవు. నీ జాతకం నా చేతిలో వుందిప్పుడు. నీ గురించి నాకంతా తెలుసు. నేను బుకాయిస్తున్నాననుకోకు నిన్ను పట్టి కొట్టించడానికి. నీ ప్లాను నాకు పూర్తిగా తెలుసు. ఎన్నడూ ఇల్లు కదలని అనుపమ ఈమధ్య బయట ఎక్కువ గడుపుతోంటే అనుమానం వేసి కనిపెట్టసాగాను. నీతో చెట్టాపట్టా లేసుకు తిరుగుతోంటే ఓ, అదా సంగతి అనుకున్నాను. కానీ నిన్ను చూస్తే నాకు మంచి అభిప్రాయం కలుగలేదు. అనుపమ పొరపాటు చేస్తోందనిపించింది.

నువ్వామెని నాశనం చేస్తావనుకున్నాను....

"అయినా ఆమె గురించి పట్టించుకోలేదు. అసలా ఇంట్లో యెవరి గురించీ నాకు పట్టింపు లేదు. వెధవ సంసారం! నీమీద నాకాసక్తి కలిగింది. నీ గురించి ఆరా తియ్యమని సుమన్‌ని పురమాయించాను. నువ్వొక్కడివే కాదనీ—నీతోపాటు మరో నల్గురున్నారనీ—అందులో ఒక ఆడది కూడా వుందని సుమన్ చెప్పాడు. ఆ ఆడది-దట్ డర్టీ స్లట్ సునీల్‌ని వల్లో వేసుకొని నీలాంటి ప్రయత్నాలే చేస్తోంది.... మొన్న రాత్రి ఇంటికొచ్చి రభస చేసింది.

"ఇదంతా చూశాక నాకేమన్పించిందో తెలుసా? మీరంతా మా ఇంట్లో సేఫ్‌మీద కన్నేశారని అర్థమైంది. కానీ మీరు సునీల్‌తోనూ, అనుపమతోనూ కాలం వృధా చేశారు. కాంబినేషన్ ఏమిటో అసలా సేఫ్ యెక్కడుందో వాళ్ళకి తెలియదు. డాక్టర్ తర్వాత దాని గురించి తెలిసింది యెవరయ్యా అంటే నేనే!"

"అదెక్కడుంది? కాంబినేషన్ తెలుసా?"

"తొందరపడకు. కాంబినేషన్ ముసలాడి బుర్రలో భద్రంగా వుంది. అసలు ఇంట్లో సేఫ్ వున్నట్లు నాకు నెల క్రితమే తెలిసింది. అప్పుడప్పుడతను తలుపేసుకొని గదిలో చాలాసేపు గడుపుతోంటే యెందుకు చెప్మా అని ఓ రోజు చిల్లులోంచి చూశాను. అప్పుడుగానీ అసలు సంగతి తెలియలేదు. చిల్లులోంచి అతను చేసింది చూశాక ఓరోజు నేనూ అలాగే చేశాను. ఇంకేముంది! భూమి బ్రద్దలై మెట్లు కన్పించాయి. దిగి చూస్తే కొయ్యపీట మీద లోపల సేఫ్ కన్పించింది. ఇంతలో యేదో అలికిడి విని అలాగే పారిపోయి వచ్చేశాను, ద్వారం మూసి

కుండా...."

"అవును, అనుపమ చెప్పింది."

ఉలిక్కిపడిందామె "నా గురించి చెప్పిందా?"

"లేదు, ఆమెకేమీ తెలియదు. పువ్వు ముడుచుకున్నట్లు తిరిగి విచ్చుకున్నట్లు మాత్రమే ఆమెకు తెలుసు. ఆ మధ్య యేం జరిగిందో ఆమె చూళ్ళేదు."

"బ్రతికించావ్. ఆ సేఫ్ చూసినప్పట్నించీ నా కంటి మీద కునుకు లేదు. మనశ్శాంతీ లేదు. కాంబినేషన్ తెలియదు. దాన్ని ముసలాడు బయట పడేసుకునే పరిస్థితి యెలా కల్పించాలా అని ఎన్నో ఉపాయాలు ఆలోచించాను. ఒక మార్గం తట్టింది. కానీ మరొకరి సహాయం కావాలి—బయటి వ్యక్తి సహాయం. అతన్ని నేను నమ్మలేను. దొరికిన సొమ్ముతో పారిపోవచ్చు. లేదా బ్లాక్ మెయిల్ చెయ్యవచ్చు.

"మీ గ్యాంగ్‌ని చూశాక నాకు పనికొస్తారనుకున్నాను. ఆ పని మీరే చెయ్యగలరు. అయితే డబుల్ క్రాస్ చెయ్యకుండా కట్టుదిట్టం చెయ్యాలి. అందుకే మిమ్మల్ని జాగ్రత్తగా కనిపెడుతున్నాను. మీ గురించి ఒక్క వీక్ పాయింట్ తెలిస్తే నా చేతిలో కీలు బొమ్మలవుతారు—"

"ఇప్పుడయ్యామా?"

"నిస్సందేహంగా! మీ బ్రతుకులు నా గుప్పిట్లో వున్నాయి."

"మీరు వినయ్‌ని ఎత్తుకు పోయారని యెందుకు చెప్పరు?"

"అవును, వినయ్‌ని ఎత్తుకుపోయాను. అతను నాకంతా చెప్పేశాడు."

"అతను మా దగ్గర వున్నట్లు మీ కెలా తెలుసు?"

నవ్వింది దామె పైకి. మొదటిసారి ఆమె నవ్వు విన్నాను. ఆమెని మొదటిసారి చూసినప్పుడు నాకేర్పడిన అభిప్రాయానికీ, ఇప్పుడీ నవ్వుకీ బాగా సరిపోయింది. ఆడ విలన్ నవ్వు అప్సరసలా ఎలా వుంటుంది?

"చెప్పానుగా, మిమ్మల్ని కనిపెడుతున్నానని?" అందామె నవ్వాపుకుంటూ "మై డియర్ పూర్ ఫెలో, నీ ఇంట్లోకి నేను రెండు సార్లు ప్రవేశించానని నీకు తెలుసా? మొదటిసారి నీ లవర్ మా ఇంటికొచ్చి గొడవచేసి వెళ్ళినప్పుడు. అప్పుడామెని వెంటాడాను. నాకో వీక్ పాయింట్ కావాలి కదా? ఆమె నిన్ను కలుసుకుంటుందనుకున్నాను. కానీ దార్లో యెక్కడో తప్పిపోయింది. అప్పుడు తిన్నగా నీ ఇంటి కెళ్ళాను. కానీ అక్కడికామె రాలేదు. చాలా సేపు యెదురు చూసి వెళ్ళిపోయాను. నువ్వప్పుడు ఫోన్‌లో మాట్లాడుతున్నట్టు గుర్తు...."

ఉలిక్కిపడ్డాను. అయితే ఆ రాత్రి నేను చూసిన నీడ రేణుక కాదన్నమాట!

"ఆ రాత్రి యేమీ లాభించలేదు. కాని నిన్నరాత్రి మీ ముఠా అంతా ఇంట్లో సమావేశమైనప్పుడు బయట వుండి అంతా విన్నాను. అప్పుడే మీ ప్లాను నాకు పూర్తిగా తెలిసిపోయింది. వాళ్ళంతా వెళ్ళిపోయాక నువ్వెవరికో ఫోన్ చేసి బెదిరించడం విన్నాను.... దాన్ని బట్టి యెవరి పిల్లాడ్నో నువ్వు దేనికో బంధించినట్లు అర్థమైంది. అంతే మోహన్, ఇంతకంటే నాకే వీక్ పాయింట్ కావాలి!"

నేను మాట్లాడలేదు.

"కాబట్టి మోహన్, ఈ సాయంత్రం నేను సుమన్‌తో

మారు తాళాలతో నీ ఇంట్లో ప్రవేశించి వెదికాను. పైన గదిలో ఆ అబ్బాయి వున్నాడు. కట్లు విప్పి అంతా తెలుసుకున్నాను. నువ్వు మర్డర్ చేశావని నేనూహించ లేదు. ఇంతకంటే యేం కావాలి? శవం కోసం ఇల్లంతా గాలిస్తున్నప్పుడు అప్రయత్నంగా బావిలో చూశాం— నీళ్ళు యెక్కువ లేవు. టార్చి వెలుగులో నిలకడగా వున్న నీట్లోంచి అడుగున శవం స్పష్టంగా కన్పించింది. తక్షణం సుమన్ కెమెరా తెచ్చుకొని బావిలో దిగి ఫోటోలు తీశాడు."

కొయ్యబారిపోయాను.

ఆమె పక పకా నవ్వింది. "వింటూంటే డిటెక్టివ్ కథలా లేదూ? కాని ఇది నిజం. ఆ ఫోటోలు రేపుదయం చూద్దువుగాని. మీ రిప్పుడు నా చేతిలో పూర్తిగా బందీలు! వినయ్, సుమన్ దగ్గర వున్నాడు. ఆ అబ్బాయి నన్ను బాగా నమ్ముతున్నాడు. చెప్పినట్లు వింటాడు. మీరు డబుల్ క్రాస్ చెయ్యకుండా బుద్ధిగా పని పూర్తి చేస్తే వినయ్ నోరు మెదపడు. లేకపోతే పోలీసులు వస్తారు—అంతా చెప్పేస్తాడు. పోస్టులో ఫోటోలు చేరు తాయి. అర్థమైందా? నువ్వు పారిపోతే గాలించడానికో ఫోటో వుండాలి కదా? అందుకని సుమన్ ఇందాక నిన్ను దార్లో ఆపి ఫోటో తీశాడు. సుమన్ యెవరో, యెక్కడ వుంటాడో తెలుసుకునే ప్రయత్నాలేవీ చెయ్యకు. అది మీ క్షేమానికి మంచిది కాదు."

"అవును. ఇది పదహారణాల స్వచ్ఛమైన బ్లాక్ మెయిల్" అన్నాను సిగరెట్ ముట్టిస్తూ.

"అదీ సంగతి! అంతా సవ్యంగా జరిగితే వినయ్ ఇంటికెళ్ళిపోయి కిమ్మనకుండా వుంటాడు. నేనే దిగబెట్టి

తలిదండ్రుల్ని హెచ్చరిస్తాను. అబ్బాయి నేమీ అడ క్కండి—ప్రాణాలకి మోసం. అతనెక్కడ దొరికా డంటే ఫలానచోట ఎక్కడో పరిగెత్తివస్తోంటే కారెక్కించుకొని తెచ్చానంటాను. పిల్లవాడు తిరిగి వచ్చిందే భాగ్యం, కిడ్నాపర్స్‌ని పట్టుకోనే పిచ్చి ప్రయ త్నాలుచేసి మళ్ళీ కష్టాలు తెచ్చుకోరెవరూ. నువ్వీ నమ్మకం వుంచుకొని నిబ్బరంగా వుండు. నేను హామీ ఇస్తున్నాను. కానీ మోసం చేసినపుడు అంతా వ్యతి రేకంగా జరుగుతుందని గుర్తుంచుకో!"

"ఓ.కే! ఏంచెయ్యాలో చెప్పండి."

"ఈ పని మీరెందుకు చెయ్యలేదో తెలియడంలేదు. ఇంత ప్రయాస దేనికిపడ్డారు? నేరుగా ఇంట్లో జొరబడి డాక్టర్‌నీ, మమ్మల్నీ పిస్తోళ్ళతో బెదిరిస్తే కాంబినేషన్ చెప్పేస్తాడు కదా? ఈ ఆలోచన రాలేదనుకుంటాను."

"అక్కడే వుంది పొరపాటు. పరిస్థితులు ఎలా రూపు దాలుస్తాయో చెప్పలేం. మీరు చెప్పినట్లుచేస్తే ఏదైనా విపత్తు సంభవించవచ్చు. అలా బెదిరించే ప్రయత్నంలో టెన్షన్ పెరిగి షూట్ చేసే పరిస్థితి రావచ్చు. ప్రాణ నష్టం జరగవచ్చు. మీ డాక్టర్ పోలీసులనుండి దోపిడీ దాచగలదేమోగాని షూటింగ్—మర్డర్స్ దాచలేడు. మేం రహస్యంగా, శాంతియుతంగా కార్యం జరపాలను కున్నాం. అర్థమైందా? ఇక మీ ఆలోచన చెప్పండి."

"అదే ఆలోచన!" అందామె వెంటనే, "మీరలా జొరబడి బెదిరించాలి. ఆపైన నేను చూసుకుంటాను. రేపు సాయంత్రం అయిదుగంటలకి వచ్చేయండి. సునీల్ కూడా ఇంట్లో వుంటాడు. డాక్టర్‌ని బెదిరించి సేఫ్ తెరవ మనండి. వినకపోతే నన్నూ అనుపమనూ కాల్చేస్తామని

చెప్పండి. అప్పుడు నేను గగ్గోలు ప్రారంభిస్తాను. నన్ను చూసి అనుపమ కూడా మొత్తుకుంటుంది. ఆమె అన్నయ్య పిరికివాడు. రివాల్వర్ చూపిస్తే గజగజలాడి తండ్రిని గదమాయిస్తాడు. నా అరుపులూ కేకలతో వాళ్ళనింకా ఎంకరేజ్ చేస్తాను. డాక్టర్‌ని పట్టుకొని మా ప్రాణాలు కాపాడమని ఏడుస్తాను. చాలు. అంతమాత్రం దయలేని వాడనుకోను."

"చెప్పేస్తాడంటారా?"

"చచ్చినట్టు! మేమంతా భస్మేసే పాడు డబ్బుతో దిక్కులేని బ్రతుకు బ్రతుకుతాడా? మీరు బొమ్మల్లా నిల్చోకూడదు! సాధ్యమైనంత భీభత్సం సృష్టించండి. కానీ—అతనిపైన దౌర్జన్యం చెయ్యకండి. గుండె బలహీనం. హరీమంటే మనందరి పనీ గోవిందా!"

"ఒకవేళ మమ్మల్ని చూసిన షాక్‌తోనే బకెట్ తన్నేస్తే?"

"ఇలాంటి అనుమానాలు చాలా వస్తాయి అనవసరంగా. అవన్నీ ఆలోచించకు. చెప్పు, నీకు సమ్మతమేనా?"

"అలాగే! చేస్తాం, రైట్."

"వెరీగుడ్. అందులో డబ్బూ, నగలు వుంటాయి. వాటితో మీరు పారిపోండి. పోలీసు బెడదలేదు. అది బ్లాక్‌మనీ అని నీకు తెలుసు. తిన్నగా ఇంటికెళ్ళిపొండి. అంతా చల్లబడ్డాక నేను వచ్చి నా వాటా తీసుకుంటాను."

"ఎంత?"

"సగం."

"అసలెంతో మీకెలా తెలుస్తుంది?"

"ఓస్, మీరు పారిపోతున్నప్పుడు సుమన్ వెంటాడి

మీ ఇంటికొస్తాడు. అక్కడ అసలెంతో నువ్వు చూపిం చాలి. జాగ్రత్త! ట్రిక్కులు చేసినా, వూరొదిలి పారి పోయినా, నీ ఫోటోలు బాక్సు కట్టి ప్రచురిస్తాయి పత్రికలు."

"అలాంటి అనుమానాలు పెట్టుకోకండి. మీవల్ల మేం ప్రయోజనం పొందుతున్నాం. పాలిచ్చే రొమ్ముని పొడు స్తామా?"

"ఏమో! మీ తల్లుల్ని ఎలా ట్రీట్ చేశారో, చేస్తు న్నారో నాకేం తెలుసు?" అందామె కారు స్టార్టు చేస్తూ.

# 9

మేం ముగ్గురం నాలుగున్నరకి బయలుదేరాం.

మా కారు గంభీరంగా, రాజాలా సాగిపోతోంది. మా ముఖాల్లో అప్పుడే లక్షాధికారులమన్న దర్జా వెలిగిపోతోంది. ఎవరికివారే గర్వంతో బిర్రబిగుసుకుని కూర్చున్నాం. కష్టఫలితం ఎక్కడికీపోదు. ఎన్ని అవాంత రాలేర్పడినా వాటిని ఎదుర్కొంటూ శ్రమించాం. ఇప్పుడు ఫలితం అనుభవించబోతున్నాం.

కానీ మేం పొందేదాంట్లో సగం సరస్వతికి ధారా దత్తం చేయవల్సివస్తోంది. ఇదే మమ్మల్ని బాధిస్తోంది. ఈ మొత్తం రేణుక, సుభాషిలతో పంచుకొనే దానికన్నా ఎక్కువ. అయినా ఇప్పుడు గత్యంతరంలేదు!

సరస్వతిని మోసంచేసే మార్గాలెన్నో ఆలోచించాం. ఒక్కటీ ఆమోదయోగ్యంగా లేదు. ఆమె బ్లాక్ మెయిల్‌ని తిప్పికొట్టే కుయుక్తులేవీలేవు. వ్యవధి అంత కన్నా లేదు.

ఎంతసేపూ మా ఆలోచన డాక్టర్‌ని లొంగదీయ

గలమా అన్నదే. దౌర్జన్యం జరపకూడదు. ఇంకా హత్యలు చెయ్యకూడదు. హత్య మా వెనుక పోలీసుల్ని యాదృచ్ఛికంగా తరిమిస్తుంది.

సొమ్ము తెచ్చుకున్నాక వీలయినంత త్వరగా సరస్వతిని వదిలించుకుని బయటపడాలి. అప్పుడు బావిలోని శవాల్ని ఉనికిలేకుండా చెయ్యాలి. సరస్వతి దగ్గర ఆ ఫోటోలతో సహా నెగెటివ్ రైట్స్ కూడా కొనుక్కొని ఈ సిటీకి గుడ్ బై కొట్టాలి.

బంగళా దగ్గర పడింది ...

యాదవ్ గాభరాగా చాక్లెట్ ఉమ్మేశాడు.

చంద్రన్ నిటారుగా కూర్చుని ముందూ వెనుకా చూశాడు.

కారు వేగం తగ్గించి గేటుదగ్గర ఆపాను. వీధి, ఇళ్లూ అన్నీ నిశ్శబ్దంగా వున్నాయి. మమ్మల్నెవరూ గమనించడంలేదు.

ముగ్గురం కారు దిగాం. చంద్రన్ పెద్ద సూట్ కేసుతో దిగాడు. మా జేబుల్లో రివాల్వర్స్ వున్నాయి. నేను సైగచేసి గేటుదగ్గరికెళ్ళాను. వాళ్ళు వెనుక వచ్చారు. గేటు గడియతీసి లోనికెళ్తూంటే వరండాలో ఒక ఆకారం ప్రత్యక్షమైంది—పనిమనిషి ఆకారం.

“కమాన్! పరిగెత్తండి!” వేగంగా ముందుకురికాను. మమ్మల్ని చూసి పనిమనిషి లోనికురికింది.

“చంద్రన్! ఇంట్లోంచి ఎవరూ బయటికి పోకుండా చూడు!”

చంద్రన్ ఇంటివెనక్కి వురకడంతో, నేనూ యాదవ్ వరండా ఎక్కి లోనికి జొరబడ్డాం.

హాల్లో ఎవరూలేరు. కుడివైపు గదిలో మాటలు

విన్పించాయి. ఒక ఆడగొంతు అరుస్తోంది. మరో మగ గొంతుక ప్రశ్నిస్తోంది.

నేనాలస్యం గాకుండా ఆ గదిలోకి వెళ్ళాను. యాదవ్ మేడమీదికి పరుగుతీశాడు. గదిలో నన్ను చూసి వాళ్ళు స్తంభించిపోయారు. డాక్టర్ ముఖం వివర్ణమైంది. నా చేతిలో రివాల్వర్ చూసి అతని సిగార్ జారిపడింది. పనిమనిషి కెవ్వుమంది.

డాక్టర్ కదల్లేదు. అతను కుర్చీలో వున్నాడు. కాళ్ళు జాపి చెరో హేండిల్ మీద చేతులు పెట్టుకున్నాడు. మనిషి ఎత్తుగా, భారీగా వున్నాడు. తెల్లటి వర్ణం, తల వెంట్రుకలు నెరిశాయి. ముఖంలో ముడతలు వయసును వెల్లడిస్తున్నాయి.... కానీ కళ్ళలో వర్ణనకు అందని శక్తి ఏదో నన్ను ముందుకు సాగనివ్వలేదు—దూరంగా ఆగిపోయాను, గుండె వేగంగా కొట్టుకుంటోంటే.

"ఏమిటది? ఎవరు మీరు?"

పిట్టకూతలాంటి అతని గొంతువిని ఉలిక్కిపడ్డాను.

డాక్టర్ సంకర్షన్ రెడ్డి కాళ్ళు దగ్గరికి తీసుకొని ముందుకి వంగాడు. పనిమనిషి భయంగా అతని వెనుక నిలబడింది—ఇంతలో అరుపులు విన్పించాయి. డాక్టర్ చివాల్న లేవబోయాడు.

వెంటనే ధైర్యం పుంజుకొని రివాల్వర్ చూపించాను.

"టేకిట్ ఈజీ, డాక్టర్. మీరు కదలకండి."

అతను కదల్లేదు. తీక్షణంగా చూశాడు. నేను చెమటలో తడిసిపోయి వున్నాను. ఇప్పుడు అరుపులతోబాటు బయట అడుగుల చప్పుడైంది. సునీల్ పెద్దకేకతో విసురుగా వచ్చి తండ్రి కాళ్ళదగ్గర పడ్డాడు. మరుక్షణం యాదవ్ ప్రత్యక్షమయ్యాడు. వెనుక ఆడవాళ్ళిద్దరితో

చంద్రన్ ప్రవేశించాడు.

సునీల్ తండ్రిని పట్టుకొని భయంలో, "డాడీ! వీళ్ళు దొంగలు!" అనర్చాడు గట్టిగా.

యాదవ్ విసురుగా అతని దగ్గరికెళ్ళి, నెత్తిమీద మొట్టికాయవేసి, జుట్టుపట్టి లాగాడు. "కూతలెయ్యక! నీ పూలరంగడి ఫోజులేమయ్యాయి? గట్స్‌లెస్ ఫెలో!"

ఆడవాళ్ళిద్దరు కెవ్వుమన్నారు. సరస్వతి సునీల్ దగ్గర కురికింది. కానీ యాదవ్ దూరంగా లాగి చెంప మీద కొట్టాడు. ఈసారి ఆమె కృత్రిమంగా అరవలేదు. యాదవ్ చర్యకి నేను కంగారుపడ్డాను.

"ఓ.కే! ఓ.కే! నో వైలెన్స్ ప్లీజ్! ప్రశాంతంగా బిజినెస్ ముగిద్దాం!" అన్నాను డాక్టర్‌ని సమీపిస్తూ.

అనుపమ చంద్రన్ అదుపునుంచి తప్పించుకుని నా మీదకు దూకింది. వెనుకనుంచి ఆమె చేతిగోళ్ళు నా మెడమీద గుచ్చుకున్నాయి. ఆమె త్రాచుపాములా బుస కొట్టింది. ఆమె చేతులు నా కంఠాన్ని బిగుతుగా చుట్టేస్తున్నాయి. ఉక్కిరిబిక్కిరై వెనక్కి తిరిగాను—

ఆదే క్షణంలో చంద్రన్ తేరుకొని మెరుపులా వచ్చాడు. రివాల్వర్ పిడితో ఆమె తలమీద ఒక్క దెబ్బవేశాడు. ఫట్‌మంది. ఆమె గట్టిగా మూల్గింది. మరో దెబ్బపడింది. ఆమె నన్ను వదిలేసి క్రిందపడి పోయింది ...

పనిమనిషి మరో కేకవేసి స్పృహతప్పింది.

సరస్వతి యాదవ్‌ని విడిపించుకుంటూ, "మామయ్యా! మమ్మల్ని వీళ్ళు చంపేస్తారు!" అనర్చింది.

"డాడీ! మమ్మల్ని కాపాడండీ!" సునీల్ అందుకున్నాడు. నావైపు తిరిగి, "ఏంకావాలి మీకు? ఏం

కావాలన్నా ఇచ్చేస్తాం! మమ్మల్నేం చెయ్యకండి! చెప్పండి, ఏం కావాలి?" అని అరుస్తోండగా యాదవ్ అందుకొని, "డామ్ యువర్ గట్స్" అని కసిరాడు.

డాక్టర్ సంభ్రమాశ్చర్యాలనుంచి అప్పటికి కోలుకొని కళ్ళు మిటకరించాడు. కానీ మనిషి ఏమాత్రం చలించి పోలేదు. నేలమీద బోర్లా పడివున్న అనుపమను చూసీ చూడనట్లు చూసి, "ఆల్ రైట్, ఏం కావాలి మీకు?" అన్నాడు గాంభీర్యం సడలని స్వరంతో.

"మీ సేఫ్‌లో డబ్బుంది డాక్టర్, అదిచ్చెయ్యండి" అన్నాను ముక్తసరిగా.

అతని కళ్ళు విశాలమయ్యాయి. "డబ్బు? ఏ డబ్బు మిస్టర్?"

"మామయ్యా!" సరస్వతి వేడుకొంది. యాదవ్ ఆమెని వదిలేశాడు. ఆమె డాక్టర్ చేతులు పట్టుకొని వూపేస్తూ ప్రతిమాలింది, "మీరు అడ్డు చెప్పకండి! వాళ్ళడిగింది ఇచ్చేయండి! మేం ప్రాణాలతో వుండాలని లేదా? అనుపమని చూడండి—ఏం చేశారో ఈ దుర్మార్గులు! మామయ్యా, మీరింకా—"

డాక్టర్ ఆమెని దూరంగా నెట్టేశాడు. "నా దగ్గర ఏ డబ్బూ లేదు, గెటవుట్!"

"మూర్ఖంగా ప్రవర్తించకండి! మాట్లాడకుండా సేఫ్ తెరిచి డబ్బు మా స్వాధీనం చెయ్యండి! క్విక్. సమయం లేదు! లేదా, మీ కళ్ళముందే వీళ్ళందర్నీ షూట్ చేసి మీ ఎమోషన్స్ చూస్తాం. తర్వాత తీరిగ్గా వెళ్ళిపోతూ మీరు వాళ్ళని అనుసరిస్తారు. కమాన్ డాక్టర్! మమ్మల్ని జోకర్స్‌గా భావించకండి. దేనికైనా తెగించగలం!"

డాక్టర్ కలవరంగా చూశాడు. నా మాటలకి సర

స్వాతితో పాటు సునీల్ కూడా ఏడుపు లంకించుకున్నాడు. పెద్ద గగ్గోలు లేచింది. డాక్టర్ గాభరా పడిపోయాడు. వాళ్ళిద్దరు ఏడుపు ఇంకా ఎక్కువ చేసి బ్రతిమాలుతున్నారు, నచ్చజెపుతున్నారు. కాస్సేపట్లో డాక్టర్ పూర్తిగా చలించిపోయి వాళ్ళకి లొంగిపోయాడు.

"ఆల్ రైట్, యూ బాస్టర్డ్స్. నా డబ్బు తీసుకోండి—" గిరుక్కున తిరిగి టేబిల్ దగ్గరికి పెద్ద పెద్ద అంగలేశాడు. మేం ఆశ్చర్యంగా ముఖాలు చూసుకున్నాం. సరస్వతి నాకేసి దొంగ చూపులు విసిరి నవ్వింది. అంత సులభమా? డాక్టర్ ఇంత తేలిగ్గా లొంగిపోతాడా?

డాక్టర్ సొరుగు లాగి, మెరుపులా వెనుదిరిగి, చంద్రన్‌నీ యాదవ్‌నీ పిట్టల్ని కాల్చినట్లు కాల్చిపారేశాడు రివాల్వర్‌తో.

యాదవ్ కిందపడుతూ రివాల్వర్ ఎత్తి అతన్ని షూట్ చెయ్యబోయాడు. అంతలో సరస్వతి భయంకరంగా అరుస్తూ మధ్యకి దూకి అడ్డు నిలబడింది, మరో వైపు డాక్టర్‌ని నెట్టేస్తూ. బుల్లెట్ ఆమె గుండెలో దూసుకెళ్ళి డాక్టర్ కాళ్ళదగ్గరే ప్రాణాలు వదిలేసింది.

చంద్రన్ యాదవ్ కూడా చచ్చిపోయారు.

సునీల్ భార్య దగ్గర కూలబడి ఏడుస్తున్నాడు. తండ్రిని నిందిస్తున్నాడు. డాక్టర్ అచేతనంగా శూన్యంలోకి చూస్తూ, "నువ్వెందుకిలా చేశావు, సరస్వతీ...." అంటూ గొణుగుతున్నాడు.

ఆ హత్యాకాండ ఘటన నుంచి తేరుకొనేసరికి నేను మరోసారి చెమటలో తడిసిపోయాను. ఏం చెయ్యాలో పాలుపోలేదు. ఒక క్షణం పారిపోవాలనుకున్నాను. కానీ

పడ్డ శ్రమ, ముందు ఊహించుకున్న భవిష్యత్తు నన్ను ఆ పని చేయనివ్వలేదు. అయితే నేనిప్పుడు ఒంటరివాడినన్న అధైర్యం కృంగదీసింది—

ధైర్యం పుంజుకొని డాక్టర్ చేతిలో రివాల్వర్ లాక్కున్నాడు. అకస్మాత్తుగా నా కళ్ళలో క్రూరత్వం, కాఠిన్యంచూసి; డాక్టర్ కళ్ళలో భయం మెరిసింది.

"ఒకరి చావు చూశావు. మరికొన్ని చూస్తావా, మూర్ఖుడా!" గర్జించాను శక్తికొద్దీ.

డాక్టర్ అడ్డంగా తలూపుతూ లేచి టేబిల్ దగ్గర కెళ్ళాడు. ఏంచేస్తున్నాడో గ్రహించే లోపున సొరుగు లోకి చెయ్యి పోనిచ్చి ఏదో చేశాడు. పైనవున్న తామర పువ్వు ముడుచుకుంది. వెనక్కి తిరిగి గబగబా అవతల గదిలోకి నడిచాడు. నేను సూట్ కేసుతో వెంబడించాను. అతనొకచోట తివాసీ ఎత్తేసి; ఏర్పడిన ద్వారంలోంచి క్రింద మెట్లు దిగసాగాడు. జాగ్రత్తగా నేనూ వెళ్ళాను. క్రింద లైటు వెలుగుతోంది. అక్కడ సేఫ్‌తప్ప ఏమీ లేదు. పెద్ద బలిష్టమైన సేఫ్. అతను దానిదగ్గరికెళ్ళి తిప్పి క్షణాల్లో తెరిచేశాడు.

నాకు ఊపిరాడడంలేదు, లోపలచూసి! కట్టలుగా పేర్చివున్న కరెన్సీనోట్లు, కుప్పగా పడేసి వున్న నగలు నా కళ్ళను చెదరగొట్టాయి! ఆవేశంగా, ఆబగా వాటిని లాగి సూట్ కేసులో పడేయసాగాను. డాక్టర్ నోరు తెరిచిపెట్టి చూస్తున్నాడు.

మూడు నిమిషాల్లో సేఫ్ ఖాళీచేశాను.

వెనక్కి తిరిగి వేగంగా మెట్లెక్కి పైకివచ్చేశాను.

అప్పుడు బయట బూట్లచప్పుడు వినిపించింది.

నా కాళ్ళకి సంకెళ్ళుపడ్డాయి. లోనికొస్తోన్న పోలీ

సుల్ని కిటికీలోంచి చూసి ప్రాణాలెగిరిపోయాయి. వీళ్ళ కెలా తెలుసు? నా తల బ్రద్దలవుతోంది! ఇందాక షాట్స్ విని బయట ఎవరైనా ఫోన్ చేశారా?

గాభరాగా సునీల్ ని చూశాను. అతనింకా భార్య దగ్గర ఏడుస్తున్నాడు. ఆలస్యంగాకుండా రంగంలో దిగాను. గభాల్న అనుపమని ఎత్తుకొని భుజానవేసు కున్నాను. మరో చేతిలో సూట్ కేసు పట్టుకొని, కుడి చేతిలో రివాల్వర్ ఆమె తలకానించాను. ఛటుక్కున తలుపు ప్రక్కన వెళ్ళి నిలబడి లోనికి జొరబడుతున్న పోలీసుల్ని నిశ్శబ్దంగా గమనించాను.

వాళ్ళంతా లోనికొచ్చి శవాన్ని ఆశ్చర్యంగా చూస్తున్నారు.

ఇంతలో డాక్టర్ ప్రక్కగదిలోంచి రొప్పుతూ, మెలికలు తిరుగుతూ పరిగెత్తివచ్చి, గుండెపట్టుకొని కూలి పోయాడు.

సునీల్ హృదయవిదారకంగా కేక వేశాడు.

ఇటు తిరిగి అతన్ని చూసిన పోలీసులకి ద్వారం దాట బోతున్న నేను కంటబడిపోయాను. ఆగిపోయి నవ్వాను. "నన్ను తరమకండి! షూట్ చెయ్యకండి. ఈమె ప్రాణాలు నా చేతిలో వున్నాయి. డోంట్ బి ఫూలిష్."

ఛటుక్కున తలుపులాగి బయట గడియవేశాను.

## 10

నాకారు ఎనభై మైళ్ళ వేగంతో బొంబాయి హైవే మీద దూసుకుపోతోంది—కమ్ముకుంటోన్న చీకట్లను చీల్చుకుంటూ.

నా ప్రక్కన అనుపమ నిశ్శబ్దంగా కూర్చొనుంది. వెనుక సీట్లో ఎట్టకేకలకు సాధించుకొన్న ఐశ్వర్యంతో

సూట్ కేసు పడివుంది.

నా నవనాడులూ పులకరిస్తున్నాయి.

కానీ అదే క్షణంలో జలదరిస్తున్నాయి ....

మొదటనుంచి ఏది జరక్కూడదనుకొని జాగ్రత్తలు తీసుకున్నానో అదే జరిగిందిప్పుడు! పోలీసు వేటకి గురయ్యాను! ఈ డబ్బుతో ప్రపంచంలోని సుఖాన్నంతటికీ బదులు భయాందోళనల్ని కొనుక్కున్నాను! డామిట్! అంతా ఆ డాక్టర్ చేశాడు! మూర్ఖుడు! అలా షూట్ చేసి వుండకపోతే పోలీసులకేమీ తెలిసేది కాదు! ఇప్పుడంతా తెలిసిపోయింది! ఇంకా కొన్ని తెలిసిపోతాయి....

సుమన్ ఆ ఫోటోలు పోలీసులకి పంపిస్తాడు. వినయ్ నోరు విప్పేస్తాడు. ఆ బావిలో ఒకటి కాదు, రెండు శవాలు బయట పడ్డాయి! మర్నాడు పత్రికలన్నీ ఆ ఫోటోలతో దర్శనమిస్తాయి!

అసలు డాక్టర్ దగ్గర రివాల్వర్ వుందని సరస్వతి ఎందుకు హెచ్చరించ లేదు? మర్చిపోయిందా? లేక తెలియదా?

ఈపాటికి హైద్రాబాదులో సంచలనం బయలుదేరి వుంటుంది—పోలీసులు నా కారుని గాలిస్తుంటారు. అన్ని చెక్ పోస్టులకి, వివిధ గ్రామాలకి వైర్ లెస్ పంపుతుంటారు. హెచ్చరిక వ్యాపించేలోగానే నేను నగరం వదిలి బయటపడ్డాను.

ఇప్పుడు వీలయినంత వేగంగా, త్వరగా బొంబాయి చేరుకోవాలి. అక్కడ తలదాచుకొని అండర్ వరల్డ్ గ్యాంగ్స్ తో మారువేషంలో పాస్ పోర్ట్స్, వీసాకోసం ప్రయత్నించాలి. అక్కడి పరిస్థితుల్నిబట్టి అనుపమని తీసి

కళ్ళాల్లో, కూడదో నిర్ణయించాలి. ఒక్కసారి దేశం వదిలి బయటపడితే నాకే అపాయమూ వుండదు—వెస్టుఇండీస్ వెళ్తే బావుంటుందనుకున్నాను.

ఆలోచనల్లోంచి తేరుకొని అనుపమని చూశాను. ఆమె కిటికీలోంచి బయటికి చూస్తోంది. థాంక్ గాడ్! తండ్రి చావు గురించీ, వదిన హత్య గురించీ ఆమెకు తెలియదు! లేకపోతే ఏ అఘాయిత్యం చేసివుండేదో ఈ పాటికి!

"ఏమాలోచిస్తున్నావ్?" అడిగాను చిన్నగా.

"నన్నెక్కడికి తీసికెళుతున్నావ్?" అందామె తల తిప్పకుండానే.

"ఒకప్పుడు నువ్వే చెప్పావు—నిన్ను తీసుకొని దూరంగా పారిపొమ్మని!"

"నువ్వు కిరాతకుడివని నాకు తెలియదప్పుడు."

"ఇప్పుడు తెలిసి ఏంచేస్తున్నావ్?"

ఆమె మాట్లాడలేదు.

గట్టిగా నవ్వాను. "ఏమీ చేయలేవు! అబలవి. నా అండ కోరుకోవల్సినదానివి. ఇంతకంటే నీకు గత్యంతరం లేదు! నీకు స్వేచ్ఛకావాలి. నాకు సంపద కావాలి. ఈ రెండూ మనకిప్పుడు లభించాయి. ఇంకేం?"

"నీతో ([illegible])తకవలసివస్తే నాకు స్వేచ్ఛ వద్దు, ఛస్తాను!" అందామె.

దూరంగా లైట్లు కన్పించాయి....ఏదో వూరు దగ్గర పడుతోంది.

ఆమెవైపు తిరిగాను మళ్ళీ, "చూడు ఏదో వూరు వస్తోంది....నీ కాకలిగా లేదూ? నాకు ఆకలేస్తోంది. మధ్యాహ్నంనుంచీ ఏమీ తినలేదు. ఈ ఆంధ్రా సరిహద్దు

దాటేటప్పటికి చాలా రాత్రి పట్టవచ్చు. ఉదయం ఏడు గంటలకల్లా బొంబాయి లిమిట్స్‌లో వుంటాం.... ఈ మధ్య ఎక్కడా ఆగేది లేదు. ఈ ఊళ్ళో ఆగి ఏదేనా తినేద్దాం. ఏమంటావు? నీకిష్టంలేకపోతే మానెయ్యి. కాని అరిచి గొడవచెయ్యావద్దు! నా కపాయం కల్గించేవారిని సహించను, ఎంత ఆత్మీయులైనా సరే. నా దగ్గర రివాల్వర్ వుంది. నువ్వు నోరు తెరిస్తే గుళ్ళు నింపేస్తాను. అరమైందా?"

"నా గురించి భయపడకు! నువ్వు దుర్మార్గుడివి. నిన్ను దేవుడే శిక్షిస్తాడు! దురాగతాల్ని వూరుకోడు!"

"నువ్వూరుకో! నాకలాంటి సెంటిమెంట్స్ లేవు. దేవుడి భయం లేదు. కంటికి కన్పించే పోలీసుల గురించే నా భయమంతా!"

ఊరు పూర్తిగా దగ్గరైంది.... అది చిన్నపల్లెటూరు. అక్కడక్కడా మసగ్గా దీపాలు వెలుగుతున్నాయి. అంతా నిశ్శబ్దంగా వుంది. ఎనిమిది గంటలకే ఊరంతా నిద్రలో జారుకుంది.

వేగం తగ్గించి జాగ్రత్తగా పోనివ్వసాగాను, ఇరువైపులా చూస్తూ. రోడ్డుకిరువైపులా చిన్నచిన్న గుడిసెలూ, అక్కడక్కడ లైటు స్తంభాలూ వున్నాయి. అలా కొంతదూరం వెళ్ళాక కుడివైపు కరెంటు దీపాల వెలుగు కన్పించింది. అక్కడ జనం గుమిగూడి వున్నారు. సందడిగా వుంది.

అది హోటల్ అని గ్రహించాను. జమ్మో కప్పిన పాకలో వుంది. దానెదురుగా ఎడమవైపు రోడ్డువారగా కారాపి దిగాను. అందరూ ఇటు తిరిగిచూశారు.

"పద!" అన్నాను అనుపమతో. ఆమె మాట్లాడ

కుండా దిగింది.

"నా హెచ్చరిక జాగ్రత్త. ప్రాణాలకి తెగించి నన్ను పట్టివ్వాలనుకోవడం పొరపాటు. ఈ వెర్రిబాగుల జనాన్ని పడలగొట్టి పారిపోవడం నాకు సమస్య కాదు. కాబట్టి నీ ప్రాణత్యాగం అర్థంలేనిదవుతుందని గమనించు. పద!"

ఇద్దరం ఆ స్టాల్ లోకి నడిచాం. అందరూ తప్పుకొని మాకు దోవ ఇచ్చారు. స్టాల్ వాడు ఆశ్చర్యంగా, ఆనందంగా చూసి, "రండిసార్! రండమ్మగారూ!" అన్నాడు ఆహ్వానిస్తూ.

మమ్మల్ని తీసుకెళ్ళి లోపల బెంచిమీద కూర్చోబెట్టాడు.

అందరి కళ్ళు మామీదే వున్నాయి.

పరామర్శించడం అయ్యాక స్టాల్ వాడు ఏం కావాలని అడిగాడు.

"యేమున్నాయి?" అన్నాను.

"చపాతీ, సార్! పూరీ, పకోడీ, మిర్చీ....అల్ రెడీ అండ్ వేడి!" అన్నాడతను వినయంగా—అతి వినయంగా.

అనుపమని చూశాను. "యేం తీసుకుంటావు?"

"నాకేమీ వద్దు!"

స్టాల్ వాడితో అన్నాను, "పూరీ, పకోడీ—ఒక ప్లేటు."

"అదేమిటి? అమ్మగారికి—"

"నోర్మూసుకుని వెళ్ళు!" కసిరాను.

అయోమయంగా వెనుదిరిగాడు.

"నీకోసం పార్సిల్ కట్టిస్తాను. ఆకలేస్తే దార్లో

తిందువుగాని" అన్నాను అనుపమతో.

ఆమె మాట్లాడలేదు. ఆమె కళ్ళల్లో వామీద అస హ్యం మెరుస్తోంది.

ప్లేటువచ్చింది. తినడం ప్రారంభించాను. స్టాల్ వాడు అక్కడే నిలబడి అర్థంకానట్లు చూస్తున్నాడు. నేను తలె త్తకుండా తింటున్నాను.

ఇంతలో బయట యేదో కేక విన్పించింది—కాదు పాట!

ఎవరో పాట పాడుకుంటూ పోతున్నాడు.

ఆకలై అన్నమడిగితే పిచ్చోడన్నారు నాయాళ్ళు.
కడుపుమండి న్యాయమడిగితే....

పెద్ద గొంతుకతో ఉషారుగా పాడుకుంటూ వస్తు న్నాడు రోడ్డుమీద.

స్టాల్ వాడు ముసిముసిగా నవ్వాడు. "వాడంతే సార్! వాడికి పిచ్చి. పెళ్ళాం వదిలి పారిపోయింది. అదంటే వీడికి మహా ఇది! వెతకని ఊరంటూ లేదు. చివరికి ఇలా అయిపోయాడు...."

పిచ్చివాడి పాట మధ్యమధ్యలో ఇకిలింపు, సకిలింపు లతో పరాకాష్ట నందుకొంది. వాడిప్పుడు సరిగ్గా స్టాల్ ఎదురుగా నిలబడి పాడుతున్నాడు. వాణ్ని చూసి జన మంతా కదిలివెళ్ళిపోయారు. నేను తలెత్తకుండా నే తింటున్నాను. ఇంతలో వాడెందుకో పాడ్డం మానే శాడు. ఆ దేక్షణంలో అనుపమ ఊపిరిబిగించడం పసి గట్టాను. స్టాలువాడి కేకతో ఛటుక్కున తలెత్తి చూశాను.

ఆ పిచ్చివాడు నా కారులోకి తొంగిచూస్తున్నాడు!

నేను తేరుకు నేంతలో డోర్ తెరిచి వెనుక సీట్లో

సూట్ కేస్ అందుకున్నాడు—

అదిరిపడి లేచాను. విసురుగా అలాగే బయట కురికాను.

"యేయ్, దాన్ని పెట్టేయ్ అక్కడ!" కేక వేశాను.

దాంతో వాడు బెదిరిపోయి అలాగే పరిగెత్తాడు సూట్ కేసు పట్టుకొని—నాకు పిచ్చెత్తినట్లయింది—కళ్ళు బైర్లు కమ్మాయి. అయినా అలాగే శక్తికొద్దీ వురికాను అరుస్తూ.

వాడు నాకందకుండా దూరంగా, వేగంగా వురుకుతున్నాడు. వెర్రిగా, పెద్దగా నవ్వేస్తున్నాడు.

ఇంతలో ఎదురుగా హెడ్ లైట్స్ కన్పించాయి. వేగంగా ఒక లారీ దూసుకొస్తూంది. పరిగెత్తుతున్న మమ్మల్నిద్దర్ని చూసి హారన్ మ్రోగించాడు డ్రైవర్. కానీ వాడు ఆగకుండా సరిగ్గా రోడ్డువతలకి దాటబోయి బైర్ల క్రింద వచ్చేశాడు.

పెద్దగా కేక!

యేదో పగిలిన చప్పుడు!

సూట్ కేస్.

అంతవరకూ అటుకేసి వురుకుతున్న నేను ఆగిపోయి తప్పుకోబోయాను — లారీ మహా వేగంతో ఖణఖణమంటూ నన్ను దాటేసింది—కూల్చేసింది—కెవ్వుమని అర్చి క్రిందపడ్డాను.

నా కళ్ళముందు ఒక్క మెరుపు మెరిసి చీకటి కమ్మేసింది. నా చెవులు హోరుత్తిపోయాయి. నా నోరు పెద్దగా తెరుచుకుంది. కానీ కేక లేయలేకపోయాను.

అలాగే బోర్లా పడివుండిపోయాను....

జనం పరుగెత్తుకు వస్తున్నారు నాకేసి, హాహాకారాలు చేస్తూ. అసలేం జరిగిందో అంతుపట్టని అయోమయం,

అరుపులొకొచ్చి చూసుకుంటే నా కాళ్ళు రెండూ విరిగి వున్నాయి!! లారీ నా కాళ్ళమీంచి దాటేసింది.

అప్రయత్నంగా పెద్దగా యేడ్చేశాను.

నాకు కొంత దూరంలో పిచ్చివాడి దేహభాగాలు చెల్లాచెదురుగా పడివున్నాయి. రోడ్డవతల సూట్ కేసు కన్పిస్తోంది.

నాలో శక్తి విజృంభించింది. ఆవేశంగా దానికేసి ప్రాకుతూ వెళ్ళసాగాను. రోడ్డు దిగి మట్టిలో ప్రాకసాగాను వగరుస్తూ, శక్తి కూడదీసుకుంటూ. మరి కొంతలో.... దాన్నందుకుంటాననగా-దానికీ నాకూ మధ్య చిన్న గొయ్యి వుందని తెలీక అందులో పడిపోయాను.

మరోసారి గట్టిగా కేక పెట్టాను. కాళ్ళనుంచి బయలు దేరి సలుపు మెదడును తాకింది. జివ్వుమంది. కళ్ళు బైర్లు కమ్ముతున్నాయి. గొయ్యిలో కదిలే చోటు లేదు.

అరుపులు ఇంకా దగ్గరవుతున్నాయి. తల పైకెత్తి ఎటో చూస్తున్నాను. అనుపమ....అనుపమ....గొణుగుతు న్నాను. ఆమె కన్పించడంలేదు. అంతమంది జనంలో యెక్కడుంది? అప్పుడు నా చుట్టూ జనం కన్పిస్తున్నారు అవలీలగా, నీడలా యమదూతల్లా!

వాళ్ళంతా పెద్ద గొంతుకతో అరుస్తున్నారు, కేక లేస్తున్నారు. కళ్ళు బలవంతంగా తెరుస్తూ చుట్టూ చూశాను, అరింపుగా. మీరంతా ఏం చూస్తున్నారు? వినోదమా? విచిత్రమా? పెద్దగా నవ్వేశాను.

ఇది నాకు జరిగిన శాస్తి!

"ఈగొయ్యిపూడ్చెయ్యండి,మీకు పుణ్యమువుంటుంది."

—: ఐ పో యిం ది :—

# మానభంగ వివాహం!

వసుంధర

అతను గుమ్మం ముందు ఒక్క క్షణం ఆగి అప్పుడు తలుపు తట్టాడు.

కొద్ది క్షణాల్లో మెరుపుతీగలాంటి అమ్మాయివచ్చి తలుపుతీసి అతన్ని చూసి — "ఎవరుకావాలండీ మీకు?" అనడిగింది.

అతనామెవంక చూసి అప్రయత్నంగా నిట్టూర్చి— "నీ పేరు రాధ కాకుండా ఉంటే ఎంత బాగుండును?" అన్నాడు.

ఆమెకళ్ళలో ఆశ్చర్యం! "నా పేరురాధే!" అందామె.

"మీ నాన్నగారున్నారా?" అనడిగాడతను.

"ఈరోజు స్కూలుకు సెలవుకదా? ఉన్నారు. మీ రెవరో చెబుతారా?" అందామె.

"జయరాజ్ వచ్చాడని మీ నాన్నగారికి చెప్పు—"

ఆమె లోపలకువెళ్ళి వెంటనే తిరిగివచ్చి—"లోపలకు రండి!" అంది,

ఇద్దరూ ఓ గదిలోకి వెళ్ళారు. గదిలో రాధ తండ్రి పేర్రాజున్నాడు. ఆయన జయరాజ్ నిచూసి నిట్టూర్చి "కనీసం ముఖంచూస్తే నువ్వెవరో తెలుస్తుందనుకున్నాను. ఎంత ప్రయత్నించినా గుర్తుకురావడంలేదు—" అన్నాడు.

"అయితే మీకు శేషయ్యగారు రాసిన ఉత్తరం అంద లేదా?" అన్నాడు జయరాజ్.

"శేషయ్యా? ఆయనెవడు?" పేర్రాజు మరింత కంగారుపడ్డాడు.

ఈసారి జయరాజు కూడా కాస్త కలవరపడుతూ— "కాకినాడలో శేషయ్యగారినెరుగనివారు లేరు. ఆయనకో సినిమాథియేటరూ, కాఫీహోటలూ, ఫర్నిచర్ షాపూ ఉన్నాయి. ఆయన మీకుత్తరం రాశానంటేనే నేను మీ యింటికి వచ్చాను—" అన్నాడు.

"చూడుబాబూ—నాకు శేషయ్యగారితోటీ, కాకి నాడతోటి కూడా పరిచయంలేదు. అంతేకాదు—నాలుగు డబ్బులున్న వారెవ్వరితోటీ నాకు ముఖపరిచయం కూడా లేదు. నువ్వు పొరపడ్డావు—" అన్నాడు పేర్రాజు.

"ఇది పొరపాటైతేనే బాగుండేది!" అని గొణుక్కు న్నాడతను "అయితే నేనిప్పుడేంచేయాలి?" అని కాస్త గట్టిగా అన్నాడు.

"నీసమస్యేమిటో చెప్పు!" అన్నాడు పేర్రాజు.

"మీయింటికెళ్ళి శేషయ్యగారి పేరుచెబితే మీరేదో పెట్టె ఇస్తారనీ అది తీసుకుని రమ్మనమనీ శేషయ్యగారు నాకు చెప్పారు. మీరేమో అసలేమీ ఎరుగనంటు న్నారు—" అన్నాడు జయరాజు.

"చాలా బాగుందయ్యా! మిగతా సంగతులు తర్వాత చూసుకోవచ్చు. నీవాటంచూస్తే బాగా అలిసిపోయి

నట్టున్నావ్. ముందు కాస్త భోజనంచేసి వెదుదువు గాని—" అన్నాడు పేర్రాజు.

జయరాజు తడబడి "నాకా-మీయింట భోజనమా?" అన్నాడు.

పేర్రాజు నవ్వి "ఈ బడిపంతులు పేదవాడే అయినా అతిథి, అభ్యాగతులకు భోజనంపెట్టుకోగల స్థితినుంచి ఇంకా దిగజారిపోలేదు—" అన్నాడు.

పేర్రాజు భార్య పుట్టింటికివెళ్ళింది. ఇద్దరు కొడుకులు పట్నంలో చదువుకుంటున్నారు-కూతురు రాధ ఇంటర్మీడియెట్ ప్యాసయింది. ఇంట్లో ఆయనా, కూతురూ ఉన్నారు. జయరాజు ఒక్కడే భోంచేశాడు. ఆతడికి రాధ వడ్డించింది—ఎంతో అప్యాయంగా!

రాధ ఆడపిల్లేకావచ్చు. పల్లెటూళ్ళోనే పెరిగి ఉండవచ్చు. అంతమాత్రాన ఆమె మగవాళ్ళను చూసి ముడుచుకు పోనవసరంలేదు. ఆమెది అరమరికలులేని స్వభావం. ఆమెకు వగలు తెలియవు, నటనలు తెలియవు. సూటిగా మాట్లాడుతుంది. మంచిమనసుతో ఆదరిస్తుంది.

జయరాజు, రాధ ఆదరణకు కరిగిపోయి—"ఎలా, ఎలా, ఈమెను ఎలా?" అని తనలోతనే మథనపడ్డాడు.

జయరాజు భోజనం చేస్తుండగా ప్రెసిడెంటు భద్రయ్య యింటినుంచి ఓమనిషివచ్చి—"కాకినాడ శేషయ్యగారికివ్వడానికి ఓ పెట్టె ఇవ్వాలి. ఎవరైనా మనిషొస్తే వెళ్ళిపోనివ్వకుండా మీయింట్లో నాలుగురోజులుంచుకోండి" అని కబురుచెప్పి వెళ్ళాడు పేర్రాజుకు. అదివిన్న పేర్రాజు ఆశ్చర్యానికి అంతులేదు. వెంటనే ఆ కబురు భోంచేస్తున్న జయరాజుకు చెప్పాడు.

"అయితే నేను మీయింట నాలుగురోజులుండాలన్న

మాట—" అన్నాడు జయరాజు. ఆ మాటలన్నప్పుడు అతడి కంఠంలో పెద్దగా ఉత్సాహం ధ్వనించిలేదు. అమాయకమైన రాధ కనులవంక అప్పుడప్పుడు ఓరగా చూస్తూ భారంగా నిటూర్పుతున్నాడతను.

"అవును కానీ యిదంతా ఏమిటో నాకు అర్థంకావడం లేదు. ఓసారి భద్రయ్యగారింటికి వెళ్ళి అడిగొస్తాను—" అన్నాడు పేర్రాజు.

"ఇందులో భద్రయ్యగారికి తెలిసేదికూడా పెద్దగా ఏమీ ఉండదనుకుంటాను. మీరు శ్రమపడి ఆయనింటికి వెళ్ళడం అనవసరం—" అన్నాడు జయరాజు.

"అలాగని యెందుకనుకుంటున్నావు?" అన్నాడు పేర్రాజు.

"శేషయ్యగారు పెద్దవారు. పెద్దవాళ్ళ చేతులు, చేతలు పెద్దవిగానే వుంటాయి. నేనాయన ఉప్పు తింటున్నవాణ్ని. ఆయన పనిమీదే నేనిక్కడకు వచ్చాను. నాకే ఆయన భద్రయ్య పేరు చెప్పకుండా మీ పేరు చెప్పాడు. అంటే ఇదేదో రహస్యమైన వ్యవహారం. ఇటువంటివాటిల్లో మనబోంట్లు అంటీ ముట్టనట్టుగా ఉండటమే మంచిదని నా అనుభవం చెబుతోంది" అన్నాడు జయరాజు.

## 2

జయరాజు యింట్లో సరిగ్గా నాలుగురోజులున్నాడు. ఆ నాలుగు రోజుల్లోనూ అతను తన ప్రవర్తనతో పేర్రాజునూ రాధనూ కూడా ఆకట్టుకుని వారి అభిమానానికి పాత్రుడయ్యాడు. వారంటే అతడిక్కూడా ఏదో అనుబంధం ఏర్పడింది.

అయిదోరోజు ఉదయాన పేర్రాజు అత్తింటినుంచి

టెలిగ్రాం వచ్చింది—అర్జంటుగా రాధను పంపమని. టెలిగ్రాం వచ్చిన కాసేపటికే భద్రయ్య మనిషి వచ్చి పేర్రాజుకో పెట్టె యిచ్చి వెళ్ళాడు.

పేర్రాజుకు స్కూలు వదిలి వెళ్ళడానికి లేదు. తోడు లేకుండా ఒక్కర్తినీ ఆడపిల్లను పంపడం ఆయన కిష్టం లేదు. అదృష్టవశాత్తూ జయరాజు ప్రయాణం కూడా ఆ రోజే నిశ్చయమైందని ఆయన సంతోషించాడు.

ఆ గ్రామం నుంచి రాజమండ్రికి బస్సుంది. అక్కడ్నుంచి మరో బస్సు మారాలి. రాజమండ్రిలో రాధకు సాయపడమని పేర్రాజు జయరాజుని కోరాడు. అలాగే నన్నాడు జయరాజు.

ఇద్దర్నీ బస్సెక్కించి రాధను ఓ లక్షసార్లు హెచ్చరించి, జయరాజుకు పదే పదే చెప్పి వెళ్ళాడు పేర్రాజు- "నేనేం చిన్నపిల్లను కాను. భయమెందుకూ? నా అంతట నేనే దర్జాగా ప్రయాణాలు చేసి రాగలను. పైగా జయరాజుగారి తోడుండి—" అంది రాధ తండ్రికి ధైర్యం చెబుతూ.

పేర్రాజుకు ధైర్యం కలిగినా కలక్కపోయినా బస్సు కదిలింది.

రాధ ఆడవాళ్ళ సీట్లో కూర్చుంది. జయరాజు సరిగ్గా ఆమె వెనుక సీట్లోనే కూర్చున్నాడు.

వాళ్ళెక్కినది ఎక్స్‌ప్రెస్ బస్ కాదు. అయిదేసి నిముషాలకో ఊళ్ళో ఆగుతోంది. ప్రయాణం చాలా విసుగ్గా వుంది. జయరాజు బస్సు ఆగినపుడల్లా ఏదో ఒకటి కొంటూ తినమని ఆమెను బలవంతపెడుతున్నాడు.

"మా నాన్న మిమ్మల్ని రాజమండ్రిలో నాకు సాయపడమన్నారు గానీ ఇక్కడ్నించీ తిండిపెట్టి వేధించమన

లేదు" అంది రాధ.

"నీ యింట్లో నువ్వు నన్నిలాగే వేధించావు. అందుకు బదులు ఇది!" అన్నాడు జయరాజు.

ఒక ఊళ్ళో బటానీలు, ఇంకోచోట వేరుశనగలు మరోచోట జంతికలు, ఒకచోట కమలాఫలాలు ఇలా కొంటున్నాడు. రాజమండ్రి సమీపంలోకి వచ్చాక కూడా అతను బిస్కట్లు కొన్నాడు.

"ఇవి తినను" అంది రాధ.

"ఇన్ని తిని ఇవి తిననంటే నా మనస్సు నొచ్చుకుం టుంది" అన్నాడు జయరాజు.

"ఇటువంటి తిండి నాకు పడదు" అంది రాధ.

"ఈ ఒక్క రోజుకీ—నా కోసం—" అన్నాడు జయరాజు.

రాధ బిస్కట్లు తింది. రాజమండ్రి ఊళ్ళో బస్సు ప్రవేశించేసరికి ఆమె కడుపులో తిప్పినట్లయింది. "వాంతి అయేలా వుంది" అందామె పక్కావిడతో. ఆవిడ చటుక్కున కదిలి సీటుమారి రాధకు కిటికీ పక్క సీటు ఇచ్చింది. రాధ ప్రయత్నించింది కానీ వాంతి అవలేదు. కళ్ళు తిరుగుతున్నట్లనిపించి నిస్త్రాణగా వెనక్కు వాలి పడు కుంది.

బస్సు రాజమండ్రిలో ఆగింది.

ఒక్కొక్కరే దిగుతున్నారు గానీ రాధ లేవలేదు. జయరాజు కంగారుగా "రాధా!" అని పిలిచాడు.

ఆమె నీరసంగా "ఊఁ" అంది.

"ఏమిటయింది?" అన్నాడతను.

"తెలియడం లేదు. కళ్ళు తిరిగిపోతున్నాయి" అంది రాధ.

"స్టాండులో నీ బస్సు సిద్ధంగా వున్నట్లుంది. ఎక్కలేవా?" అన్నాడు జయరాజు.

"ఎక్కలేను" అంది రాధ.

జయరాజు తను ఊతమిచ్చి రాధను బస్సులోంచి దింపాడు. ఆమెకు నడవడం కూడా కష్టంగానే వుంది. "ఎక్కడయినా పడుకోవాలనుంది" అందామె బస్ స్టాండులో చతికిలబడుతూ. వాటం చూస్తే ఆమె అక్కడే పడుకునేలా వుంది.

జయరాజామె నక్కడే వదిలి బస్ స్టాండు చుట్టూ చూశాడు. నలుగురయిదుగురు రిక్షావాళ్ళతన్ని చుట్టుముట్టారు బేరం కోసం. జయరాజు వాళ్ళను విదిలించుకుంటూ "నాకు టాక్సి కావాలి!" అన్నాడు.

"రాజమండ్రీ బస్టాండుకొచ్చి టాక్సీ కోసం చూసిన వాళ్ళ నెక్కడా చూడలేదు" అన్నాడో రిక్షావాడు హేళనగా.

సరిగ్గా అప్పుడే అక్కడికో టాక్సీవచ్చి ఆగింది. అందులోంచి ఓ మనిషి హడావిడిగా దిగి కదులుతున్న ఓ బస్సుకేసి పరుగెత్తాడు. జయరాజు టాక్సీ డ్రయివర్ని సమీపించి "టాక్సీ కడతావా?" అన్నాడు.

"ఊఁ" అన్నాడు డ్రయివర్.

"హాస్పిటల్ కి వెళ్ళాలి."

"గవర్నమెంటా—ప్రయివేటా?"

"ప్రయివేటే-సీరియస్ కేసు" అన్నాడు జయరాజు.

"అయితే కాకినాడ శేషయ్య ఇంటికి పోనిచ్చేదా?" అన్నాడు టాక్సీడ్రయివర్.

"అదే నాక్కావలసింది" అన్నాడు జయరాజు.

రాధను నెమ్మదిగా తీసుకు వచ్చి వెనక సీట్లో పడుకో బెట్టారు. జయరాజు, డ్రైవర్ ముందుసీట్లో కూర్చు న్నారు. టాక్సీ బస్ స్టాండు వదిలి పెట్టింది.

# 3

స్కూల్లో వుండగా పేర్రాజుకి కబురొచ్చింది ఇంటి దగ్గర్నుంచి. అతడి భార్య వర్ధనమ్మ పుట్టింటినుంచి తిరిగి వచ్చింది. పేర్రాజు హెడ్మాస్టరుకి చెప్పి ఇంటికి వచ్చేశాడు.

"అమ్మాయి యింట్లో లేదేమండీ-పక్కింటివాళ్ళ నడి గితే నా దగ్గర కొచ్చిందంటారేమిటీ?" అన్నది వర్ధనమ్మ మొదటి ప్రశ్న. అది పిడుగులా తగిలింది పేర్రాజుకు.

"తెలిసే అడుగుతున్నావా, వేళాకోళ మాడుతు న్నావా?" అన్నాడు పేర్రాజు కంగారుగా.

వర్ధనమ్మ కూడా పేర్రాజు వేళాకోళమాడుతున్నా డనుకుంది టెలిగ్రాం కబురు విని. ఇద్దరూ కూడా వేళా కోళాలాడుకోవడం లేదని గ్రహించేక ఇద్దరికీ కాళ్ళూ చేతులూ ఆడలేదు.

జరిగింది చెప్పాడు పేర్రాజు.

వర్ధనమ్మ గుండెలు బాదుకుంది.

ఓ పావుగంట సేపు ఇద్దరూ అయోమయావస్థలో పడి పోయారు. ఏం చేయాలో ఇద్దరికీ పాలుపోలేదు.

ఇప్పుడు రాధ ఎక్కడుంది?

అప్పటికి టైము సాయంత్రం నాలుగయింది. భార్యా భర్త లిద్దరూ ఈ విషయమై ఏం చేయాలో తర్జన భర్జన చేశారు.

"ఆడపిల్లను ఒక్కదాన్నీ ముక్కు మొహం యెరగని వాడితో యెలా పంపించారండీ—ఇదంతా వాడు పన్నిన

మాయే అయుంటుంది. ఇప్పుడేం చేయాలి?" అంది వరదమ్మ.

"ఆ జయరాజు నమ్మించి గొంతు కోశాడు. ఆ పరిస్థితుల్లో యెవ్వరూ వాడ్ని మోసగాడనుకోరు. ఆర్టీసీ బస్సులో ప్రయాణం—ఎదిగిన ఆడపిల్ల-భయమేముంటుందిలే అనుకున్నాను" అన్నాడు పేర్రాజు.

"ఎదిగిన ఆడపిల్ల కాబట్టేనండీ భయపడాల్సింది" అంది వరదమ్మ.

"నిజమేననుకో — ప్రాజ్ఞురాలైన పిల్లని పదిమందీ చూస్తూండగా వాడు మాత్రం ఎలా యెత్తుకుపోగలడే?" అన్నాడు పేర్రాజు.

"దొంగ టెలిగ్రాం ఇప్పించిన వెధవ ఎంతకైనా తెగించగలడు. వాణ్ని మీరెలా నమ్మారండీ బాబూ—" అంది వరదమ్మ.

"ఎక్కడో మారుమూల పల్లెటూళ్ళో వున్న మన అమ్మాయి నెత్తుకుపోవడం కోసం పట్నంనుంచి పథకం వేసుకొని ఎవరో వస్తాడని నేను మాత్రం కలగన్నానా చెప్పు! ఇవన్నీ తర్వాత.... ఇప్పుడు తక్షణం కర్తవ్యం ఆలోచించాలి!" అన్నాడు పేర్రాజు.

సరిగ్గా అప్పుడే పోస్టుమాన్ వచ్చి పేర్రాజుకో కవరు యిచ్చి వెళ్ళాడు. దానిపైన "శ్రీ రాధ" అని రాసి వుంది. అది చూస్తూనే పేర్రాజు కళ్ళు మెరిశాయి. "అమ్మాయి దగ్గర్నుంచి—" అని భార్యకి చెప్పి కవరు చింపి ఉత్తరం బైటకుతీసి చదివాడు.

"పూజ్యనీయులైన నాన్నగారికి మీ కూతురు రాధ నమస్కరించి వ్రాయునది—

నేను జయరాజుతో లేచిపోయాను. నా గురించి

మీరు ఏ రిపోర్టులూ ఇవ్వొద్దు. మళ్ళీ నేను తిరం రాసేవరకూ మీరు నా గురించి ఆలోచించకండి. నేను వేసింది తప్పటడుగని మీరు భావిస్తూంటే నన్ను క్షమించండి.

మీ దీవెనలు కోరే

రాధ."

"ఎంతపని చేశావే తల్లీ!" అంటూ శోకాలు ప్రారంభించింది ధరణమ్మ.

"నువ్వాట్టే అరవకు. ఈ విషయం బైటకు పొక్కనివ్వకూడదు—" అన్నాడు పేర్రాజు.

"మరేం చేయాలి?"

"ముందా జయరాజు గురించి నేను వాకబు చేస్తాను-" అన్నాడు పేర్రాజు. ఆయన ప్రెసిడెంటు భద్రయ్య ఇంటికెళ్ళి కాకినాడ శేషయ్య గురించి అడిగాడు.

"కాకినాడ శేషయ్యా—వాడెవడు?" అన్నాడు భద్రయ్య.

"వాడెవడో తమరికి తెలుసు-" అన్నాడు పేర్రాజు.

"ఇదింకా బాగుందయ్యా పంతులూ!" అంటూ చిరాకు పడ్డాడు భద్రయ్య.

పేర్రాజప్పుడు జయరాజు గురించి చెప్పాడు. అదంతా విని—"ఎవడో నీకు టోకరా ఇచ్చాడు. వాడుండగానే నువ్వు నా దగ్గర కొస్తే నిజం బైట పడుండేది—" అన్నాడు.

అది నిజమేననిపించింది పేర్రాజుకు. జయరాజు కావాలనే ఈ నాటకం సృష్టించాడు. అది బయటపడుతుందనే తనను భద్రయ్య ఇంటికి వెళ్ళనివ్వలేదు.

ఎందుకైనా మంచిదని కూతురి విషయం మాత్రం

పేర్రాజు భద్రయ్యకు చెప్పలేదు. ఆయన ఇంటికి తిరుగు ముఖం పడుతూండగా దారిలో ఓ మనిషి ఎదురయ్యాడు. వాడు భద్రయ్య మనిషి. జయరాజుకిమ్మని పెట్టెఇచ్చింది వాడే! వాణ్ని చూడగానే పేర్రాజులో మళ్ళీ ఆశలు చిగురించాయి. ఆపి—పలకరించాడు.

వాడు పేర్రాజుకు దణ్నంపెట్టాడు.

"దణ్ణాలు తర్వాత—నువ్వేమో భద్రయ్యగారిచ్చాడని నాకో పెట్టి ఇచ్చావు. ఆ భద్రయ్య ఏమీ తెలియదంటున్నాడు. అసలు విషయం చెప్పు—" అన్నాడు పేర్రాజు.

వెంటనే చెప్పకపోయినా కాసేపు తటపటాయించి ఆఖరికి ఆ మనిషి అసలు విషయం చెప్పేశాడు. జయరాజు వాడికి వందరూపాయలిచ్చాడు. వాడు జయరాజు చెప్పినట్లు చేశాడు. ఇందులో భద్రయ్య ప్రమేయం ఏమీ లేదు.

"నీ మూలంగా నాకు చాలా నష్టం జరిగింది. వంద రూపాయలకు ఆశపడి ఊళ్లోవాళ్ళకి ద్రోహం చేస్తావా- భద్రయ్యగారి దగ్గరకు పద—నీ సంగతి తేలుస్తాను—" అన్నాడు పేర్రాజు.

ఆ మనిషి పేర్రాజును లెక్క చేయలేదు. తన కసలు ఏమీ తెలియదనీ అంతా పేర్రాజు కల్పించిన నాటకమనీ అనేసి వెళ్ళిపోయాడు.

వాడింక నిజం ఒప్పుకోడనీ తనే అనవసరంగా రొష్టు పడాలనీ అర్థమైంది పేర్రాజుకి. ఆయన నీరసంగా ఇల్లు చేరాడు. భార్య ఆయన తెచ్చే కబురుకోసం ఎంతో ఆత్రుతగా ఎదురుచూస్తోంది. తెచ్చిన కబురువిని నీరస పడిపోయి—"ఆ జయరాజెవడండీ — మనపిల్ల గురించి

వాడికలా తెలిసిందండీ_" అంటూ శోకాలు మొద లెట్టింది.

"దీనంతటికీ కాకినాడలో శేషయ్యనేవాడు కారణం. వాడిగురించి వివరాలు సంపాదిద్దాం. నాకేమో సెలవు ల్లేవు. అమ్మయేమో లేచిపోయానని ఉత్తరం రాసింది. ఇంక వెతకిమాత్రం ప్రయోజనమేముంది. మనూరివాళ్లెవ రైనా కాకినాడ వెడితే ఆ శేషయ్యెవడో తెలుసుకు రమ్మందాం—" అన్నాడు పేర్రాజు.

"అవతల వాడు అమ్మాయినేంచేస్తాడో ఏమో— దాన్ని చంపినా చంపేయగలడు. అభంశుభం తెలియని పిల్ల అది. దాని గురించి నాకు చాలా బెంగగా ఉందండీ—" అంది వర్ధనమ్మ దిగులుగా.

"నాకూ ఉంది దిగులు. కానీ కావాలని లేచిపోయిన పిల్లని మనమేం చేయగలం? ఎలా రక్షించగులం?అది అను భవించక తప్పదు—" అన్నాడు పేర్రాజు.

"అది కావాలని లేచిపోయిందంటారేంటండీ—వాడు మోసం చేసి తీసుకుపోయాడేమోనని నా అనుమానం. మనది నిప్పులాంటి వంశం—" అంది వర్ధనమ్మ.

"రాజమండ్రి బస్సు స్టాండులో దిగి ఇంకో బస్సు మారాలది. అందులో వాడు చేయగల మోసమేముంది? దానికీ ఇష్టమై కులుకుతూ వెళ్ళింది. అసలు నేను పట్టించుకోలేదుగానీ ప్రయాణమైనప్పట్నించీ కూడా ఉషారుగా వుందది—"

"అయితే మీరు దాని కోసం ఏమీ చేయరా?"

"లేచిపోయిన ఆడపిల్ల చచ్చిందానితో సమానం—" అన్నాడు పేర్రాజు కోపంగా.

అయినా పేర్రాజు తన ప్రయత్నాలు మానలేదు.

ఆయన అక్కణ్నించి కాకినాడ వెళ్ళొచ్చే వాళ్ళ ద్వారానూ, తనకు తెలిసిన ఒకరిద్దరు మాజీ విద్యార్థుల ద్వారానూ కాకినాడ శేషయ్య గురించి వాకబు చేయించాడు.

కాకినాడలో శేషయ్యలుంటే ఉండవచ్చు. కానీ ప్రముఖుల్లో ఎవరూ శేషయ్యల్లేరు.

"ఆ జయరాజు అన్నీ అబద్ధాలే చెప్పాడు—" అన్నాడు పేర్రాజు.

"వాడి ఆనవాళ్ళూ, పేరూ చెప్పి ఏ పోలీసుకైనా ప్రయివేటు డిటెక్టివ్‌కైనా యిస్తే?" అంది వర్ధనమ్మ.

"అయినా వాడి పేరు మాత్రం నిజమని నమ్మకమేమిటి? ఇన్ని అబద్ధాలు చెప్పినవాడు తన అసలు పేరు చెప్పి ఉంటాడనుకోవడం కూడా తెలివితక్కువే!" అన్నాడు పేర్రాజు.

"మీరన్నది నిజమే—ఆ మాటకొస్తే వాడిక్కడికి మారువేషంలో రాలేదన్న నమ్మకమేమిటి? ఆనవాళ్ళూ పనికిరావు—" అంది వర్ధనమ్మ.

"వర్ధనం మనకిన్ని తెలివితేటలిచ్చాడు దేవుడు. కానీ అమ్మాయిని రక్షించుకునేందుకు పనికిరావడంలేదు—" అన్నాడు పేర్రాజు దిగులుగా.

దంపతులిద్దరూ అలా రెండ్రోజులు దిగులుపడ్డారు. మూడోరోజు కూడా దిగులుపడవలసిందే — కానీ వాళ్ళింటికి ఓ కొత్త వ్యక్తి వచ్చాడు.

## 4

వచ్చిన వ్యక్తి యువకుడు. నిండా పాతికేళ్ళుండవు.

"ఎవరు కావాలి బాబూ నీకు?" అనడిగేడు పేర్రాజు.

"ఇది పేర్రాజు గారిల్లే కదా?" అడిగాడు యువకుడు.

పేర్రాజు ఆశ్చర్యంగా ఆ యువకుణ్ని చూశాడు. వచ్చినవాడు చూడ్డానికి ధనికుడిలాగున్నాడు. వెతుక్కుంటూ తనింటికెందుకొచ్చాడు—"ఇది నా యిల్లు. నా పేరు పేర్రాజు. ఈ ఊరి కమిటీ స్కూల్లో మేస్టర్ని!" అన్నాడాయన.

"మీ అమ్మాయి పేరు రాధ కదూ?" అన్నాడా యువకుడు.

"అవును. నీకెలా తెలుసు?" అన్నాడు పేర్రాజు రెట్టించిన ఆశ్చర్యంతో.

"ఎందుకు తెలియదు? నేనామెను ప్రేమించాను—" అన్నాడా యువకుడు.

ఒక్కక్షణం పేర్రాజుకు నోటమాటరాలేదు. ఎవరీ కుర్రాడు? తన దగ్గరకి వచ్చి తన కన్నకూతుర్ని ప్రేమించానని ధైర్యంగా చెబుతున్నాడు? ఎప్పుడూ ఈ ఊరు దాటి వెళ్ళని రాధని తనెప్పుడు చూశాడు? ఎలా ప్రేమించాడు?

"నువ్వనుకునే రాధ ఎవరో? పొరపాటున నువ్విక్కడికి వచ్చావనుకుంటాను. నా కూతురీ ఊరొదిలి ఎక్కడికీ వెళ్ళలేదు—" అన్న వాక్యం పూర్తిచేశాక పేర్రాజుకో పెద్ద అనుమానం వచ్చింది. ఇప్పుడు రాధ ఇంట్లో లేదు. ఇంట్లోనేకాదు—ఊళ్ళో కూడా లేదు. జయరాజుతో లేచిపోయింది. జయరాజుతో లేచిపోయిన రాధ ఈ యువకుడి కళ్ళబడిందా? తన వివరాలతడికి చెప్పిందా?

"నేనెప్పుడూ ఏ విషయంలోనూ పొరబడను. అందుకే ముందుగా మీ పేరుకూడా అడిగాను—" అన్నాడా

యువకుడు నమ్మకంగా.

"నీ పేరు!"

"శేషారావు!" అన్నాడా యువకుడు.

ఎక్కడో విన్నట్లనిపించి ఉలిక్కిపడ్డాడు పేర్రాజు. శేషరావుకాదు కానీ అలాంటిదే పేరు.... శేషయ్య.... కాకినాడ శేషయ్య... పేరు విన్నాడతను.

"అంటే నువ్వేనా కాకినాడ శేషయ్యవి!" అనడిగాడు పేర్రాజు.

"కాకినాడ శేషయ్య — వాడెవడు?" అన్నాడు ఆశ్చర్యంగా.

పేర్రాజు క్షణంపాటు తమాయించుకున్నాడు. తన బుర్ర సరిగ్గా పనిచేయడంలేదు. అనవసరంగా ప్రతివాడి దగ్గరా తన గుట్టు రట్టుచేసుకోవడమెందుకు? అసలీ కుర్రాడెవరో, తన కూతుర్నెప్పుడు—ఎలా ప్రేమించాడో—ఇప్పుడిక్కడికి ఎందుకొచ్చాడో తెలుసుకోవాలి.

"నిన్నెక్కడా చూసిన గుర్తులేదు. మా అమ్మాయి నన్నొదిలి ఏ ఊరూ వెళ్ళలేదు. నువ్వు దాన్ని ఎప్పుడు చూశావు—ఎక్కడ చూశావు—అన్నది నాకు తెలియడం లేదు—" అన్నాడు పేర్రాజు.

"అమలాపురంలో సుబ్బాయమ్మ పెళ్ళిలో చూశాను" అన్నాడు శేషారావు.

సుబ్బాయమ్మ పేర్రాజు దూరపు బంధువులమ్మాయి. ఆ పెళ్ళికి పేర్రాజు వెళ్ళలేదు. అతడికా సమయానికి ఎలక్షన్ డ్యూటీపడింది. వర్ధనమ్మ, పిల్లలు వెళ్ళారా పెళ్ళికి!

జవాబు విన్నాక పేర్రాజు మనసు తేలికపడింది. కూతుర్ని శేషారావు తప్పకు స్థలాల్లో చూడలేదు,

పెళ్ళిలో చూశాడు— "నువ్వు రాధతో మాట్లాడేవా?"

"లేదు. కానీ మాట్లాడాలని అనుకున్నాను. ఆమె నాకు ఒంటరిగా దొరకలేదు. ఆమె అందచందాలు నచ్చాయి. ఆమె గురించి వాకబు చేశాను. మీ అడ్రసు సంపాదించాను. ఇప్పుడు మీ అనుమతికోసం వచ్చాను-" అన్నాడు శేషారావు. అతడి కళ్ళు రాధకోసం వెతుకుతున్నాయి.

"సుబ్బాయమ్మ పెళ్ళై చాలాకాలమైంది—నువ్విప్పుడొచ్చావా?" అన్నాడు పేర్రాజు.

"రాధను చూడగానే మా యింట్లో చెప్పాను. దాంతో పెద్ద యుద్ధమైంది. ఇంట్లో ఒక్కరు కూడా నాకు అనుకూలురుగా లేరు. అయినా ధైర్యంగా అందర్నీ ఎదిరించాను. అది ముగియడానికింతకాలం పట్టింది—" అన్నాడు శేషారావు.

"పెళ్ళి గురించి అంత యుద్ధమెందుకు?"

"నా పెళ్ళికి నాన్నగారు యాభైవేల కట్నం ధర కట్టారు. అది పలికేమాటయితే కోతిపిల్లయినా ఫరవా లేదాయనకు. అందుకే యుద్ధం. రాధ బడిపంతుల పిల్లని ఆయన మండిపడ్డారు—"

పేర్రాజు ముఖం కాస్త మూడింది—"ఇంతకీ మీ నాన్నగారి పేరు?"

"కొండల్రావు!" అన్నాడు శేషారావు.

"ఏ కొండల్రావు?" అన్నాడు పేర్రాజులిక్కిపడి.

శేషారావు చెప్పాడు. పేర్రాజుకు నోటమాట రాక కొంతసేపు అవాక్కయి శేషారావు వంకనే చూస్తూ వుండిపోయాడు. కాసేపటికి అతికష్టంమీద గొంతు పెగిల్చి — "నువ్వు.... నువ్వు.... మీరు ...కొండల్రావుగారి

అబ్బాయా?" అన్నాడు.

కొండల్రావు పేర్రాజుకు బంధువే—కానీ అలా చెప్పుకుంటే అది పేర్రాజు సాహసమే అవుతుంది. ఆయన్ను కన్నెత్తి చూడడంగానీ, పల్లెత్తి పలకరించడం గానీ చేయలేదు పేర్రాజు. అంతస్థుల్లో వారికున్న భేదాలలాంటివి. కొండల్రావుకి బంగారు ఇనప్పెట్టెలు నాలుగున్నాయని చెప్పుకుంటూరు. అందులో నిజం ఎంతున్నా దాన్నిబట్టి ఆయన ఆస్తిని అంచనా వేయవచ్చు.

"మీరు పెద్దలు. నన్ను గౌరవించకూడదు. ఇందాకటిలాగే పిలవండి—" అన్నాడు శేషారావు.

పేర్రాజు శేషారావును మరిన్ని వివరాలడిగాడు.

రాధ కోసం ఇంటినీ, ఆస్తినీ, బంధువులనీ తెగ తెంచుకుని వచ్చేశాడు శేషారావు.

"ఇప్పుడేం చేస్తావ్?" అన్నాడు పేర్రాజు.

"మీ అనుమతి తీసుకుని రాధను పెళ్ళిచేసుకుంటాను" అన్నాడు శేషారావు.

ఏ ఆడపిల్ల తండ్రికైనా ఇది శుభవార్త! అయితే ఎటువంటి శుభవార్తకైనా శుభం ఆపాదించబడేది ఆ ఘడియనుబట్టే! పేర్రాజు కిప్పుడు శుభ ఘడియలులేవు. శేషారావు వచ్చినవి శుభ ఘడియలు కావు.

ఇప్పుడు తనేం చేయాలి? కూతురు జయరాజుతో లేచిపోయిందని శేషారావుకు చెప్పాలా? లేక ప్రస్తుతానికి ఊళ్ళోలేదని అబద్ధమాడాలా? రెండోదే చేశాడు పేర్రాజు.

"ఏ ఊరెళ్ళింది?"

అత్తారి ఊరి పేరు చెప్పాడు పేర్రాజు.

"అయితే అక్కడికి వెడతాను—" అన్నాడు

శేషారావు.

"ఎందుకని?"

"ఆమెకు నేనంటే ఇష్టముందో లేదో తెలుసుకోవాలని ఆత్రంగా వుంది నాకు" అన్నాడు శేషారావు.

"బాగానే వుంది. అది తెలుసుకోకుండానే ఇంత కాలం మీవాళ్ళతో యుద్ధం చేశావా?" అన్నాడు పేర్రాజు.

"నా ప్రతిపాదన మావాళ్ళు ఖండించగానే ఏం చేయాలో నాకు తెలియలేదు. ఆ బంధాలన్నీ తెంచుకు వచ్చాక ఇంతకాలం నాది ఏకపక్ష ప్రేమగా ఉండిపోయిందని స్ఫురించింది. కానీ నాకు నమ్మకముంది-ఆమె కాదనదని" అన్నాడు శేషారావు.

"అంత నమ్మకమున్నప్పుడు మళ్ళీ ఎక్కడికో వెళ్ళడమెందుకు?" అన్నాడు పేర్రాజు.

"పేర్రాజు మామయ్యగారూ-మీకు నమస్కరిస్తున్నాను. ఇప్పుడు నే నెక్కడికి వెడతాను? నాకింకెవరున్నారు?" అన్నాడు శేషారావు దీనంగా.

హఠాత్తుగా పేర్రాజుకి అనుమానం వచ్చింది. "అసలు నువ్వు కొండ్రావుగారబ్బాయి వన్న నమ్మక మేమిటి?"

"మీరు నమ్మి ప్రయోజన మేమిటి? నేనా యింటితో అన్ని బంధాలూ తెంచుకు వచ్చేశాను. నేనింక కొండ్రావుగారబ్బాయిని కాదు" అన్నాడు శేషారావు.

"చూస్తూ చూస్తూ నా కూతుర్ని బికారి చేతుల్లో పెట్టలేనుగదా" అన్నాడు పేర్రాజు.

"నేను బికారిని కాదు. రెండేళ్ళుగా వ్యాపారం చేస్తున్నాను. నా తండ్రికి సంబంధించిన లక్షల ఆస్తికి వారసత్వం పోగొట్టుకున్నా—నా దగ్గర రెండు లక్షల

దాశా ఉన్నాయి. దీనికి బుజువు మీ కెప్పుడు కావా లంటే అప్పుడు ఇవ్వగలను. నాతో రామచంద్రపురం రండి—" అన్నాడు శేషారావు.

పేర్రాజు నాలిక్కరుచుకున్నాడు. కుర్రాడి ధీమా చూస్తూంటే ఉన్నవాడిలాగే వున్నాడు. మిగతా విష యాలు తెలుసుకోవడం అంత కష్టమేం కాదు. ఉన్న ఇబ్బందల్లా అసలు రాధ నితడికి చూపేదులా? తన సమస్య నితడికి చెప్పకునేదెలా?

శేషారావు జాలిగా పేర్రాజు వంక చూసి "మీరు నన్ను నమ్మండి. నాతో రామచంద్రపురం రండి. నా స్థితిగతులు చూశాక నే మన మిద్దరం కలసి రాధ ఉన్న వూరు వెడదాం. మీతో వెడితేనే నాకు అన్ని మాటలూ సక్రమంగా అవుతాయి. నా ప్రేమకూ మీ ఆమోద ముందన్న విషయం రాధకు తెలియాలి. అదీకాక...."

అని ఆగాడు.

"అదీకాక....?" అన్నాడు పేర్రాజు.

"నేను ఇల్లొదిలే ముందు నాన్న నన్ను బెదిరించాడు. ఏ అమ్మాయి కోసం నువ్వు మమ్మల్నందర్నీ వదిలి వెడుతు న్నావో ఆ అమ్మాయి నీకు దక్కుతుందని అనుకోకు. మన జయరాజుండనే ఉన్నాడు-అన్నాడు—" అన్నాడు శేషారావు.

పేర్రాజులిక్కిపడి—"ఏమన్నావ్?" అన్నాడు.

శేషారావు మళ్ళీ అదే మాట చెప్పి—"అందుకే నేను కంగారుగా రాధ కేమయిందోనని వచ్చాను" అన్నాడు.

పేర్రాజు తల పట్టుకుని—"అయితే ఇంక నీ దగ్గర దాచి లాభం లేదు. అంతా ఇప్పుడర్థమవుతోంది. ఇదంతా కొండల్రావుగారి పన్నాగమన్న మాట. ఇప్పుడు నా

కూతురు జీవితం బుగ్గిపాలయింది. అసలు దానికి నూరేళ్లూ నిండాయేమోనని భయంగా కూడా వుంది" అన్నాడు. ఆయన కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

"ఏమయింది?" అన్నాడు శేషారావు కంగారుగా.

పేర్రాజు జరిగింది చెప్పి—"మింగలేక కక్కలేక ఏడుస్తున్నాం. మగపిల్లాడయితే బాధలేదు—ఏ పోలీసు రిపోర్టో యిచ్చేవాళ్ళం. ఆడపిల్ల కావడంతో వచ్చింది అవస్థ" అన్నాడు.

శేషారావు వుద్రేకంగా లేచి నిలబడి—"జయరాజు సంగతి నాకు తెలుసు. వాడి అంతు చూస్తాను. మీరేం భయపడకండి. ఒకటి రెండు రోజుల్లో మేమిద్దరం కలిసి వచ్చేస్తాం" అన్నాడు. ఆ తర్వాత అతనొక్క మాట కూడా వినిపించుకోకుండా పరుగెత్తాడు అక్కణ్నించి.

# 5

అతను గదిలో అడుగుపెట్టి తలుపు వేశాడు.

మంచం మీద పడుకున్న రాధ కంగారుగా లేచి నిలబడింది.

"బెదురు చూపుల రాధా—అందమంటే నీదే!" అన్నాడతను.

ఆమె నోరు విప్పలేదు. ఆమె చూపుల్లోని బెదురు పోలేదు.

అతను నెమ్మదిగా నడచివచ్చి మంచం మీద కూర్చుని "ఇదేంటో చూశావా?" అనడిగాడు.

ఆమె చూసింది. ఏదో ప్యాకెట్ అది! కానీ ఆమె మాట్లాడలేదు.

"ఇందులో నీకు చక్కగా అమిరే బట్టలున్నాయి. చీరకు మ్యాచింగ్ లంగా, బ్లౌజుకు మ్యాచింగ్ బ్రా...."

అన్నాడతను.

ఆమె మాట్లాడలేదు.

"నేను ప్రేమతో తీసుకువచ్చిన ఈ బట్టలు ధరించవా?" అన్నాడతను.

"ఆ ప్యాకెట్ అక్కడపెట్టి మీరు బయటకు వెళ్ళండి" అంది రాధ.

"నువ్వు బట్టలు నా ఎదురుగా మార్చుకుంటావనీ, ఆ దృశ్యం నేను చూడాలనీ సరదాపడేకదా—మొత్తం దుస్తులన్నీ కొత్తవి తెచ్చాను" అన్నాడను.

"నీ సరదా తీరదు" అంది రాధ.

"ఇదే మాట చాలా రోజుల్నించి చెబుతున్నావు" అన్నాడతను.

"ఎన్ని రోజులైనా, సంవత్సరాలైనా, యుగాలైనా ఇదేమాట చెబుతాను" అంది రాధ.

"సరే-అయితే నిన్నో ప్రశ్న వేస్తాను, సూటిగా జవాబివ్వు" అన్నాడతను.

ఆమె ఇస్తాననీ ఇవ్వననీ అనలేదు.

ఆ గదిలో చాలా రోజుల్నించి బందీగా వున్నదామె. రోజూ వేళకు భోజనం అందుతోంది. చదువుకుందుకు పుస్తకాలున్నాయి. ఒక్కటీ మంచిది కాదు. అన్నీ బూతు. సాహిత్యమేకాక వాటిల్లో బొమ్మలు కూడాను.

ఇంటిలో తలిదండ్రుల చాటున, నాలుగు గోడలమధ్య ఉంటే రాధ సరదాపడి ఆ పుస్తకాలు చదివి వుండేది. బొమ్మలు చూసి వుండేది. కానీ ఇక్కడ ఈ విపత్కర పరిస్థితిలో ఆమె తప్పించుకుపోవడం గురించి తప్ప వేరే ఆలోచించడం లేదు. మగ, ఆడకు-సంబంధించిన ఆలోచనలే ఆమెకు జుగుప్సాకరంగా వున్నాయి.

రోజూ అతను వస్తున్నాడు. అడిగి వేదుతున్నాడు. రక రకాల కబుర్లు చెబుతున్నాడు. అసభ్యంగా మాట్లాడు తున్నాడు. తనను తాకకుండానే అసభ్యంగా ప్రవర్తిస్తు న్నాడు. తను లొంగడం లేదు.

అదృష్ట మేమిటంటే ఇంతవరకూ అతడు తనను బల వంతం చేయలేదు. రాత్రిళ్ళు తనకేవిధమైన ఇబ్బందీ కలిగించలేదు. కానీ ఎన్నాళ్ళీ చెర! ఎంతకాల మిలా కొనసాగుతుంది?

తనిప్పు డెక్కడుంది? జయరాజు తనను టాక్సీలో ఎక్కించుకున్నాక మళ్ళీ ఆతన్ని చూడలేదు. ఇక్కడి కెలా వచ్చిందో, అత నేమయ్యాడో రాధకు తెలియలేదు.

"నీకు మానభంగమంటే తెలుసా?" అనడిగాడతను.

ఆమె మాట్లాడలేదు కానీ గుండె ఝల్లుమంది.

"తెలియకపోతే విను. ఆడదానికి ఇష్టం లేకపోయినా మగాడామెను బలవంతంగా అనుభవిస్తే ఆ అమ్మాయికి మానభంగం జరిగిందని అర్థం—ఉదాహరణకు నేను నిన్ను...."

"ఉదాహరణ వద్దు. అర్థమైంది" అంది రాధ.

"ఇప్పుడీ గదిలోంచి నువ్వు బయటకు వెళ్దామన్నా వెళ్ళలేవు. తెలుసా?" అన్నాడతను.

"తెలుసు."

"నీకంటె అన్నివిధాలా బలవంతుణ్ని. తెలుసా?"

"తెలుసు."

"ఈ పరిస్థితుల్లో నేను నిన్ను మానభంగం చేస్తే తప్పుకోవడం నీకు అసాధ్యమని తెలుసా?"

రాధ కళ్ళల్లో భయం కనబడింది. అతనిదంతా ఎందుకు చెబుతున్నాడోనని ఆమె కలవరపడసాగింది.

"మానభంగం తప్పనిసరి అయితే ఏం చేయాలో తెలుసా?"

రాధ మాట్లాడలేదు. ఆమె గుండె వేగంగా కొట్టుకుంటోంది.

"ఈ గదిలో పరుగులు పెట్టినా లాభం లేదు. ఒక్కసారి నా చేతితో నీ చేయి పట్టానా సువ్వింక తప్పించుకోలేవు. నీకు మానభంగం తప్పదు. అలాంటప్పుడు ఏం చేయాలంటే?"

ఆమె గుండె వేగం పెరిగింది. మనసులో ఆరాటం హెచ్చింది.

"మనసు తేలిక చేసుకుని హాయిగా అనుభవించడమే" అన్నాడతను పక పకా నవ్వుతూ.

ఆమెకు నవ్వు రావడం లేదు.

"మనసు తేలిక చేసుకో—సరిగ్గా అయిదు నిమిషాలు టైమిస్తున్నాను" అన్నాడతను.

అతను వాచీ వంక చూస్తున్నాడు. ఆమె అతని వంక చూస్తోంది.

## 6

పేర్రాజు స్కూల్ నించి ఇంటికి వచ్చి కాఫీ తాగి పడక కుర్చీలో కూర్చున్నాక—"అసలు మనం మళ్ళీ అమ్మాయినీ జన్మకు చూస్తామాండీ?" అంది వర్ధనమ్మ.

"నాకూ దిగులుగానే వుందే-ఆ శేషారావు నిన్న వచ్చి వెళ్ళాడు. అతను చెప్పిన కథ విన్నప్పటి నుంచీ నాకు మరీ బెంగగా వుంది. పెద్దవాళ్ళ వ్యవహారంలో అనుకోకుండా, మనకు తెలియకుండా తల దూర్చటం జరిగింది. ఇదంతా ఆ భగవంతుడి లీల. దాని కాయనే ఏదో దారి

చూపించాలి" అన్నాడు పేర్రాజు.

సరిగ్గా అదే సమయానికి ఎవరో వీధి గుమ్మంలో నిల బడి "లోపలకు రావచ్చా?" అనడిగారు.

"రండి" అన్నాడు పేర్రాజు కుర్చీలోంచి లేస్తూ.

వచ్చినాయన మనిషి మంచి రాజసంగా వున్నాడు. కానీ ముఖం మాత్రం అంత ప్రసన్నంగా లేదు "నీవేనా పేర్రాజు?" అన్నాడాయన.

"అవునండి—మీరెవరు?" అనడిగాడు పేర్రాజు.

"నా పేరు కొండల్రావు" అన్నాడాయన. నన్నే పేరడుగుతావా అన్న దర్పం ఆయన కళ్ళల్లో కనబడింది.

పేరు చెప్పగానే పేర్రాజాయన్ను గుర్తుపట్టగలిగాడు. సభల్లోనూ, పేపర్లలోనూ మాత్రమే కాక అప్పుడ ప్పుడు బంధువుల ఇండ్లలో శుభకార్యాలకు మారాన్నుంచి ఆయన్ను చూశాడు పేర్రాజు. ఎప్పుడూ పలకరించే ధైర్యం కలగలేదు. ఈరోజా అవకాశం వచ్చింది. తడబడిపోతూ "రండి-కూర్చోండి" అన్నాడు.

"మర్యాదలు తర్వాత. మీ అమ్మాయి రాధనోసారి పిలవండి" అన్నాడు కొండల్రావు.

"అది ఊళ్ళో లేదు" అన్నాడు పేర్రాజు.

"ఎక్కడికెళ్ళింది?"

"మీరు పంపిన జయరాజా మెను కిడ్నాప్ చేశాడు" అన్నాడు పేర్రాజు నిబ్బరంగా.

జయరాజు పేరు వింటూనే కొండల్రావులిక్కిపడి- "ఏమన్నారూ? జయరాజిక్కడికి వచ్చాడా—ఎప్పుడు?" అన్నాడు.

జయరాజు పేరు వింటూనే వీధిలోంచి ఓ యువకుడు లోపలకి వచ్చి "ఏమిటి నాన్నా—జయరాజిక్కడికి

వచ్చాడా? నువ్వుగానీ పంపావా నాన్నా!" అన్నాడు.

కొండల్రావు మాట్లాడలేదు.

పేర్రాజు కుర్రాడి వంకచూసి "నువ్వెవరు బాబూ!" అన్నారు.

"నా పేరు శేషారావు. కొండల్రావుగారబ్బాయిని. మీ అమ్మాయి రాధను ప్రేమించాను నేను. మీతో మాట్లాడటానికని మా నాన్నగారిని తీసుకొచ్చాను నేను" అన్నాడా యువకుడు.

"నువ్వు శేషారావా? మరి నిన్న వచ్చిందెవరు?" అన్నాడు పేర్రాజు కంగారుగా.

"నిన్నెవరొచ్చారిక్కడికి?"

"మీ అబ్బాయి శేషారావని చెప్పి ఓ కుర్రాడిక్కడికి వచ్చాడు. ఏమిటో అంతా అయోమయంగా వుంది నాకు" అన్నాడు పేర్రాజు.

అంతా అక్కడ చతికిలబడ్డారు. పేర్రాజు మొదట్నించీ జరిగిందంతా చెప్పాడు.

"అంతా అయోమయంగా వుంది" అన్నాడు కొండల్రావు.

"నాన్నా! మోసమంతా నీలోనే వుంది. నా రాధను నువ్వేదో చేశావు" అన్నాడు శేషారావు.

"రాధను కిడ్నాప్ చేయించాలని నేననుకున్నమాట నిజం. ఆ విషయం జయరాజుక్కూడా చెప్పాను. కానీ రెండ్రోజుల క్రితంవరకూ జయరాజు నా దగ్గరే వుంటూ అన్ని పనులూ చూస్తున్నాడు. నిన్న ఉదయమే అతను రాధను కిడ్నాప్ చేయటానికి బయల్దేరాడు—ఇందులో అణుమాత్రం అసత్యం లేదు" అన్నాడు కొండల్రావు.

శేషారావు తండ్రివంక అసహ్యంగా చూసి—"నువ్వు

నిజంగా మారేవనుకున్నాను. కానీ ఇంత నీచానికి పాల్పడ తావనుకోలేదు. అసలు నువ్వు రాధనెందుకు కిడ్నాప్ చేయించాలి? పురాణ కాలంలో రాక్షసులిలాంటి పనులు చేసేవారు. ఇప్పుడు నువ్వు వాళ్ళు లేని లోటు తీరుస్తున్నావు" అన్నాడు.

"నువ్వు నన్నెన్ని మాటలన్నా ఫరవాలేదు. నేనేం చేసినా నీ క్షేమం కోసమే!" అన్నాడు కొండల్రావు.

"బాబూ—తమరికెందరు బిడ్డలు? అందులో ఎందరికి శేషారావు అనే పేర్లున్నాయి?" అడిగాడు పేర్రాజు.

"మా ఇంటి మొత్తానికి వీడొక్కడే శేషారావు. నిన్న శేషారావునంటూ మీ దగ్గరకు వచ్చిన వాడు జయరాజు అయుంటాడు—" అన్నాడు కొండల్రావు.

"మరి అంతకుముందు జయరాజునంటూ వచ్చిందెవరు?" అడిగాడు పేర్రాజు.

"నాన్నా—ముందిక్కణ్నించి పద—రాధ ఏమయిందో తేల్చాలి. నువ్వు అవతల చేయాల్సిన ఏర్పాట్లన్నీ చేసి ఇక్కడ నా సరదా తీర్చడానికొచ్చినట్లు నాటకాలాడితే తీరదు. రాధ శవంగా మారినా సరే—ఆ శవాన్నే పెళ్ళిచేసుకుంటాను తప్పితే మీ మాట వినను. రాధ శవంగా మారేక ఆ శవాన్ని పెళ్ళిచేసుకుని నేనూ శవాన్నవుతాను. ఇదీ నా శపథం—"

కొండల్రావు కంగారుగా—"నా మాట వినరా—" అని ఏదో చెప్పబోయాడు. శేషారావు అక్కణ్నించి విసురుగా కదిలాడు.

## 7

"ఎవరూ?" అంటూ తలుపు తీశాడతను. తలుపు తెరుచుకోగానే తట్టిన వ్యక్తి విసురుగా లోపలకు వచ్చాడు.

"ఏమిటావిసురు—" అంటూ ఏదో అనబోయి ఆ వ్యక్తిని చూసి ఆగిపోయి—"నువ్వా జయరాజూ—" అన్నాడతను ఆశ్చర్యంగా.

"అవున్రా—నేనే—నాకంటే ముందుగా నువ్వే రాధను కిడ్నాప్ చేస్తే నాకు తెలీదనుకున్నావుట్రా రాస్కెల్—" అన్నాడు జయరాజు.

ఆ రాస్కెల్ ఒక్క క్షణం మాట్లాడకుండా జయరాజు వంకే ఆశ్చర్యంగా చూసి "నేను రాధను కిడ్నాప్ చేస్తానని ఎందుకనుకున్నావ్?" అన్నాడు.

"రాధ కిడ్నాప్ గురించి రెండువారాల క్రితం కొండ్రావు నాతో అన్నప్పుడు నా పక్కనున్నది నువ్వే—నాకంటే ముందే నా పేరుతో దాన్ని కిడ్నాప్ చేస్తే ఆ నేరం నామీదకు వచ్చేస్తుందని అనుకున్నావ్. అంతేగా! ఈ జయరాజు మనిషి ఎంత సున్నితంగా కనిపిస్తాడో—అంత దారుణంగా మనిషి ప్రాణాలు కూడా తీయగలడని మర్చిపోయావా?" అన్నాడు జయరాజు.

రాస్కెల్ ఏడ్పుముఖంపెట్టి—"డబ్బుకు కక్కుర్తి పడ్డాను గురూ!" అన్నాడు.

"ఎంత?"

"పదివేలు—"

"ఎవరిచ్చారు—?"

"కోదండరామయ్యా—"

"కోదండరామయ్యా?" అన్నాడు జయరాజు కంగారుగా—"అసలేం జరిగిందో చెప్పు—"

"ఆయనకు రసగుళికలాంటి పల్లెటూరి పిల్ల కావాలిట. తీసుకొస్తే పదివేలిస్తానన్నాడు. నేను వెంటనే రాధను

కిడ్నాప్ చేయించే ఏర్పాట్లుచేశాను. నన్ను మన్నించు-" అన్నాడు రాస్కెల్.

"జయరాజా పేరుతో అక్కడికి వెళ్ళిందెవరు?"

"రాజమండ్రివాడే — పేరు గురుమూర్తి. ఆ పిల్ల ఇంకా వాడి అధీనంలోనే ఉంది—"

"ఏం చేశారా పిల్లని?"

"బహుశా వ్యాపారంలో పెడతారనుకుంటాను. పిల్ల చాలా బాగుంటుంది. పదివేలూ రాబట్టుకుందుకు నెల్లాళ్ళు కూడా అక్కర్లేదు—"

"అయితే పాడుచేశారా?"

"నాకు తెలియదు. గురుమూర్తిని అడుగు...."

జయరాజు ఆవేశంగా అతడివంక చూసి—"రాధ కేమైనా అయిందో — నీ రక్తం నీచేత తాగిస్తాను. జాగ్రత్త!" అన్నాడు.

# 8

"అయిదు నిమిషాలూ అయిపోయాయి...." అన్నాడతను రాధవంక చూస్తూ.

రాధ అదురుతున్న గుండెలతో అతడివంక చూస్తోంది. ఆమె గుండెలు భయంతో అదురుతుంటే—ఆ అదురు అతడికి వినోదాన్నిస్తోంది. ఎగసిపడుతున్న ఆమె హృదయపుటారాటాన్నే చూస్తూ అతను మంచంమీంచి లేచి నిలబడి ఆమెను సమీపించాడు.

ఆమె వెనుకడుగువేస్తూ—"వద్దు!" అంది.

"నేను చెప్పింది మర్చిపోయావా?" అన్నాడతను.

"ఏమిటి?" అందామె.

"మానభంగం తప్పదు. మనసు తేలికచేసుకుని సుఖపడు—" అన్నాడతను.

ఆమెకు మనసు తేలిక కావడంలేదు. బరువెక్కుతోంది.

అతనామెను సమీపించాడు. చేయిపట్టుకున్నాడు.

అంతవరకూ రాధ భీతహరిణేక్షణ. బేల. అబల. అతడి చేయి ఆమెను తాకగానే ఆమె రాధకాదు. దుర్గ. భద్రకాళి.

ఇప్పుడామె చూపుల్లోంచి నిప్పులు కురుస్తున్నాయి. ఆమె వంట్లోకి వెయ్యేనుగుల బలం వచ్చింది.

రాధ అతడిచేయి విదుల్చుకుని ఒక్కతోపు తోసింది. ఊహించని ఆమె శక్తికీ, బలానికీ అతడు క్రిందపడ్డాడు. ఒక్క ఉదుటున ఆమె తలుపు దగ్గరకు పరుగెత్తి తలుపు తీసింది. కానీ తలుపు తెరుచుకోలేదు. అది అవతలపక్క గొళ్లెం వేయబడినట్లుంది. రాధ శక్తికొద్ది తలుపులు తట్టి లాగి నానా ప్రయత్నాలు చేసింది.

ఈలోగా అతను లేచి ఆమెను సమీపించి మళ్ళీ చేయిపట్టుకున్నాడు—"తలుపులు తెరుచుకోవు. నువ్విక్కణ్ణించి బైటకు పోలేవు. నీకు మానభంగం తప్పదు. మనసు తేలిక చేసుకుని సుఖపడు—"

రాధ అతడిచేయి వదుల్చుకోబోయింది. అతడిపట్టు ఈసారి ఇంకా బలంగావుంది. అతడు నవ్వుతూ ఆమె నడుముపై చేయివేసి దగ్గరగా లాక్కున్నాడు.

# 9

శేషారావు, కొండల్రావు—రాజమండ్రిలో జయరాజు సాధారణంగా మకాంచేసే చోటుకు వెళ్ళారు—"జయరాజిక్కడకు వచ్చాడా?" అనడిగాడు శేషారావు.

"వచ్చాడండి. ఇప్పుడింట్లోనే ఉన్నాడు—" అన్నాడతను.

జయరాజప్పుడు స్నానం చేస్తున్నాడు. అతనది పూర్తి చేసుకునివచ్చి తండ్రీ కొడుకులిద్దర్నీ చూసి ఆశ్చర్యపోయాడు.

"రాధ ఎక్కడ?" అనడిగాడు శేషారావు.

"అది తెలుసుకోడానికే నేనూ వచ్చాను. గురుమూర్తి దగ్గరికిప్పుడు వెళ్ళాలి—" అన్నాడు జయరాజు.

"నా పేరుతో నువ్వు పేరిరాజుగారింటికి వెళ్లావా?" అన్నాడు శేషారావు.

"వెళ్ళాను. కానీ రాధను అప్పటికే ఎవరో కిడ్నాప్ చేశారు—" అన్నాడు జయరాజు. తర్వాత జరిగింది కూడా అతను చెప్పాడు.

"అంతా విని నువ్వు తాపీగా ఇక్కడ స్నానం చేస్తున్నావా? త్వరపడాలన్న జ్ఞానం లేకపోయిందా?" అని ఆగి—"అవునులే—కాగల కార్యం గంధర్వులే తీరుస్తున్నారని ఆశపడుంటావ్. నా నిర్ణయం నేను మా నాన్నకు చెప్పాను. రాధ శవాన్నైనా పెళ్ళిచేసుకుంటానుగానీ ఆయన మాట వినను. రాధ శవంగా మారితే నేనూ అంతే—" అన్నాడు శేషారావు—

"జయరాజూ—మనమిప్పుడు రాధను రాక్షించాలి-" అన్నాడు కొండలావు.

"పదండి—పోదాం—" అన్నాడు జయరాజు. అంతా కలిసి గురుమూర్తి దగ్గరకు వెళ్ళారు.

ముందు గురుమూర్తి తనకేమీ తెలియదని దబాయించాడు. జయరాజు వాణ్ని చితకదన్ని—"అసలే టైమా ట్లేదు. అందువల్ల నిన్నింతటితో వదిలిపెడుతున్నాను. దెబ్బలు తినక త్వరగా చెప్పు—" అన్నాడు.

గురుమూర్తి వాళ్ళను ఓ యింటికి తీసుకువెళ్ళాడు.

వాళ్ళాయింట్లో ప్రవేశించగానే ఓ గదిలో పెద్ద గొడవ జరుగుతున్నట్లు గ్రహించారు. తలుపు గడియ బయట వేసివుంది. శేషారావు పరుగున వెళ్ళి గడియతీశాడు. తలుపు తెరుచుకుంది.

లోపల....

రాధ అర్ధనగ్నంగా గదిలో పరుగెడుతోంది. ఆమె జుట్టు చెదిరిపోయింది. రవిక చిరిగిపోయింది. ఆమెనో పురుషుడు తరుముతున్నాడు. అతడి వంటినిండా రక్కులున్నాయి. మనిషి క్రూరంగా ఉన్నాడు.

తెరుచుకున్న తలుపులు చూసి ఆ మనిషి ఆగిపోయాడు.

రాధ ఒక్క పరుగునవచ్చి అక్కడ కనబడ్డ కొండ్రావు కాళ్ళమీద పడిపోయి— "బాబూ—నన్ను రక్షించండి. చావుకంటే ఘోరమైన పరాభవం ఈ దుర్మార్గుడు నాకు తలపెట్టాడు—" అంది.

"లే—అమ్మా—నీకేం భయంలేదు—" అన్నాడు కొండ్రావు.

ఈలోగా జయరాజతన్ని పట్టుకుని—"ఏరా—వళ్ళు కొవ్వెక్కిందా—కొండ్రావుగారి కాబోయే కోడల్ని మానభంగం చేయడానికి సిద్ధపడతావ్రా-" అన్నాడు.

వాడు మాట్లాడలేదు. జయరాజు డొక్కలో ఒక్క పోటు పొడిచి—"నువ్వెవ్వరివో చెప్పు—" అన్నాడు. వాడు కోదండరామయ్య మనిషిననీ ఈ అమ్మాయిని వ్యభిచారంలోకి దింపడం ఆయన ఉద్దేశ్యమనీ చెప్పాడు. జయరాజు వాణ్ని మరో నాలుగు తన్నాడు.

ఈలోగా రాధ బట్టలు మార్చుకువచ్చింది. అంత విపత్కర పరిస్థితిలో కూడా ఆమె దేవకన్యలాగుంది.

అసలు జరిగిందంతా ఆమెకు తెలియడానికి కాసేపు పట్టింది.

కొండల్రావు కొడుకు శేషారావు ఏదో పెళ్ళిలో రాధను చూసి ప్రేమించాడు. కొండల్రావుకా పెళ్ళి ఇష్టంలేదు. రాధను కిడ్నాప్ చేయమని ఆయన జయరాజుకు చెప్పాడు. ఇది ఓ రాస్కెల్ విని జయరాజు పేరుతో పేర్రాజింట ప్రవేశించి రాధను కిడ్నాప్ చేసి కోదండరామయ్య మనుషులకి అప్పగించాడు. ఈ మోసాన్ని గ్రహించి కొండల్రావు, శేషారావు, జయరాజు సమయానికి వచ్చి ఆమెను రక్షించారు.

"కన్న కొడుక్కి అయినింటి సంబంధం చేయాలన్న తాపత్రయం తప్పితే మగువలకు మానభంగం చేయించాలనుకునే దుర్మార్గుణ్ని కాదు నేను —" అన్నాడు కొండల్రావు.

సరిగ్గా అప్పుడే కోదండరామయ్య మనిషి జేబులోంచి రివాల్వర్ తీశాడు. రెండో చేత్తో చటుక్కున రాధను తనవైపుకు లాక్కున్నాడు.

"ఇంతవరకూ నేననుకున్నవన్నీ సాధించాను. ఇదీ నేను సాధిస్తాను. నన్నడ్డుపెట్టారో మిమ్మల్నందర్నీ కాల్చి పారేస్తాను—" అంటూ చటుక్కున గదిలోకి దూరి మళ్ళీ తలుపులు వేసుకున్నాడు.

తలుపులు గడియవేసి అతను రాధవంక చూస్తూ— "మానభంగం తప్పనిసరి. మనసు తేలిక చేసుకుని సుఖపడు—" అన్నాడు.

రాధ బ్రాన్పడిపోయింది. అంతమంది మగవాళ్ళు తనకు రక్షణగా వున్నారని ఆమె ఆశపడింది. నిజంగా నే ఇప్పుడామెలో ప్రతిఘటించే శక్తిలేదు.

# 10

సరిగ్గా రెండుగంటల తర్వాత గది తలుపులు తెరుచుకున్నాయి.

తలుపు తీసింది రాధ!

ఆమె ఇప్పుడు వికసించిన పువ్వులా లేదు. వాడి రాలిన పువ్వులా ఉంది. కళ్ళలో జీవంలేదు.

గది బయట కొండల్రావు, శేషారావు, జయరాజు నిర్జీవంగా కూర్చున్నారు. తలుపులు తెరుచుకోగానే జయరాజు మాత్రంలేచి—"ఎక్కడ వాడు?" అన్నాడు.

"గదిలో ఉన్న బాత్రూం వెంటిలేటర్లోంచి దూకి పారిపోయాడు—" అంది రాధ. ఆమె శేషారావుని సమీపించి—"మీ ప్రేమ కథ ఇలా ముగుస్తోంది. నా శవాన్ని పెళ్ళిచేసుకోవాలని చాలా మనసు పడ్డావు. కాసేపటిలో నా శవం తయారవుతుంది—" అంది.

శేషారావేమీ మాట్లాడలేదు.

"ఇంతమంది మగాళ్ళముండి నిన్ను రక్షించలేక పోయాం—" అన్నాడు కొండల్రావు నిట్టూర్చుతూ.

"ఆడదాన్ని రక్షించలేని మగాళ్ళు మగాళ్ళెలా అవుతారు? మీరు మగాళ్ళు కాదు—" అంది రాధ.

"రాధా — అంతమాటనకు. నేను నిన్ను ప్రేమిస్తున్నాను. ఇప్పటికీ కూడా—" అన్నాడు శేషారావు.

"అదే నిజమైతే—ప్రియురాలినో దుర్మార్గుడు గది లోపలకు లాక్కెళ్ళి బలవంతం చేస్తూంటే చేతులు ముడుచుకుని బయట ఎలా కూర్చుంటావ్-నువ్వు మగాడివి కాదు—" అంది రాధ.

"మనిషి పరిస్థితులకు బానిస. ఆడదాన్ని రక్షించ లేనివాడు మగాడు కాదని నువ్వంటున్నావు. కానీ

ఆడదాన్ని అర్థం చేసుకుని ఆదరించగలవాడే మగాడని నేననుకుంటున్నాను. నీ గతచరిత్రతో నాకు నిమిత్తం లేదు. నిన్ను నేను పెళ్ళిచేసుకుంటాను—" అన్నాడు శేషారావు.

రాధ ఆశ్చర్యంగా చూసి—"నేను సర్వం కోల్పోయానని మీరనుకోవటం లేదా?" అంది.

"నువ్వు ఏం కోల్పోయావో నాకు తెలియదు. దానితో నాకు నిమిత్తం లేదు కూడా. నేను మాత్రం నిన్ను కోల్పోలేను."

"ఇంక మాట లెందుకు? ఇందులో నాదీ చాలావరకు బాధ్యత వుంది. నిన్ను మా యింటి కోడల్ని చేసుకుంటాను. ముందు అంతా కలిసి మీ యింటికి వెడదాం. మిగతావన్నీ తర్వాత మాట్లాడుకోవచ్చు. మనమిప్పుడు చేయవలసినదల్లా గతాన్ని మంచిపోవటమే!" అన్నాడు కొండల్రావు.

## 11

"వాడు కోదండరామయ్య మనిషిలా లేడూ?" అన్నాడు జయరాజు. అతను కారు డ్రైవ్ చేస్తున్నాడు.

శేషారావు, రాధ వెనక సీట్లో కూర్చుని వున్నారు. ఇద్దరూ పసుపు బట్టలతో వున్నారు. వారిద్దరికీ వేంరాజు ఇంట శాస్త్రోక్తంగా, సింపుల్ గా వివాహం జరిగింది. వివాహానికి కొండల్రావు, జయరాజు తప్ప ఇంకెవ్వరూ రాలేదు. వివాహమైన వెంటనే కొండల్రావు వేరే వెళ్ళిపోయాడు. జయరాజుని తోడుగా తీసుకుని శేషారావు, రాధ బయల్దేరారు.

రాధ అదృష్టానికి ఆ ఊరు పూరంతా ఆశ్చర్యపోయింది. కొండల్రావు ఆ గ్రామ పౌరుల్లో చాలా

మంది పెద్దలకు తెలిసినవాడే! ఆయన కొడుకు పెళ్ళి అంత సింపుల్ గా జరిగినందుకు అంతా ఆశ్చర్యపడ్డారు కూడా.

కారు రామచంద్రపురం వెడుతూండగా దార్లో జయరాజుకు కోదండరామయ్య మనిషి కనిపించాడు.

"కారాపు-" అన్నాడు శేషారావు.

"మీరు ఆగండి-పసుపు బట్టలతో వున్న మీరు ఆవేశ పడకూడదు. వాడి అంతు తేల్చటానికి నేనొక్కణ్నీ చాలు-" అన్నాడు జయరాజు.

కోదండరామయ్య మనిషి రోడ్డుకు పక్కగా కూర్చు న్నాడు. అతడి పక్కన ఓ బ్రీఫ్ కేసుంది. అతడు కారు గురించి పట్టించుకోనూలేదు. అటు చూడనూలేదు.

"నా రాధ కన్యాయం చేసినవాడి అంతు నేనే తేల్చాలి" అంటూ శేషారావు కారు దిగి పరుగెత్తాడు. అప్పటికి వాళ్ళిద్దరినీ చూసిన కోదండరామయ్య మనిషి అక్కడ్నుంచి పరుగెత్తాడు. వాళ్ళిద్దరూ అతణ్ని తరుము తున్నారు.

రాధ ఆశ్చర్యంగా ఆ పరిణామాన్ని చూస్తోంది. వాళ్ళు ముగ్గురూ కనుమరుగయ్యేసరికి కారుడోర్ హఠా త్తుగా తెరుచుకుంది. రాధ ఉలిక్కిపడి అటు చూసింది. మొట్టమొదట కాకినాడ శేషయ్య మనిషిగా తమ యింట అడుగు పెట్టిన నకిలీ జయరాజు అతను.

"దుర్మార్గుడా—మళ్ళీ వచ్చావా?" అంది రాధ కోపంగా.

"నీ కోసం ఎన్నిసార్లయినా వస్తాను—" అంటూ ఆమె పసుపు బట్టల్ని చూసి గతుక్కుమని—"అయితే శేషారావు నిన్ను పెళ్ళి చేసుకున్నాడా?" అన్నాడు నకిలీ

జయరాజు.

"నువ్వు చెప్పినవన్నీ అబద్ధాలు. చేసినవన్నీ మోసాలు. నన్ను మలినపరిచిన దుర్మార్గుడు వాడనుకుని వాళ్ళలా పరుగెత్తారు. కానీ నువ్వేనని తెలిస్తే ఈ క్షణం నా భర్త, అసలు జయరాజు నీ రక్తం తాగేస్తారు—" అంది రాధ ఆవేశంగా.

ఆ రోజు జరిగినదంతా రాధకు ఒక్కసారిగా గుర్తొచ్చింది.

*　　*　　*

అతనామెను గదిలోకి లాగి జంతుబలాన్నామెపై ప్రయోగించి చీరలాగేశాడు. ఆమె పెనుగులాటను లెక్క చేయక వివస్త్రను చేసి మంచం మీదకు నెట్టేశాడు. సరిగ్గా అప్పుడే అతను కిక్కురుమనకుండా నేల కూలిపోయాడు. రాధ లేవబోయింది. అప్పుడామెకు నకిలీ జయరాజు కనబడ్డాడు.

"వెధవ—ఈ సాయంత్రందాకా లేవలేడు...." అంటూ కాలితో మంచం కిందకు నెట్టేసి "వీడి కప్పగించడానికే నేను నిన్నిక్కడికి తీసుకొచ్చింది?" అన్నాడు.

"ఎలా వచ్చావిక్కడికి?" అంది రాధ. తను వివస్త్రగా వున్నానని కూడా మరిచిందామె.

"నీ కోసం ఎలాగైనా వస్తాను. ఇప్పుడు నా కెదురు లేదు—" అన్నాడు జయరాజు.

"అంటే?" అంటూ ఆమె అక్కడే పడివున్న చీరనందుకోబోయింది.

ఆమెను నకిలీ జయరాజు వారించి—"నీకు మానభంగం ఎలాగూ తప్పదు. మనసు తేలిక చేసుకుని సుఖపడు-" అన్నాడు చిన్నగా నవ్వుతూ.

"నువ్వా అదేమాటా?" అందామె.

జయరాజామె పక్కన చేరాడు. ఆమెలో ఇప్పుడు ప్రతిఘటించే శక్తి బొత్తిగా లేదు.

"నీకు తెలుసో, తెలియదో—ఇదంతా ఓ పెద్ద నాటకం. నిన్నిక్కడ కిడ్నాప్ చేసి మానభంగం జరిపించడానికి ఏర్పాటు చేసినది కొండల్రావు, శేషారావులు" అన్నాడు నకిలీ జయరాజు.

రాధ నమ్మలేదు. కానీ ఆమె అతడి కౌగిలిలో వుంది. అతడు చెప్పేది వింటోంది. చేసేదానికి ప్రతిఘటించలేక పోతోంది. శారీరకంగా, మానసికంగా ఆమె అలసి పోయింది. నకిలీ జయరాజు చెప్పుకుపోతున్నాడు.

"ఈ నాటకమంతా ఎందుకో నాకు తెలియదు. నువ్వు వప్పుకుంటే నేను మాత్రం నిన్ను తప్పక పెళ్ళి చేసుకుంటాను. వీళ్ళంతా నిన్ను మోసం చేస్తున్నారు. కావాలని ఈ ఏర్పాట్లన్నీ చేసి తమకేమీ తెలీనట్లు నటిస్తున్నారు. నిన్ను కిడ్నాప్ చేసే పని నాకు శేషారావే అప్పగించాడు. వాళ్ళంటున్న కోదండరామయ్య మనిషి నిజంగా కోదండరామయ్య మనిషికాడు. దూరపు వరుసలో శేషారావుకి అన్న అవుతాడు. అతడిచేత నీకు మానభంగం చేయించడంలో వాళ్ళ ఉద్దేశ్యమేమిటో నాకు తెలియదు. నేనూ వాళ్ళ మనిషినే. కానీ నీ ముఖంలో కనబడే అమాయకత్వానికి నేను లొంగి పోయాను. నువ్వంటే నాకు ప్రేమ పుట్టుకొచ్చింది. అయినా అసహాయుణ్ని. కొండల్రావు నెదిరించడమంటే పాముతో చెలగాటం. అందుకని నిస్సహాయుడినై నిన్నిక్కడ యీ మనిషికి అప్పగించాను. రోజూ వచ్చి ఆ మనిషి నిన్ను బెదిరిస్తున్నా నిన్నీ రోజు వరకూ చెరచ

డని నాకు తెలుసు. నీకు మానభంగం జరిగిన విషయానికి వాళ్ళు సాక్షులు కావాలన్నది వారి పథకం. ఆ పథకం ప్రకారం ఇంతవరకూ జరిగింది. ఈ క్షణంలోనే నేను తెగించాను. ఎలాగూ నీకు మానభంగం తప్పదు. ఆ అవకాశం నేను తీసుకొంటేనేం? నిన్నా శేషారావు పెళ్ళి చేసుకోడు. ఏదో చేస్తాడు. అయితే నేను నిన్ను వెయ్యి కళ్ళతో కనిపెట్టి వుంటాను. కాపాడుకుని నాదాన్ని చేసుకుంటాను. అందుకే ఈ అవకాశం మరో మనిషి కివ్వదలుచుకోలేదు. నువ్వు కూడా ఈ విషయం ఎవరికీ చెప్పకు. నిజం నిలకడమీద నీకే తెలుస్తుంది. ఎప్పటికైనా నేనున్నానని గుర్తుంచుకో. ఇప్పుడు నాకు కొండ్రావు భయం లేదు. నా రహస్యం ఎవ్వరికీ తెలియదు. ఈ మనిషి కూడా అది వాళ్ళకు చెప్పకోలేడు. అదతనికి పరువు తక్కువ. అందుకే ప్రమాదరహితమైన ఈ క్షణాన్నెన్నుకున్నాను" అన్నాడు నకిలీ జయరాజు.

ఆతడు చెప్పేవాటిలో ఎంత నిజముందో అని ఆమె ఆలోచించడం లేదు. అంతా అయోమయంగా వున్నదామెకు. అన్నాళ్ళ ప్రతిఘటన ఏమయిందో కానీ ఆ క్షణంలో అతడికి సులభంగా లొంగిపోయింది.

* * *

"నువ్వు చెప్పిందంతా అబద్ధం. నన్ను శేషారావు పెళ్ళి చేసుకున్నాడు. అతడి విశాల హృదయం బైట పడింది. నువ్వు శేషారావు గురించి ఏవేవో కథలు చెప్పి కుని నన్ను నీ వశం చేసుకుని తర్వాత ఏ వ్యభిచార గృహాలకో అమ్మేద్దామనుకున్నావు. నీ ఆటలు సాగ లేదు-ప్రపంచమంతా నీలాంటి వాళ్ళే వుంటారనుకోకు" అంది రాధ.

"ఎక్కడో ఏదో తిరకాసుంది. నాకు అర్థం కావటం లేదు. నువ్వేదయినా ప్రమాదంలో ఇరుక్కున్నావేమో నని నా అనుమానం. నీ కెప్పుడే కష్టం కలిగినా రాజమండ్రిలో సునీతా హోటల్ మేనేజర్ని కలుసుకుని భుజంగం కావాలని చెప్పు. అతడు మనం కలుసుకునే ఏర్పాటు చేస్తాడు. ఇంతకు మించి నే నేమీ చెప్పలేను. నేను గొప్పవాళ్ళకు నేరాలుచేసే మేనేజర్ని కావచ్చు. కానీ నాకూ హృదయముంది. అది నిన్ను కోరుతోంది. ఈ విషయం గుర్తుంచుకుంటే చాలు" అంటూ అతనక్కడ్నించి వెళ్ళిపోయాడు.

కాసేపటికి శేషారావును భుజం మీద వేసుకుని జయరాజు వచ్చాడు. రాధ కంగారుగా "ఏమయింది?" అని అడిగింది.

"వాణ్ని ప్రక్కనే వున్న ఏట్లోకి తోసేశాను. వాడికి ఈదే ఓపిక కూడా వున్నట్లు లేదు. బహుశా శవమై తేల్తాడు. మీ ఆయనకి మాత్రం చాలా గట్టిగా దెబ్బలు తగిలాయి. నా రాధతో అమానుషంగా ప్రవర్తిస్తావుట్రా అంటూ వాడిమీద పడి ఒళ్లెరక్కుండా యుద్ధం చేశాడు. ఇప్పుడు అర్జంటుగా ఏదో నర్సింగ్ హోమ్‌కి పరుగెత్తాలి" అన్నాడు జయరాజు.

## 12

"నేనెక్కడున్నాను?" అన్నాడు శేషారావు కళ్ళు తెరిచి.

"ఏమండీ—" అంది రాధ. సంతోషంతో ఆమెకు నోట మాట రాలేదు.

"రాధా—నా రాధా—ఎలా వున్నావు రాధా?"

అన్నాడు శేషారావు ఆత్రంగా.

"నాకేమండీ-నిక్షేపంలా వున్నాను. మీ కెలాగుంది?" అంది రాధ.

"నువ్వు కళ్ళకెదురుగా కనబడుతూంటే నాకే బాధా తెలియటంలేదు రాధా—నువ్విక్కడే ఇలాగే కూర్చుని వుండిపో రాధా! నాకిప్పుడెంతో హాయిగావుంది రాధా" అన్నాడు శేషారావు.

"ఆయన్నాట్టే మాట్లాడించకండి. విశ్రాంతి అవసరం" అంది నర్సు.

మాట్లాడుతూనే మగతలోకి వెళ్ళిపోయాడు శేషారావు. అతడి వంక చూస్తూ బాధగా నిట్టూర్చింది రాధ. అతడిపై ప్రేమ పొంగి పొరలిపోగా అప్రయత్నంగా అతడి నుదుటిపై ముద్దు పెట్టుకుంది—అక్కడ నర్సు వున్న విషయం కూడా గమనించక.

"మిమ్మల్ని డాక్టర్ పిలుస్తున్నారు" అంది ఓ నర్సు లోపలకు వచ్చి.

రాధ లేచింది. డాక్టర్ గదికి వెళ్ళింది.

"ఆయన కెలా వుంది డాక్టర్?" అంది రాధ.

"ప్రమాదం గడిచినట్లే—అయితే అతను కోలుకోవటం నీలో వుందమ్మా!" అన్నాడు డాక్టర్.

"నాలోనా? నేనేం చేయగలను డాక్టర్?" అంది రాధ.

"నీకు కొత్తగా పెళ్ళయిందని నీ పసుపు బట్టల్ని చూస్తేనే తెలుస్తోంది. అలాంటప్పుడు ఇలాంటి వార్త చెప్పటం ఏ డాక్టరుకయినా బాధగానే వుంటుంది. అయినా చెప్పక తప్పదు. నువ్వు నీ ప్రవర్తనతో అతడికి జీవితంపై ఉత్సాహం కలిగించాలి. ఎట్టి పరిస్థితుల్లోనూ

వైరాగ్యం కలగనివ్వకూడదు. అప్పుడే అతను త్వరగా కోలుకోగలుగుతాడు" అన్నాడు డాక్టర్.

"దానికేముంది డాక్టర్. అది భార్యగా నా విద్యుక్త ధర్మం" అంది రాధ.

"భార్యగా నీ విద్యుక్త ధర్మం నిర్వర్తించవలదనే నే చెప్పేది!" అన్నాడు డాక్టర్.

"అంటే?"

"నువ్వు నీ భర్తని ఆవేశపర్చగూడదు. ఉద్రేకం కలిగించకూడదు. స్త్రీ పురుషుల కలయిక గురించిన ప్రసక్తి అతడివద్ద రానివ్వగూడదు—"

రాధ సిగ్గుతో ముడుచుకుపోయింది.

"డాక్టర దగ్గర సిగ్గుపడగూడదు. నీకు అన్నలాంటి వాణ్ని. గుండె రాయి చేసుకుని నా మాటలు విను. నీ భర్త బహుశా ఇక ముందు సంసారజీవితానికి పనికిరాడు. అతడికి తగిలిన దెబ్బలలాంటివి. అది నీ దురదృష్టం. కానీ ఆ విషయం నీకు తెలిసినట్లు అతనికి తెలియకూడదు. అతనే ఒకవేళ నిన్ను ప్రోత్సహించినా నీ అనాసక్తతను ప్రదర్శించు. సృష్టి కార్యంపట్ల నీకుగల జుగుప్సాభావాన్ని అతనికి తెలియజేయి. అతను సంతోషిస్తాడు. నీ అనాసక్తకు కారణాల గురించి అతను మరీ మరీ నొక్కించి అడిగితే — మానభంగం జరిగిందనీ, అప్పట్నించీ ఈ జుగుప్స ప్రారంభమైందనీ అబద్ధమాడేయ్. అతనికి జీవితంపై విరక్తి కలగనివ్వకు. హాయిగా బ్రతకనివ్వు" అన్నాడు డాక్టర్.

రాధ డాక్టర్ మాటలకు బ్రాన్నపడిపోయింది. కాసేపటికి తమాయించుకుంది.

"అంతా అర్థమైంది డాక్టర్!" అంది రాధ.

ఆమెకు అర్థమైన దేమిటో డాక్టర్‌కు తెలియదు.

# 13

రిక్షాలో కూర్చుని రాధ ఆలోచిస్తోంది.

శేషారావు తన్ను దారుణంగా మోసగించాడు.

అతడు తన పేదరికాన్ని ఆసరాగా చేసుకున్నాడు. తండ్రితో పోరాటాన్నీ, ఓ ప్రేమ కథనూ సృష్టించి అందులో తను ఆదర్శప్రేమికుడుగా నటించాడు. తన బంధువుచేత తనకు మానభంగం చేయించి ఫలితంగా ఏ బిడ్డయినా పుట్టినా ఆ బిడ్డకు తను తండ్రినవుదామను కున్నాడు. మానభంగం జరిగినాక కూడా తను పెళ్ళి చేసుకుంటానని విశాలహృదయాన్ని నటించాడు. నిజానికది విశాలహృదయం కాదు. ఇరుకు గృహము. తన స్వార్థం కోసం ఓ అమాయకురాలి జీవితాన్ని బలిపెట్టే పథకాలు విశాల హృదయాల్లో వుండవు. తనకొక భార్య కావాలి. ఆమె తన అసమర్థతను నిందించగూడదు. తన పరువు బజారుపాలు చేయగూడదు.

అందుకోసం ఎన్నో కథలల్లాడు. ఎన్నో పాత్రలతో ఒక నాటకం ఆడించాడు. తన్ను పెళ్ళి చేసుకున్నాడు.

నకిలీ జయరాజుగా నటించిన భుజంగం తనపట్ల జాలి పూని ఈ కథ చెప్పకపోతే తను తప్పకుండా జీవితాంతం శేషారావు కాళ్ళ దగ్గరే పడివుండేది.

భుజంగం తనకు మానభంగం చేసి మహోపకారం చేశాడు. అదే కొండ్రావు మనిషివల్ల జరిగి వుంటే ఈ జన్మలో తను ఈ ట్రాప్‌నుంచి బయిటపడగల్గి వుండేది కాదు.

శేషారావు తన మెడలో తాళి కట్టి వుండవచ్చు.

కానీ భుజంగానికీ తనకూ అంతకుముందే వివాహమై పోయింది. అది రాక్షసమో, గాంధర్వమో—శాస్త్రకారులేదో పేరు పెట్టుకోవచ్చు. అదే నిజమైన వివాహం. ఈ మాత్రం తను అర్థం చేసుకోలేక శేషారావుచేత మెడలో తాళి కట్టించుకుంది. అయితే వచ్చేటప్పుడు మంచిపని చేసింది. తాళితీసి అతడి తలగడ క్రింద పెట్టింది.

"ఇదేనమ్మా సునీతా హోటల్!" అన్నాడు రిక్షా వాడు.

రాధ రిక్షా దిగి డబ్బులిచ్చి హోటల్ మేనేజర్ దగ్గరికి వెళ్ళి భుజంగం కావాలని అడగబోయి ఆగిపోయింది.

అతడే భుజంగం!

"నువ్వు వస్తావని నాకు తెలుసు. వచ్చేది నాకోసమనీ తెలుసు. నువ్వు చెప్పబోయే కథ మాత్రం నాకు తెలియదు. అదొక్కటే చెప్పు!" అన్నాడతను.

అతడి కళ్ళల్లో ఆమెపట్ల ప్రేమ కురుస్తోంది.

వివాహాలు రాక్షసమనీ, గాంధర్వమనీ వున్నాయికానీ అవి వధువు ఇష్టంమీదనే జరిగేవి. అందువల్ల శాస్త్రకారులు వీరి వివాహానికి బహుశా మానభంగ వివాహమని పేరు పెట్టాలేమో! ఎందుకంటే భుజంగమామెకు మానభంగం కావించడంవల్లనే వారి వివాహం జరిగింది. అప్పట్లో ఆమోదించకపోయినా ఇప్పుడది తనకు మహోపకారంగా రాధ భావించనూ భావిస్తోంది.

—:ఐపోయింది:—

# బ్లాక్ మెయిల్

## వాణిశ్రీ

సుధారాణి డ్రైవ్ చేస్తున్న ప్రీమియర్ పద్మిని కారు రోడ్డుమీద విమానంలా దూసుకుపోతోంది.

టైమ్ ఆరున్నర దాటినా ఇంకా చీకటి పడలేదు. ఎండాకాలం పగటిపొద్దు ఎక్కువ.

కొండలచాటున పశ్చిమాకాశం సంధ్యకాంతులతో మెరిసిపోతోంది సుధారాణిలాగే.

ఆమె ప్రతిరోజూ ఫ్యాక్టరీనుంచి తిరిగివచ్చే వేళ ఇంచుమించుగా అదే.

రోజూ ఒకేలా గడవదు. రోజులన్నీ మనవి కాదన్నట్లు ఆ రోజు ఆమె జీవితంలో ముఖ్యమైన మలుపు తీసుకు రానున్నట్లు ఆమెకు తెలియదు.

అమితమైన వేగంతో కారు నడిపిస్తున్న సుధారాణికి రోడ్డుమీద అడ్డంగా ఏదో పెట్టినట్లు కనిపించి స్లో చేసింది. తీరా చూస్తే అవి పచ్చిగడ్డిమోపులు.

'రోడ్డుకు అడ్డంగా పడేశారే ఎవరో!' అని విసు

క్కుంటూ కారు ఆపింది, హారన్ నొక్కుతూ.

అంతలో ఎవరో ఒక వ్యక్తి అవతలి డోర్ తీసుకుని ఫ్రంట్ సీటులోకి వచ్చేసి తళతళ మెరుస్తున్న కత్తి చూపిస్తూ ఆమెను డ్రైవింగ్ సీటులోనుంచి ప్రక్కకు లాగి పడేశాడు.

కారు సర్రున వెనక్కి తిప్పేశాడు. ఆమె భయ విహ్వలురాలై నోటమాటరాక బొమ్మలా వుండిపోయింది. నెత్తిన టోపీ, పెద్ద పెద్ద మీసాలు, పొడుగాటి గడ్డం ఎవరో ఆ భయంకర వ్యక్తి ఎడమచేత్తో కత్తిపట్టుకుని కుడిచేత్తో స్టీరింగ్ పట్టుకుని కారు నడిపిస్తున్నాడు.

"ఎవరు నువ్వు?" అని గట్టిగా అరిచింది సుధారాణి.

అతను సమాధానం చెప్పకుండా "ష్...." అన్నాడు కళ్ళెర్రజేస్తూ.

కారు కొండల మధ్యకు వెళ్ళిపోయింది. రోడ్డు దిగి, కాసేపటికి ఒక పొదలోకి దూసుకెళ్ళింది కారు. అతను డోరు తీసి "దిగు" అన్నాడు.

"ఎవరు నువ్వు? నన్నెందుకు తీసుకొచ్చావ్ చెప్పు?" అంది ఆమె కోపం తెచ్చుకుంటూ.

అతను పకపక నవ్వి, ఆమె భుజంమీద చెయ్యివేసి, "ఎందుకో చెప్తాలే. ముందు దిగు" అన్నాడు.

"దిగను" అంది సుధారాణి బింకంగా. అతని చేతిని విసిరికొట్టింది.

"అనవసరంగా నాకు కోపం తెప్పించకు. మర్యాదగా చెప్పినట్లు విను. లేకపోతే ఈ కత్తి నీ ప్రాణాలు తీస్తుంది" అన్నాడు కరకు కంఠంతో.

"ప్రాణంపోయినా ఫరవాలేదు. మనిషన్న తర్వాత ఎప్పుడైనా చచ్చేదే" అంది ఆమె నిబ్బరం ప్రదర్శిస్తూ.

"చావడానికి తొందరపడకు. ఇంకా పెళ్ళయినా కాలేదు. అప్పుడే వేదాంతం చెప్తున్నావు" అని అతను నవ్వి "ఈ దేశంలో వాళ్ళకి పుట్టగానే వంట బట్టేది వేదాంతమే. నీ మెట్ట వేదాంతం చాలించి దిగు" అన్నాడు.

"నేను దిగను."

"సుధారాణీ! మొండితనానికి పోయి ప్రాణానికి ముప్పు తెచ్చుకోకు."

"నాకు ప్రాణమంటే లెక్కలేదు" అంది ఆమె.

"నీకు లేకపోయినా నీ ప్రాణానికి చాలా విలువ వుంది. నా చేతికి డబ్బు వచ్చేదాకా నీ ప్రాణాలు సురక్షితంగా వుండడం నాకు అవసరం" అన్నాడు.

"నీ చేతికి డబ్బు ఎలా వస్తుంది?"

"నా చేతిలో నీ ప్రాణం వున్నందుకు."

"యూ! రాస్కెల్....నన్ను బ్లాక్ మెయిల్ చెయ్యాలనుకుంటున్నావా?" గట్టిగా అరిచింది సుధారాణి.

"నిన్ను కాదు మీ అమ్మను....అదంతా తర్వాత నీకే అర్థమౌతుందిలే....దిగు....దిగు...." అని ఆమెను బలవంతంగా పట్టుకుని కారు దించాడు అతను.

ఆమె గింజుకుంటూ క్రిందకు దిగి పారిపోవడానికి పరిగెత్తింది. అతను ఆమెను ఒడిసిపట్టుకుని "నా చేతుల్లో చిక్కాక పారిపోవడం అంత సులభం కాదు" అన్నాడు.

"ఇప్పుడు నన్నెక్కడికి తీసుకెళ్తావ్?" బాధగా అంది ఆమె అతని చేతుల్లోంచి తప్పించుకోడానికి గింజుకుంటూ.

"భయపడకు. నీమీద మోజుపడి నిన్ను తీసుకెళ్ళడం

లేదు. నాకు కావలసింది డబ్బు. నిన్ను అడ్డం పెట్టుకుని మీ అమ్మ దగ్గర్నుంచి లాగుతాను డబ్బు. డబ్బుంటే పదహారేళ్ళ పడుచు నవ్వుతూ పక్కలోకి వస్తుంది. నీకు పాతికేళ్ళు దాటిపోయాయి. వృద్ధ కన్యవు. నువ్వెవడికి కావాలి. పెళ్ళయితే నలుగుర్ని కని ముసలమ్మవైపోయే దానివి" అతను నవ్వాడు గట్టిగా.

"నీ పిచ్చివాగుడు కట్టిపెట్టు" కోపంతో బుసలు కొట్టింది సుధారాణి.

"నీ కోపం కట్టిపెట్టు ముందు. ఇది నీ స్వంత ఫ్యాక్టరీ కాదని గుర్తుంచుకో. ఎగిరిపడితే క్రిందపడతావు" అంటూ ఆమెను బలవంతంగా కొండపైకి ఎక్కించాడు అతను.

ఆ కొండపైన పాడుబడిన గుడి ఒకటి వుంది. దానికి తలుపులూ లేవు, లోపల దేవుడూ లేడు. విశాలమైన మండపం కట్టివుంది. పూర్వం ఎప్పుడో పూజా పునస్కారాలు జరిగి వుండొచ్చు.

అతను సుధారాణి పెడరెక్కలు విరిచికట్టి ఒక స్తంభానికి ఆనించి త్రాడుతో బంధించాడు. ఆమె అతన్ని నానా దుర్భాషలూ ఆడుతోంది.

"నువ్వు గనుక నోర్మూసుకోకపోతే నీ నోట్లో గుడ్డలు కుక్కుతాను" అని గద్దించాడు అతను.

సుధారాణి నీరసంగా కళ్ళు మూసుకుని బాధగా మూలిగింది. ఆమెకు ఏడుపు ముంచుకొచ్చింది. వీడెవడు? డబ్బుకోసం తననే ఎందుకు చెరబట్టాడు? వీడేదైనా తనపై అత్యాచారం జరపడుగదా!

ఆమెకు భయంతో గుండెలు వేగంగా కొట్టుకుంటున్నాయి.

# 2

టెలిఫోన్ గణగణ మ్రోగింది.

సావిత్రి రిసీవరెత్తి "హల్లో...." అంది.

"సావిత్రిగారేనా?"

"అవును."

"నమస్కారం సావిత్రిగారూ!"

"నమస్కారం. ఎవరు మీరు?"

"బైరాగి."

"బైరాగా?"

"అవునండీ నేను బైరాగినే."

"ఎవరు మీరు? మీ పేరు ఎప్పుడూ వినలేదు. గుర్తుపట్టలేక పోతున్నాను" అంది సావిత్రి.

"వివరాలు తర్వాత మాట్లాడుకుందాంగాని, ముందు మీరు నాకొక సహాయం చెయ్యాలి."

"చెప్పండి."

"నాకు అర్జంటుగా ఏభై వేలు కావాలి."

"ఏయ్!....ఎవరు నువ్వు?...."

"నేనేనండీ బైరాగిని."

"బైరాగివో సన్యాసివో....నీకేదైనా పిచ్చిగాని పట్టలేదు గదా! వూరికే ఏభైవేలు ఎవరిస్తారు? ఫోన్ చేసి మరీ అడుగుతున్నావే!"

"వూరికే ఇవ్వనవసరం లేదండీ. మీరు ఏభైవేలు ఇస్తే మీ ముద్దుల పెద్దల కూతుర్ని మీకు తిరిగి ఇచ్చేస్తాను.... లేదా! ఆమె ప్రాణాలు తీసుకుంటాను."

సావిత్రి గుండె ఆగిపోయినట్లయింది.

"మా సుధనా! ఎక్కడుంది ఇప్పుడు?" ఆతృతగా ప్రశ్నించింది.

"నా దగ్గరే వుంది. ఆమెను ఎత్తుకొచ్చాను."

"బైరాగీ!...."

"యస్, మేడమ్."

"ఇప్పుడు టైమ్ ఎనిమిదయింది. ఇంత రాత్రిపూట అంత డబ్బు ఎక్కడ తెమ్మంటావ్?"

ఫోన్‌లో నవ్వు వినిపించింది.

"ఎందుకయ్యా! నవ్వుతావు?"

"నాకు ఆ మాత్రం తెలియదా సావిత్రిగారూ! ఇప్పుడు బ్యాంకులు మూసివుంటాయి కాబట్టి డబ్బులేదు అంటారు. అవునా!"

"ఆఁ.... అవును."

"నాకు డబ్బే కావాలని పట్టుదలలేదు. ఆ మాత్రం బంగారం ఇచ్చినా చాలు. అన్నట్లు మీకు చాలా బంగారం వుంది కదా! వడ్డాణం.... కాసుల పేరు వగైరా పాత నగలు పాతరేసి వుంటారు. బైటికి తియ్యండి."

సావిత్రికి గొంతులో తడి ఆరిపోయింది.

"ఏమిటి? బంగారం ఇస్తారా, లేక మీ అమ్మాయిని కత్తితో పొడిచి చంపమంటారా?"

"వద్దు.... వద్దు.... తెస్తాను."

"ఎక్కడికి తెస్తారు?"

"చెప్పు.... ఎక్కడికి తేవాలి?"

"మీ ఫ్యాక్టరీకి వెళ్లే దారిలో లయోలా లేడీస్ కాలేజి వుంది."

"అవును."

"దానికి కొంతదూరంలో లేడీస్ కాలేజీ తాలూకు హాస్టల్ వుంది. దానికి వందగజాల దూరంలో చర్చివుంది. ఆ చర్చి ప్రక్కన పెద్ద మర్రిచెట్టు వుంది. మీరు డబ్బు

గాని బంగారంగాని ఒక సూట్ కేసులో పెట్టుకుని తీసుకుని రండి. ఆ సూట్ కేస్ నాకు అందిన తర్వాత మీ అమ్మాయి మీకు దక్కుతుంది. లేదా చస్తుంది."

"వద్దు....వద్దు....వస్తాను" అరిచింది సావిత్రి.

"తొందరగా రావాలి."

"అలాగే!"

"గుర్తుంచుకోండి. ఈ సంగతి పోలీసులకుగాని మరెవరికైనాగాని చెప్పారంటే మీ ప్రాణాలు గూడా దక్కవు. మీరు ఎవరికి ఫోన్ చేసిందీ అన్నీ మావాళ్ళు గమనిస్తుంటారు."

"లేను....లేదు....ఎవరికీ చెప్పను" అంది సావిత్రి చెమటపట్టిన ముఖాన్ని తుడుచుకుంటూ.

"చెప్పినట్లు నడుచుకోండి."

"అలాగే!"

"మీ కోసం ఎదురుచూస్తుంటాను మేడమ్."

ఫోన్ పెట్టేసినట్లు రిసీవర్‌లో క్లిక్‌మని శబ్దం వినిపించింది.

సావిత్రి సోఫాలో కూలబడిపోయింది.

'ఏభై వేలు' 'అమ్మో' అనుకుంది. చూస్తూ చూస్తూ ఏభై వేలు....వాడి మొఖాన ఎలా కొట్టడం? మరిప్పుడు ఏం చెయ్యాలి? పోలీసులకి ఫోన్ చేస్తే?

లాభంలేదు వాడు అవన్నీ గమనిస్తుంటాడు.

"అమ్మా! నాకు పాతికరూపాయలు కావాలే" అంటూ బాబ్జీ లోపలకు వచ్చాడు.

బాబ్జీ లోపలకు రాగానే సావిత్రి మనసులో ఒక ఆలోచన మెరిసింది.

"ఒరేయ్ బాబ్జీ. ఇలారా నాన్నా! నువ్వు అర్జెంట్ గా

ఒక పని చెయ్యాలి. ఎవరికీ ఏమీ చెప్పకూడదు" అంది ఆమె.

పదిహేనేళ్ళ బాబ్జీ నివ్వెరపోయి తల్లివంక చూశాడు.

"ఏం చెయ్యాలి?"

బాబ్జీ తల వూపాడు.

సావిత్రి ఆదరాబాదరా పోలీస్ ఇన్స్పెక్టర్ కి జరిగినదంతా, బైరాగి చెప్పిన వివరాలన్నీ ఒక కాగితంలో రాసింది. వెంటనే సహాయం చేసి తన కూతుర్ని రక్షించమని అందులో వేడుకుంది.

ఆ కాగితాన్ని ఒక కవరులో పెట్టి పేస్టుచేసి బాబ్జీ ప్యాంట్ జేబులో పెట్టింది.

"జాగ్రత్త. ఇన్స్పెక్టర్ కే ఇవ్వు." అంది.

బాబ్జీ తలూపుతూ పరిగెత్తుకుంటూ వెళ్ళాడు.

## 3

సుధారాణికి బ్రతికుండగానే నరకం అనుభవిస్తున్నట్లుంది.

ఆ దుర్మార్గుడు రెండుచేతులూ వెనక్కివిరిచి తాడుతో గట్టిగా కట్టేశాడు. చేతులు నొప్పిపుడుతున్నాయి. పైగా నిలువుకాళ్ళ మీద అలా ఎంతసేపు నిల్చోవాలో తెలియడంలేదు. ఆమెకు నీరసం ముంచుకొస్తోంది.

ఆ గడ్డంవాడు లాంతరు వెలిగించుకుని ఆ వెలుగులో రొట్టెలు తింటున్నాడు. అప్పటిదాకా వాడు బ్రాందీ తాగుతూ కూర్చున్నాడు. తాగడం పూర్తయ్యాక సీసా విసిరిపారేసి ఇప్పుడేమో తింటూ కూర్చున్నాడు.

తింటూ తింటూ ఆమెవంక చూశాడు. నవ్వాడు పకపకా.

"ఆకలివేస్తోందా?" అన్నాడు.

ఆమె తల వూపింది అవునన్నట్టుగా.

బ్రెడ్ ముక్కలు కాగితంలో పెట్టుకొచ్చి "తిను" అన్నాడు.

ఆమె అలాగే చూస్తూ వుండిపోయింది.

"ఓ.... చేతులు లేవుగదూ! తినిపించనా?" అంటూ ఒక ముక్క ఆమె నోటిలో వుంచబోయాడు.

ఆమె కాండ్రించి వూసి "వద్దు.... నేను తినను" అని గట్టిగా అరిచింది.

"భలే! ఆకలైందని ఏడుస్తున్నావ్! తినపించబోతే వద్దంటావు. బాగుంది" అన్నాడు అతను.

"ఒక్క చెయ్యి విడిపించు. తింటాను" అంది ఆమె.

అతను ఏదోఆలోచించుకొని ఒక చేతిని విడిపించి బ్రెడ్ ముక్కలు ఆమె చేతికి ఇచ్చాడు. ఆమె ఒక్కొక్కటే తినేసింది.

అతను మారంగా చూస్తున్నాడు.

"ఇంకెంత సేపులే. ఈ పాటికి మీ అమ్మ వస్తూ వుంటుంది. మా వాడికి సూట్ కేసు అందిస్తుంది. వాడు నీ కారులోనే వస్తూనే నాకు లైటుతో సంజ్ఞ చేస్తాడు. ఇక నీకు నాకూ రామ్.... రామ్!" అన్నాడు.

"ఏమిటీ మా అమ్మ మీకు డబ్బు ఇస్తానందా?"

"ఆఁ.... ఇవ్వక ఏం చేస్తుంది? ఇవ్వకపోతే నిన్ను చంపుతామని బెదిరించాం గదా!"

సుధారాణికి ఏడుపు ముంచుకొచ్చింది.

"నన్ను వదిలెయ్ నీకు పుణ్యం వుంటుంది" అంది బ్రతిమాలుతూ.

"తొందరపడకు వదుల్తా!" అన్నాడు అతను సుధారాణి వంక చూస్తూ.

అప్పుడామె పైట జారిపోయి వుంది. గులాబి రంగు పాలిస్టర్ చీరలో, లాంతరు మసక వెలుగులో ఆమె అందం అమావాస్యనాడు చుక్కలా మెరిసిపోతోంది.

అతను కాంక్ష నిండిన కళ్ళతో మత్తుగా చూశాడు. అతనిలో మగాడు నిద్ర లేచాడు. మందు త్రాగకముందు మాత్రం ఆమె మీద ఏ విధమైన అత్యాచారం చెయ్యకూడదనే అనుకున్నాడు. డబ్బు మాత్రమే గుంజుకుని మర్యాదగానే వదిలేద్దాం అనుకున్నాడు. కాని కడుపులోకి మందు పోయాక అవన్నీ గాలికి కొట్టుకుని పోయాయి.

ఆమె నిస్సహాయ స్థితి అతనికి వింటరిగా మత్తులో వున్నప్పుడు ఆడది దొరకటం మనస్సుని చలింపజేస్తున్నాయి.

అతను దగ్గరగా వచ్చి ఆమె బుగ్గల మీద చెయ్యివేసి "పాపం, సుకుమారి. చెయ్యి నొప్పి పుడుతోందా?" అన్నాడు.

ఆమె అతని చేతిని విదిల్చి కొడుతూ "నేను నీకేం ద్రోహం చేశాను? నన్నెందుకిలా ఏడిపిస్తున్నావ్?" అంది ఏడుస్తూనే.

ఆ మాటలకి అతనికి కోపం బుస్సుమని పొంగింది.

"నాకు ద్రోహం చేశావో లేదో సరిగ్గా చూడు" అంటూ గడ్డం మీసం పీకి పారేశాడు.

ఆమె ఆశ్చర్యంతో అతని వంక చూసి "నువ్వా జార్జ్?" అంది.

"అవును నేనే! ఇప్పుడు చెప్పు! చెప్పుడు మాటలు విని నిర్దాక్షిణ్యంగా నన్ను వుద్యోగంలో నుంచి తీసి వెయ్యలేదూ?" అన్నాడు కసిగా.

"జార్జి! నన్ను మోసం చేసి లారీలో సామాను అమ్ముకోలేదా? టాంకులో డీసెల్ దొంగచాటుగా అమ్ముకుని త్రాగి తందనాలు ఆడలేదూ! ఆడదిలే అని నన్ను చిన్నచూపు చూస్తే సహించలేకపోయాము. నేను మాత్రం ఎంతకని సహించను? అందుకే వార్నింగులు యిచ్చి యిచ్చి విసుగు పుట్టి తీసేశాను."

"అయితే మీ ఫ్యాక్టరీలో నేనొక్కడినే నా దొంగను? మరి ఆ మేనేజరు సీతారామయ్య సంగతి ఏమిటి?పందికొక్కులా తింటూ వుంటే నీకు బాగుందా?"

"అదంతా నీ పొరబాటు."

"ఇష్టమైతే అంతేలే!"

"పిచ్చిగా మాట్లాడకు."

"అవును నేను పిచ్చివాడినే. అప్పుడు నీ చేతిలో మనిషినిగదా అని తీసిపారేసి ఏడిపించావు. ఇప్పుడు నువ్వు నా చేతిలో వున్నావు. కాలం తిరగబడింది" పక పక నవ్వాడు జార్జి.

అతని నవ్వు చూస్తే ఆమెకు వణుకు పుట్టింది.

అతను ఆమె తలను తన చేతుల్లోకి తీసుకుని ఆమెను ముద్దు పెట్టుకున్నాడు.

సుధారాణి ఏడుస్తూ అతని ముఖం మీద వుమ్మి వూసింది. తిట్టింది.

అతను ఆ తిట్లన్నీ దీవనలుగా భావించి నవ్వుతూ తన రెండు చేతుల్లో ఆమెను బంధించాడు.

ఆమె కవ్వున కేకపెట్టి అతన్ని దూరంగా నెట్టడానికి ప్రయత్నించింది. అతను కదల్లేదు. అతను తూలుతూనే ఆమెను గట్టిగా పట్టుకుంటున్నాడు. ఆమె బ్లౌజు చిరిగి ముక్కలైంది. ఆ మెకు ఎక్కడలేని ఆవేశం వచ్చింది.

అతన్ని దూరంగా పడేటట్లు నెట్టిపారేసింది. జార్జి వెల్లకిలా పడ్డాడు. ఆమె ఒక చేత్తోనే గబ గబా కట్లు విప్పేసుకుంది. జార్జి నిషాలో తూలుతూ లేస్తున్నాడు.

ఆమెను కట్టేసి వుంచినపుడు ఆమె దృష్టిని ఆకర్షించింది ఒక రాతి గద. అది ఇప్పుడు ఆమెకు వుపయోగించింది. ఒక్క పరుగున దాన్ని అందుకుని జార్జి తలమీద బలంగా కొట్టింది.

జార్జి చావుకేక పెట్టి, లేవబోతున్నవాడల్లా విరిగిన మహావృక్షంలా కూలిపోయాడు. క్షణాల్లో అతని ప్రాణాలు అనంతవాయువుల్లో కలిసిపోయాయి.

సుధారాణి లాంతరు పట్టుకుని దారి చూసుకుంటూ కొండ క్రిందకు దిగసాగింది.

జార్జి కారు ఆపిన చోట కారు లేదు. ఆమెకు జార్జి చెప్పిన మాటలు గుర్తుకొచ్చాయి. జార్జి అనుచరుడు తన కారు తీసుకుని వెళ్ళిపోయాడు. అమ్మ ఇస్తానన్న డబ్బు కోసం వాడు వెళ్ళి వుంటాడు.

సుధారాణి లాంతరు పట్టుకుని వీలయినంత వేగంగా రోడ్డు మీదకు చేరుకుంది. ఆమె రోడ్డుమీదకు చేరుకున్నాక పోలీస్ జీవ్ వచ్చి ఆగింది.

అందులో నుంచి ఇన్‌స్పెక్టర్ దిగాడు.

"సుధారాణిగారూ! ఏం జరిగింది?" అన్నాడు ఇన్‌స్పెక్టర్ దివాకర్.

సుధారాణి జరిగిందంతా వివరంగా చెప్పింది.

"మై గాడ్! అయితే మీరు జార్జిని మర్డర్ చేశారన్న మాట!" అన్నాడు దివాకర్.

"అవును ఇన్‌స్పెక్టర్, నా శీలం కాపాడుకోవడానికి హత్య చెయ్యక తప్పలేదు" అంది సుధారాణి.

"ఇట్స్ ఆల్ రైట్. మిమ్మల్ని అరెస్టు చేస్తున్నాను" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"నన్ను అరెస్టు చేస్తారా? ఎందుకు?"

"ఎందుకేమిటి! మీరు జార్జిని హత్య చేసినందుకు."

"ఛీ....అది ఏ పరిసితుల్లో చేశానో చెప్పానుగదా!"

"అది నిజమే. మా ఫార్మాలిటిస్ మాకున్నాయి. అయితే మీరు బెయిల్ మీద విడుదల కావచ్చును" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"నా కారు జార్జి మనిషి ఎత్తుకుపోయాడు!" అంది సుధారాణి.

"ఎక్కడికి పోతాడు? మీ కారు ఎక్కడికీ పోదు లెండి."

"మీరు ఇక్కడికి ఎలా వచ్చారు?"

"మీ అమ్మగారు రిపోర్టు చేశారు మిమ్మల్ని ఎవడో బైరాగి కిడ్నాప్ చేశాడనీ, ఏభై వేలు ఇమ్మని బ్లాక్ మెయిల్ చేస్తున్నాడనీ" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"సమయానికి వచ్చారు. థాంక్స్" అంది సుధారాణి పమిట చెంగు కప్పుకుంటూ.

"మేం రాకముందే మిమ్మల్ని మీరే రక్షించుకున్నారుగా!"

"అవును ఇన్స్పెక్టర్! అంత బలం నాకు ఎలా వచ్చిందో అర్ధం కావడంలేదు. జార్జిని నేను ఎలా హత్య చేయగలిగానో తల్చుకుంటే ఆశ్చర్యంగా వుంది" అంది ఆమె.

# 4

"సుధారాణిగారూ! మీరు పెద్ద ఆపదనుంచి బైట పడ్డారని విన్నాను. ఐయామ్ వెరీ హాపీ నా!" అన్నాడు విజయ్ ఆమె ఎదురుగా వున్న సోఫాలో కూర్చుంటూ.

"థాంక్స్...." అంది సుధారాణి డెయిలీ పేపర్ చూస్తూ.

"జార్జి అంతపని చేశాడా? రాస్కెల్. మంచి పని చేశారు. కుక్కకాటుకు చెప్పుదెబ్బ అన్నారు. వాడికి తగిన శిక్ష విధించారు లెండి."

"నా ప్లేస్‌లో ఎవరున్నా అంతే చేస్తారు."

"నో....నో... అంతా అలా చేస్తారనుకున్నారా? ఆ డేర్ నెస్ మీకు కాబట్టి చెల్లింది. ఆడపిల్లల్లో ఆ డేర్ నెస్ వుంటే దేశంలో ఇన్ని రేప్ కేసులు జరుగుతాయా?" నవ్వాడు విజయ్.

సుధారాణి పొడిగా నవ్వింది.

"మా నాన్న ఈ సంగతి చెప్పారు. స్టన్ అయ్యాననుకోండి. బెయిల్ మీద మిమ్మల్ని రిలీజ్ చేశారటగా! ఆత్మరక్షణకోసం హత్యచేస్తే అది హత్యక్రిందికిరాదు లెండి. యూ విల్ బీ సేవ్‌డ్" అన్నాడు విజయ్.

"నేనూ అలాగే అనుకుంటున్నాను."

సుధారాణి తమ్ముడు బాబీ, చెల్లెలు లీల పుస్తకాలు తెచ్చుకుని కూర్చున్నారు.

"అంకుల్ పాఠాలు చెప్తారా?" అన్నాడు బాబీ.

"ఈ రోజు మీకు పాఠాలు చెప్పను" అన్నాడు విజయ్.

బాబీ, లీల ప్రశ్నార్థకంగా చూశారు.

"మీ అక్కయ్య పెద్ద ఆపదనుంచి బైటపడిన శుభ

సందర్భంగా మీకు సెలవు" అన్నాడు విజయ్ నవ్వుతూ.

బాబ్జీ, లీల పుస్తకాలు సర్దుకుని వెళ్ళిపోయారు.

"అమ్మాయ్! నిన్నొకసారి ప్లీడరుగారు రమ్మన్నారే" అంటూ వచ్చింది సావిత్రి.

"అలాగేనమ్మా!" అంది సుధారాణి.

"విజయ్! పిల్లలకి పాఠాలు మొదలుపెట్టలేదేం"" అంది సావిత్రి కూర్చుంటూ.

"మీ సుధారాణి గొప్ప ఆపదలో చిక్కుకుని బైట పడిన సంగతి తెలిశాక నా మైండ్ అబ్సెంటైపోయింది. అందుకే మీ పిల్లలకు సెలవు ఇచ్చేశాను" అన్నాడు విజయ్ నవ్వుతూ.

"అవును విజయ్! అదృష్టంవల్ల బైటపడింది. తల్చుకుంటేనే వణుకుపుడుతోంది నాకు" అంది సావిత్రి జరిగిపోయిన సంఘటన జ్ఞాపికి తెచ్చుకుంటూ.

"ఆ జార్జిగాడికి అంత ధైర్యం ఎలా వచ్చిందో అర్థం కావడంలేదు. అసలు ఇటువంటి ఐడియాలన్నీ సినిమాలు చూసి నేర్చుకుంటున్నారు ఆంటీ!" అన్నాడు విజయ్.

"ఏం చచ్చారో వెధవలు, మా ప్రాణానికి దాపురించారు. చేసేవన్నీ వెధవపనులు. అడ్డుచెప్తే కోపాలు. పనిలోనుంచి తీసేస్తే ఇదిగో ఇటువంటి బెదిరింపులు. ఛీ....ఛీ....డబ్బున్నా సుఖంలేదు" అంది సావిత్రి.

ఇంతలో టెలిఫోన్ మ్రోగింది.

సుధారాణి సోఫాలోనుంచి లేచివెళ్ళి మాట్లాడి వచ్చింది.

"ఎవరే?" అంది సావిత్రి.

"ఇన్స్పెక్టర్ గారు ఫోన్ చేశారు."

"ఏమిటట?"

"మనకారు దొరికిందట."

"ఎక్కడ?"

"శ్రీశైలం రోడ్డులోనట."

"పోనీలే...." అని నిట్టూర్చింది సావిత్రి.

"కారు దొరికిందిగాని దాని టైర్లు ఊడదీసుకుని పోయారట" అంది సుధారాణి.

విజయ్ నవ్వి "దొరికించేచాలని టైర్లు దొంగిలించుకు పోయివుంటారు కక్కుర్తి వెధవలు" అన్నాడు.

"బాగా చెప్పావు" అంది సావిత్రి.

"ప్లీడరుగారితో మాట్లాడివస్తానమ్మా!" అని వెళ్ళి పోయింది సుధారాణి. తర్వాత విజయ్ కూడా సెలవు తీసుకుని వెళ్ళిపోయాడు.

చీకటి పడుతూవుండగా సీతారామయ్య వచ్చాడు. అతను వాళ్ళ ఫ్యాక్టరీ మేనేజరు.

"రండి సీతారామయ్యగారూ!" అంది సావిత్రి.

సీతారామయ్య వచ్చి కూర్చున్నాడు.

సీతారామయ్య సన్నగా ఎర్రగా వున్నాడు. గ్లాస్కో పంచె కట్టి, తెల్లటి టెర్రీకాట్ లాల్చీ వేసుకున్నాడు. దాదాపు ఏభై ఏళ్ళు వుంటాయి అతనికి.

"ఇప్పుడే మీ విజయ్ వెళ్ళాడు" అంది సావిత్రి.

"ఇవాళ వాడు ట్యూషన్ చెప్పలేదా పిల్లలకి?"

"లేదు. సెలవు ఇచ్చాడు. అమ్మాయికి ఆపద తప్పి నందుకట" అంది సావిత్రి.

"బాగుంది. ఆడపిల్ల అలా వంటరిగా తిరుగుతుంటే ఆపదలు రాక ఏమౌతుంది? నా మాటవిని వెంటనే పెళ్ళి ఏర్పాట్లు చేస్తే మంచిది" అన్నాడు.

"నేనేం చెయ్యను?"

"గట్టిగా చెప్పాలి."

"ఎన్నిసార్లు చెప్పను! వాగి వాగి నా నోరు పడిపోతున్నది తెలుసా? ఆ రమణగాడి చదువు పూర్తయ్యాక చేసుకుంటానని ఖచ్చితంగా చెప్పింది."

సీతారామయ్య ముఖం మాడిపోయింది.

"మా విజయ్‌కి ఏమి తక్కువ?"

"తక్కువని ఎవరన్నారు?"

"నువ్వనడం కాదు సావిత్రీ! రాణీని విజయ్‌కిచ్చి పెళ్ళి చేస్తే నీకు ఎంత హాయిగా వుంటుంది. ఇంట్లో కలిసిపోయిన మనిషి కదా!"

"నిజమే! నేనేం చెయ్యను! నేను విజయ్ గురించి ఎన్నిసార్లో చెప్పాను."

"ఆ రమణ డాక్టరని మురిసిపోతోంది. సరే! వాసంగతి ఆ పసిదానికేం తెలుసు! ఎలా వాడిని పెళ్ళి చేసుకుంటుందో చూస్తాను!" క్రూరంగా నవ్వాడు సీతారామయ్య.

సావిత్రి ఏమీ మాట్లాడలేదు.

# 5

హాస్టల్ గది తాళం తీస్తుంటే పోస్టుమాన్ వచ్చి ఒక కవరు వెంకటరమణకు అందించాడు.

"ఎవరు రాశారబ్బా!" అనుకుంటూ కవరు చించాడు. ఆ లెటర్‌లో అక్షరాలు అతనికి పరిచయమైనవి కావు. అడుగున సంతకం చూశాడు. 'రావు' అని వుంది తారీఖు వేసి.

"ఎవరీ రావు? సుబ్బారావా? శంకర్రావా? రామారావా? వెంకట్రావా? ఎవరు? తనకి ఎందరో రావులు వున్నారు ఫ్రెండ్స్ సర్కిల్లో. ఎవరీ 'రావు' ఎందుకు

లెటర్ రాశాడు అనుకుంటూ చదవసాగాడు.

"డియర్ రమణా!

నువ్వు వైజాగ్ వెళ్ళి మూడు నెలలు దాటిందనుకుంటాను. ఈ మధ్య అనుకోకుండా ఒక భయంకరమైన సంఘటన జరిగింది.

సుధారాణి వాళ్ళ ఫ్యాక్టరీలో డ్రైవర్‌గా పని చేస్తున్న జార్జి అనేవాడిని వుద్యోగం నుంచి తొలగించింది. వాడు పగబట్టి ఒకరోజు సాయంకాలం సుధారాణిని కారుతోసహా కిడ్నాప్ చేశాడు. ఏభై వేలు ఇస్తే వదిలిపెడతానని వాళ్ళ అమ్మని బ్లాక్ మెయిల్ చేశాడు. సుధారాణిని ఒక పాడుబడిన గుడికి తీసుకెళ్ళి రేప్ చేశాడు.

ఆ తర్వాత సుధారాణి జార్జిని హత్య చేసింది. పోలీసులు ఆమె మీద హత్యానేరం మోపి కేసు పెట్టారు. అయితే తీర్పు సుధారాణికి అనుకూలంగా వస్తుందని అంతా అభిప్రాయపడుతున్నారు. ఆత్మరక్షణ కోసం గదా హత్య చేసింది?

పాపం ఆమె మానసికంగా ఎంతో క్రుంగిపోతోంది. స్త్రీకి విలువయిన శీలం కోల్పోతే అంతేగదా! మీరిద్దరూ ప్రేమించుకున్నారనీ, పెళ్ళి చేసుకోబోతున్నారనీ తెలిసినవాడిని గనుక ఈ లెటర్ రాస్తున్నాను.

ఈ క్లిష్టసమయంలో ఆమెకు అండగా వుండవలసిన బాధ్యత వుంది నీకు. వెంటనే వచ్చి ఓదార్చు.

సెలవు,

రావు."

ఆ లెటర్ చదివిన తర్వాత నెత్తిన పిడుగు పడిన వాడిలా అయిపోయాడు. కొన్ని నిమిషాలపాటు మెద

డంతా మొద్దుబారిపోయినట్లయింది. కళ్ళు గిర్రున తిరిగి నట్లనిపించి కళ్ళు మూసుకున్నాడు. కళ్ళముందు సుధా రాణి రూపం ప్రత్యక్షమైంది.

తన హౌస్ సర్జెన్సీ పూర్తయ్యాక పెళ్ళి చేసుకోవా లనుకున్నారు. ఇంతలో ఈ అవాంతరం. సుధారాణితో తన పెళ్ళి దాదాపుగా ఖాయమైనట్లే. తన తల్లిదండ్రు లకు ఆమెతో పెళ్ళి అంగీకారమే. ఆమె బాగా ధన వంతురాలు కూడా. ఆమెతో తన పెళ్ళి జరుగుతుందని ఎన్నో కలలు కన్నాడు.

ఇంతకీ తన దురదృష్టం. సుధారాణిని జార్జి రేప్ చేశాడు. ఆమె శీలం కోల్పోయింది. ఈ పరిస్థితుల్లో తన తల్లిదండ్రులు ఆమెతో పెళ్ళి జరగడానికి ఒప్పు కోరు. వాళ్ళు అసలే పాతకాలం మనుషులు. ఎప్పుడూ పూజా పునస్కారాలు చేస్తూ పాత ఆచారాలను పట్టు కుని వ్రేలాడుతూ వుంటారు. వాళ్ళ దృష్టిలో సుధా రాణి చెడిపోయిన ఆడది.

తను సుధారాణిని పెళ్ళి చేసుకోవాలంటే తల్లి దండ్రులను ఎదిరించాలి. వాళ్ళతో బంధాన్ని త్రెంచు కోవాలి.

ఆ రాత్రంతా వెంకటరమణలో ఆలోచనలు సుళ్ళు తిరుగుతున్నాయి. అతనికి నిద్రపట్టడం లేదు.

కళ్ళు మూసుకుంటే చాలు నల్లగా భయంకరంగా వున్న వ్యక్తి సుధారాణి వెంటపడి తరుముతున్నాడు. ఆమె బట్టలు చించేస్తూ రేప్ చేస్తున్న దృశ్యం కని పిస్తోంది.

వెంకటరమణ ఆ మానసిక వేదన భరించలేకపోయాడు. అతనికి ఏడుపు ముంచుకొస్తోంది. సుధారాణి తనకు

దక్కదు అనే ఆలోచనే భరించలేకపోతున్నాడు.

తనే ఇంత బాధను అనుభవిస్తుంటే సుధ ఎంతగా కుమిలపోతున్నదో!

'వెంటనే వెళ్ళాలి' అనుకున్నాడు వెంకటరమణ.

## 6

వెంకటరమణ ట్రైన్ దిగేటప్పటికి వుదయం పది దాటింది. సూట్‌కేస్ చేతో పట్టుకుని రిక్షా ఎక్కి అడ్రస్ చెప్పాడు. రిక్షా మెయిన్ రోడ్డులోనుంచి పోతుంటే 'ఒరేయ్' అనే కేక, ఆ వెనుక చప్పట్లు వినిపించాయి.

రిక్షా రోడ్డుప్రక్కన ఆపించి వెనక్కి తిరిగి చూశాడు. శేషగిరిరావు పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ వస్తున్నాడు నవ్వుతూ.

"ఏరా! ఇదేనా రావడం?" అన్నాడు వస్తూనే.

"ఆఁ...." అన్నాడు రమణ.

"రిక్షా దిగు కాఫీ తాగి నడచుకుంటూ పోదాం" అన్నాడు శేషగిరిరావు.

రమణ తల వూపి రిక్షాదిగి డబ్బులిచ్చి పంపేశాడు.

ఇద్దరూ శంకర్ విలాస్‌లోకి వెళ్ళి స్పెషల్ రూమ్‌లో కూర్చున్నారు.

బేరర్ రాగానే కాఫీ చెప్పాడు శేషగిరిరావు.

"ఎలా వుందిరా నీ బిజినెస్?" అన్నాడు రమణ.

"మూడు పువ్వులు-ఆరు కాయలు" నవ్వాడు శేషగిరి.

"ఏమిటి విశేషాలు?"

"నువ్వే చెప్పాలి."

రమణకి ఏమీ తోచలేదు. ఆ సంగతి శేషగిరి దగ్గర ఎత్తాలంటే బాధ అనిపిస్తోంది.

"వూరికి నే వచ్చా!" అన్నాడు పొడిగా నవ్వుతూ.
"నీకు తెలుసా ఆ సంగతి?" ప్రశ్నించాడు శేషగిరి.
"ఏ సంగతి?"
"అదే సుధారాణి ...."
"లెటర్ రాసింది నువ్వేనా?" సూటిగా ప్రశ్నించాడు రమణ.
"ఏ లెటర్?"
రమణ సమాధానం చెప్పకుండా సూట్‌కేసులో నుంచి రావు పేరుతో వచ్చిన లెటర్ చూపించాడు.
అది చదివి "నేను రాయలేదురా యిది" అన్నాడు శేషగిరి.
"ఎవరు రాశారో అర్థం కావటం లేదు."
"ఎవరో మనవాడే రాసి వుంటాడు. నువ్వు ఆమెను పరామర్శించడానికి వచ్చావా?"
"ఆఁ...." అన్నాడు రమణ దిక్కులు చూస్తూ.
"మొత్తానికి చాలా ఘోరం జరిగిపోయిందిరా. ఇటీవల ఆడదానికి రక్షణ లేకుండాపోతోంది. ఇదుగో ఈ కరపత్రం చూడు" జేబులోనుంచి తీసి ఇచ్చాడు శేషగిరి రావు రత్నావళి రంగులో వున్న కరపత్రం.
ఆ కరపత్రం పౌరహక్కుల సంఘంవాళ్ళు వేశారు. అందులో ఇటీవల టౌన్ చుట్టుప్రక్కల జరిగిన సంఘటనల గురించి రాశారు. ఆడవాళ్ళమీద అత్యాచారాలు, ఒక కానిస్టేబుల్ టౌన్‌కి వచ్చిన ఒక మైనర్ బాలికను చెరచడం వంటివి కొన్ని వివరంగా వున్నాయి. కరపత్రంలో హైలైట్ సుధారాణి మీద జరిగిన అత్యాచారం. తనను రేప్ చేసిన జార్జని హత్య చేసినందుకు ఆమెను అభినందించారు. ఆమె అభినవ మహిషాసుర

మర్దిని అని పొగిడారు. ప్రభుత్వం అరాచక శక్తులను అణచివేసి ప్రజలకు ముఖ్యంగా ఆడవాళ్ళకు రక్షణ కల్పించవలసిందని అభ్యర్థించారు హక్కుల సంఘం వారు.

"సుధారాణి రేప్ చేయబడిందని తెలియనివారికి గూడా తెలిసిపోతోంది ఆ కరపత్రం ద్వారా!" రమణ నిట్టూర్చాడు అంతా చదివి.

"పద పోదాం" అన్నాడు రమణ.

శేషగిరి బిల్లు చెల్లించాడు.

ఇద్దరూ మాట్లాడుకుంటూ బయల్దేరారు.

ఇంటికి వెళ్ళాక తల్లిదండ్రులతో పొడి పొడి మాటలు మాట్లాడి స్నానంచేసి డ్రెస్ చేసుకున్నాక సుధారాణి కోసం ఇంటికి ఫోన్ చేశాడు. ఆమె తల్లి సావిత్రి మాట్లాడింది. సుధారాణి ఫ్యాక్టరీలో వుందని చెప్పింది. ఎటూ ఫ్యాక్టరీలో వుందని తెలిసింది గనుక ఫోన్ చెయ్యకుండా నే స్కూటర్ వేసుకుని బయల్దేరాడు.

సుధారాణి రేప్ చేయబడింది. ఇందులో ఆమె తప్పు ఏముంది? ఏమీ లేదు. మనసు పవిత్రంగా వుండాలి గాని శరీరానికి మాలినం యేముంది? తను సుధారాణిని మనస్ఫూర్తిగా ఓదార్చాలి. ధైర్యంగా ఆమెను స్వీకరించాలి. తల్లిదండ్రులు ఒప్పుకోకపోయినా ఎదిరించాలి! అలా ఆలోచిస్తూ వెళ్ళాడు రమణ.

రమణను చూస్తూనే ఆశ్చర్యపోయింది సుధారాణి.

"ఎప్పుడొచ్చావ్?" అంది.

"ఇప్పుడే. స్నానంచేసి యిలా వచ్చాను."

ఆఫీసు రూమ్‌లో ఇద్దరే కూర్చున్నారు.

ఆమె బజర్ నొక్కి జవాన్ని కేకేసి రెండు కూల్

డ్రింక్స్ తెప్పించింది.

"ఇక్కడ జరిగిందంతా రావు అని ఎవరో ఒక లెటర్ రాశాడు. పౌరహక్కుల సంఘంవాళ్ళు వేసిన కరపత్రం గూడా చూశాను" అన్నాడు రమణ.

"నేనూ చూశాను ఆ కరపత్రం. కాని అదంతా నిజం కాదు రమణా!" అంది సుధారాణి.

"సుధా!...." ఆశ్చర్యంగా అన్నాడు.

"అవును రమణా! వాడు నన్ను రేప్ చేశాడని ఎవరో పుకారు పుట్టించారు. వాడు ప్రయత్నించిన మాట నిజమే. కాని నేను లొంగలేదు. వాడిని హత్య చేశాను" అంది గంభీరంగా.

"మరి ఇదంతా ఎలా పాకింది?"

"ఏమో అర్థం కావడం లేదు. అసలు మన వూళ్ళో పౌరహక్కుల సంఘం యెక్కడుందో తెలియలేదు. ఇన స్పెక్టర్ దివాకర్‌తో ఆ విషయం మాట్లాడాను. అటు వంటి సంఘం వున్న సంగతి తనకి తెలియదని అన్నాడు. ఎనీహౌ నామీద రేప్ జరగలేదనీ అదంతా పుకారనీ పేపరు ప్రకటన ఇచ్చాడు. చూడు" అంటూ సుధారాణి డెయిలీ పేపర్ రమణకి అందించింది.

సుధారాణి మీద పౌరహక్కుల సంఘం వాళ్ళు రాసింది శుద్ధ తప్పు అనీ, ఆమెను జార్జి రేప్ చెయ్యలేదనీ ఇన్‌స్పెక్టర్ దివాకర్ ఖండిస్తూ ఇచ్చిన ప్రకటన అందులో వుంది.

రమణకు అదంతా ఎందుకో కృత్రిమంగా వున్నట్లు అనిపించింది. జార్జి అనేవాడు ఆమెను రేప్ చేసి వుండ వచ్చు. అయితే అందువల్ల తనకి చెడ్డ పేరు వస్తుందనీ, చెడిపోయిన ఆడది అని చెప్పుకుంటారనీ సుధారాణి ఈ

విధంగా నాటకం ఆడటం లేదుగదా? అనిపించింది.

తనను చూస్తూనే ఆమె యేడుస్తుందనీ, తను మన స్ఫూర్తిగా ఓదారుస్తాడనీ, ప్రపంచం అంతా ఏకమైనా ఆమెను స్వీకరిస్తానని ధైర్యం చెప్పాలనీ వచ్చాడు. కాని అటువంటి అవసరమే రాలేదు. అసలు యేమీ జరగనట్లే ప్రవర్తిస్తోంది సుధారాణి.

"సుధా! రేప్ జరిగిందా లేదా అన్నదాని మీద తర్జన భర్జన లెందుకు? అందులో నీ తప్పు యేమీ లేదు కదా?"

"లేనిది వున్నట్లుగా యెందుకు రాయాలి వాళ్లు?"

"అలా రాస్తే వాళ్ళకేం లాభం?" అన్నాడు రమణ.

సుధారాణి సీరియస్‌గా చూసింది అతన్ని.

"అంటే నీ వుద్దేశ్య మేమిటి రమణా? నన్ను వాడు రేప్ చేశాడని నువ్వు నమ్ముతున్నావా?"

"జరిగినా గూడా ఫరవాలేదంటున్నాను. శరీరాని కంటే మనసు పవిత్రంగా వుండాలని నా వుద్దేశ్యం" అన్నాడు రమణ.

"నామీద నీకు అనుమానంగా వున్నట్లుంది గదూ! అవును రమణా! నేను నాటకాలు ఆడుతున్నాను. నన్ను వాడు రేప్ చేశాడు. అది నీకు తెలిస్తే పెళ్ళి చేసుకోవని భయపడి నాటకం ఆడుతున్నాను...." అంటూ ఆమె వెర్రిదానిలా వెక్కి వెక్కి యేడుస్తోంది.

"సుధా! నన్ను అపార్థం చేసుకుంటున్నావు."

"లేదు రమణా! బాగా అర్థం చేసుకున్నాను. చెడి పోయిన ఆడదాన్నని నీకు అనుమానంగా వుంది. అటువం టప్పుడు మనం దూరంగా వుండటమే మంచిది" కళ్ళు తుడుచుకుంటూ అంది ఆమె.

"సుధా! ఏమిటి నువ్వనేది?"

"అవును రమణా! మనం దూరంగానే వుండాలి. పెళ్ళంటే నూరేళ్ళ పంట. అనుమానాలతో అపార్థాలతో కాపురం చెయ్యడం నావల్ల కాదు. ప్లీజ్ నన్ను మర్చిపో" అంటూ యేడవసాగింది.

రమణ చిత్తరువులా కూర్చుండిపోయాడు.

## 7

"ఇన్‌స్పెక్టర్ దివాకర్ స్పీకింగ్ ప్లీజ్!" అన్నాడు ఫోనెత్తి.

"ఇన్‌స్పెక్టర్ గారూ! మీరు వెంటనే మా ఇంటికి రావాలి" సావిత్రి కంఠం ఆదుర్దాగా వుంది.

"ఏం జరిగింది?"

"మా అమ్మాయి పిలిస్తే పలకడంలేదు. గది తలుపులు మూసి వున్నాయి. మీరు వెంటనే రావాలి. నాకు భయంగా వుంది ఇన్‌స్పెక్టర్ గారూ!" అంది సావిత్రి వణుకుతున్న కంఠంతో.

"అలాగే వస్తున్నా!" అన్నాడు రిసీవర్ పెట్టేస్తూ.

ఇన్‌స్పెక్టర్ దివాకర్ పోలీస్ స్టేషన్‌కి వెళ్ళి సిబ్బందిని వాన్‌లో యెక్కించుకుని సావిత్రి ఇంటికి వెళ్ళేసరికి వుదయం ఎనిమిది గంటలు దాటింది.

"రండి ఇన్‌స్పెక్టర్ గారూ!" అంది సావిత్రి పోర్టికోలోకి వచ్చి.

అప్పటివరకూ ఆమె యేడ్చి యేడ్చి వున్నట్లు చూస్తూనే గ్రహించాడు ఇన్‌స్పెక్టర్. సావిత్రి కళ్ళు యెర్రగా వున్నాయి. ముఖం వుబ్బి వుంది.

ఇద్దరు మగనౌకర్లు, ఒక ఆడపనిమనిషి దీనంగా నిల్చుని చూస్తున్నారు. సావిత్రి పిల్లలు దిగులుగా వున్నారు.

"ఏం జరిగిందో చెప్పండి!" అన్నాడు ఇన్‌స్పెక్టర్ నిశ్శబ్దాన్ని భంగపరుస్తూ.

"అమ్మాయికి లేవగానే బెడ్ కాఫీ త్రాగే అలవాటు. మామూలుగా ఆరింటికే నిద్ర లేస్తుంది. ఆరున్నరకి పని మనిషి కాఫీ యిస్తుంది. రోజులాగే పనిమనిషి వెళ్ళింది. రోజూ తలుపులు తీసే వుండేవి. ఈవాళ తలుపులు మూసివున్నాయి. తలుపులు తట్టినా నిద్ర లేవలేదు. కాసేపు చూసి నన్ను పిలుచుకొచ్చింది" అంది సావిత్రి.

దివాకర్ తలుపు నెట్టి చూశాడు. లోపల బోల్టు వేసే వున్నట్లుంది. ఆ గదికి వున్న రెండు కిటికీలూ మూసే వున్నాయి.

"బ్రేక్ చెయ్యండి" అన్నాడు తన సిబ్బందిని.

బలవంతంగా తలుపులు తెరిచారు. లోపల బోల్టు వూడిపోయి భళ్ళున తెరుచుకున్నాయి.

వంకాయ రంగులో వున్న నైట్ గౌనులో బెడ్ మీద వుంది సుధారాణి. నిద్ర పోతున్నట్లుగా వున్న ఆమెను చూసి సావిత్రి ఘొల్లున యేడుస్తూ లోపలకు రాబోయింది.

ఇన్‌స్పెక్టరు ఆమెను వారిస్తూ "ప్లీజ్! ఎవరూ లోపలకు రాకండి" అన్నాడు. గది ముందు కానిస్టేబుళ్ళను వుంచి యెవరూ లోపలకు రాకుండా చూడమని ఆదేశించాడు.

ఇన్‌స్పెక్టర్ దివాకర్‌తోపాటు యస్. ఐ. వెంకట్ గూడా గదిలోకి ప్రవేశించాడు.

గది చాలా విశాలంగా వుంది.

కిటికీ ప్రక్కనే సీలింగ్ ఫ్యాన్ క్రింద ఫోమ్ బెడ్ మీద పడుకున్నది సుధారాణి. ముక్కు దగ్గర వేలుపెట్టి చూశాడు వెంకట్. శ్వాస ఆగిపోయి వుంది.

"సర్! షీ ఈజ్ డెడ్" అన్నాడు యస్.ఐ. వెంకట్.

వెంకట్ మాటలు వింటూనే సావిత్రి యేడుపు స్వరం హెచ్చింది. ఆమెతో పాటు ఇద్దరు ఆడపిల్లలు పెద్దగా యేడుస్తున్నారు. బాబీ వెక్కి వెక్కి చిన్నగా కుమిలిపోతున్నాడు. నౌకర్లు కళ్ళు తుడుచుకుంటున్నారు.

వాళ్ళ ఏడుపులు విని ఇరుగు పొరుగువారు అక్కడ చేరారు. ఆ వీధికంతా తెలిసిపోయింది సుధారాణి చనిపోయిందని.

ఇన్స్పెక్టర్ గదంతా పరిశీలనగా చూస్తున్నాడు తన ఎక్స్‌రే కళ్ళతో. ఆ గదిలో గాడ్రెజ్ బీరువా ఒకటి వుంది. చెక్క టేబుల్, దానిమీద నేషనల్ టూ ఇన్ వన్ టేప్ రికార్డర్. దాని ప్రక్కనే కేసెట్లు దొంతరగా పేర్చివున్నాయి. ఒకమూల చక్రాలున్న స్టాండుమీద గుల్‌మార్గ్ ఎయిర్‌కూలర్ వుంది. బట్టల స్టాండ్ మీద రెండు మూడు చీరలు, హేంగర్స్‌కి తగిలించి బ్లౌజులు, నైట్ గౌనులు వున్నాయి.

"సర్! ఆ నోట్‌బుక్‌లో ఏదో ఒక కాగితం వుంది. ప్లీజ్ సీ!" అన్నాడు యస్.ఐ. వెంకట్.

"అవును" అన్నాడు ఇన్స్పెక్టర్.

అది అశోకా డీలక్స్ నోట్‌బుక్. ఒక ప్లాస్టిక్ కోటెడ్ కవర్ మీద అమితాబచ్చన్ ఫోటో వుంది.

"చూడు మిస్టర్ వెంకట్! ఆ నోట్‌బుక్ ముట్టుకోకుండా అందులోని కాగితం తియ్యగలవా?"

"యస్సార్!" అంటూ వెంకట్ ఆ నోట్‌బుక్‌లో కాగితం లాగాడు.

అది చిన్న స్లిప్. రూళ్ళ కాగితం. అందులో ఇలా వుంది.

అమ్మా!

నేని అవమానం భరించలేక ఆత్మహత్య చేసుకుంటున్నాను.

—సుధ."

"ఈ స్లిప్ ఆ నోట్ బుక్ లోది కాదు, అవునా?" ప్రశ్నించాడు దివాకర్.

యస్.ఐ. వెంకట్ నోట్ బుక్ కర్రతో ఎత్తిచూసి "యస్సార్ ఈ నోట్ బుక్ కాగితాలు చాలా వైట్ గా వున్నాయి. పైగా అన్ రూల్డు. ఈ స్లిప్ మాత్రం రూళ్ళది" అన్నాడు.

"దట్సాల్ రైట్. అయితే ఈమె విషం పుచ్చుకొని వుంటుంది అనుకుందాం. పాయిజన్ బాటిల్ ఏదైనా దొరుకుతుందేమో చూడు" అన్నాడు గదంతా తీక్షణంగా చూస్తూ.

వెంకట్ గదంతా తీక్షణంగా అంగుళం అంగుళం సెర్చి చేశాడు.

"సార్! పాయిజన్ బాటిల్ దొరకలేదు" అన్నాడు.

"దట్సాల్ రైట్" అంటూ బ్యాక్ డోర్ నెట్టాడు. నెమ్మదిగా తెరుచుకుంది. తలుపుతీసి చూశాడు. కొంచెం దూరంలో బాత్ రూమ్ వుంది.

"మిస్టర్ వెంకట్! అర్జంట్ గా ఫింగర్ ప్రింట్స్ ఎక్స్పర్టు కావాలి. వ్యాన్ తీసుకెళ్ళి రిక్వైజిషన్ పెట్టించి తీసుకురా!" అన్నాడు ఇన్స్పెక్టర్.

"ఓ.కే. సర్" అంటూ వెంకట్ పరిగెత్తాడు గది బైటికి.

మరో అరగంటకి ఫ్యాక్టరీ మేనేజర్ సీతారామయ్య

ఆదరాబాదరా వచ్చాడు. అతని వెనుకే కొడుకు విజయ్ గూడా వచ్చాడు. మేడ బైట గేటు దగ్గిర పోలీసులు జనాన్ని అదుపుచేస్తున్నారు.

"నమస్తే! ఇన్స్పెక్టర్ గారూ!" అన్నాడు సీతా రామయ్య వస్తూనే.

ఇన్స్పెక్టర్ విష్ చేశాడు.

సీతారామయ్య గదిలోకి వెళ్ళబోతుంటే పోలీసులు వెళ్ళనివ్వలేదు. గుమ్మంలోనే నిల్చుని కండువాతో కళ్ళు తుడుచుకుని ముక్కు చీదుకున్నాడు. విజయ్ విచార వదనంతో చూస్తూ నిలబడిపోయాడు.

"ఎంత దారుణం జరిగిపోయింది సార్!" అన్నాడు దగ్గరకి వస్తూ.

దివాకర్ తలవూపాడు.

"కొన్ని రోజులుగా అమ్మాయి దిగులుగా వుంటూ వచ్చింది. నేను అనుమానిస్తూనే వున్నాను సార్! ఏదైనా అఘాయిత్యం చేస్తుందేమోనని. వీలున్నప్పుడల్లా ధైర్యం చెప్తూ వుండేవాడిని. జార్జిగాడిని మర్డర్ చేసినందుకు జైలుశిక్ష పడుతుందేమోనని భయపడిందేమో?" అన్నాడు సీతారామయ్య.

"ఏమో! మనం ఏం చెప్పగలం?" అన్నాడు దివాకర్.

"శవాన్ని ఎప్పుడు తీసుకెళ్ళొచ్చంటారు?" ప్రశ్నించాడు సీతారామయ్య.

"పోస్టుమార్టమ్ చెయ్యాలి."

"పోస్టుమార్టమా?"

"అవును."

"అది లేకుండా వీల్లేదా?"

"నో.... సారీ!" అన్నాడు ఇన్స్పెక్టర్ సీరియస్‌గా.

"నీ పేరేమిటి?"

"నాగమ్మ."

"చూడు నాగమ్మా! నీకు తెలిసినదంతా నిజం చెప్పాలి. అబద్ధం చెప్పగూడదు" అన్నాడు ఇన్స్పెక్టర్ దివాకర్.

నాగమ్మ తలవూపింది.

"రాత్రి ఎన్నింటివరకూ పనిచేశావు ఆ ఇంట్లో?"

"చిన్నమ్మగారు భోజనం చేసేదాకా వున్నానండీ. తర్వాత వెళ్ళిపోయాను."

"అప్పుడు టైమెంతయింది?"

"ఎనిమిది దాటింది."

"మీ చిన్నమ్మగారికి పడుకోబోయేముందు పాలు త్రాగే అలవాటు వుందా?"

"వుందండీ!"

"పాలు ఎవరిస్తుంటారు?"

"నేనే ఫ్లాస్కులో పోసి పోతానండీ!"

"రాత్రి అలాగే పోశావా?"

"ఆఁ.... పోశానండి."

"పాలుపోసేముందు ఫ్లాస్కు కడుగుతావా?"

"కడగనండి."

"ఏం?"

"ప్రొద్దున్నే ఫ్లాస్కు కడిగి అక్కడ పెడతానండి."

"ఓహోఁ..." అన్నాడు ఇన్స్పెక్టర్ కళ్లు ఎగరేస్తూ.

"రాత్రి మీ చిన్నమ్మగారు ఎలా వున్నారు? విచారంగా వున్నారా? లేక మామూలుగా వున్నారా?"

"నేను సరిగా చూళ్లేదండి."

"మీ చిన్నమ్మగారు పాలలో విషం కలిపి త్రాగింది తెలుసా?"

తల వూపింది నాగమ్మ.

"మీ చిన్నమ్మగారి పక్కలోనే పడివుంది గ్లాసు. గ్లాసులోను, ఫ్లాస్కులోను విషం వుంది. ఫ్లాస్కులో పాలుపోసింది నువ్వేనని ఒప్పుకుంటున్నావు గదా! ఇప్పుడు చెప్పు? పాలలో విషం కలిపి ఫ్లాస్కులో కలిపింది నువ్వేనా?" దివాకర్ కంఠంలో తీవ్రత గమనించి నాగమ్మ వణికిపోయింది.

"అయ్యగారూ! సత్తెప్రమాణంగా చెప్తున్నా! నాకే పాపం తెలీదు" అంది నాగమ్మ ఏడుపు నిండిన స్వరంతో.

"వూరికే తెలియదంటే పోతుందా? నిన్ను అరెస్టు చేస్తున్నాం. నిజం చెప్పేవరకూ నీ గతి కటకటాల వెనుకే! తెలిసిందా?"

నాగమ్మ పెద్దగా ఏడ్చింది.

"నోర్ముయ్!" అని గర్జించాడు ఇన్స్పెక్టర్.

# 9

"మీ అమ్మాయి ఆత్మహత్య చేసుకోలేదని నేను భావిస్తున్నాను" అన్నాడు ఇన్స్పెక్టర్ దివాకర్.

సావిత్రి తలెత్తి అయోమయంగా చూసింది.

"మరి?" అంది.

"ఎవరో హత్య చేశారు."

వులిక్కిపడింది ఆమె.

"మీరు పూర్తిగా సహకరిస్తే హంతకులెవరో పట్టివ్వగలను" అన్నాడు.

"ఆత్మహత్య చేసుకుంటానని కాగితం రాసిపెట్టిందిగా. అది అమ్మాయి రాసింది కాదంటారా?"

"అది మీ అమ్మాయి రాసిందే!"

"మరి ఎలా అనుమానిస్తున్నారు?"

"ఆ కాగితం అప్పుడు రాసింది కాదు. చాలా రోజుల క్రితం రాసిందే. ఆ కాగితం మీద అక్షరాలు ఆకుపచ్చ ఇంకుతో రాసినవి. కాని మీ అమ్మాయిగారి గదిలో ఎక్కడా మాకు ఆకుపచ్చ పెన్ కనపడలేదు. డ్రాయరు సొరుగులో బ్లూ కలర్ బాల్ పెన్, రెడ్ ఇంక్ పెన్ వున్నాయి. దాన్నిబట్టి ఆ కాగితం ఆ రాత్రి రాసింది కాదని చెప్పగలను."

సావిత్రి నివ్వెరపోయి వింటూ వుంది.

"తర్వాత గది వెనుక తలుపు తీసేవుంది. పోనీ ఆమె బాత్ రూమ్‌కి వెళ్ళి వచ్చి మర్చిపోయిందనుకుందాం. ఫ్లాస్కులో వున్న పాలచుక్కల్లో విషం కలిసివుంది. ఎవరైనా విషంగ్లాసులో కలుపుకుంటారుగాని ఫ్లాస్కులో కలుపుకుంటారా? ఇంకొక విచిత్రం ఏమిటంటే మీ అమ్మాయిగారు స్లిప్ పెట్టిన నోట్ బుక్ మీద ఆమె వేలిముద్రలులేవు. తన వేలిముద్రలు బుక్ మీద పడకుండా అతి జాగ్రత్తగా వుండవలసిన అవసరం ఆమెకు ఏమిటి? కాబట్టి ఎవరో అతి తెలివిగా ఈ హత్య చేశారు.

సావిత్రి బొమ్మలా సోఫాలో కూర్చుండిపోయింది.

"మీరు మీకు తెలిసినవన్నీ దాచకుండా చెప్పండి. మీకు అంటే మీ ఇంటితో అతి సన్నిహితంగా మసలుతున్న వ్యక్తులే ఈ హత్య చేశారు. మీకు ఇప్పుడు ఎవరిమీదనైనా అనుమానం వుంటే చెప్పండి" అన్నాడు.

సావిత్రి బొటబొట కన్నీళ్ళు కారుస్తూ "ఇన్స్పెక్టర్ గారూ! మీరు చెప్పేదంతా వింటూ వుంటే నాకు మతి పోయినట్లుంది. మా సుధని ఎవరు హత్య చేస్తారు? అందు

వల్ల వాళ్ళకేం లాభం?" బొంగురుపోతున్న గొంతుతో అంది.

"మీరు వెంటనే చెప్పనవసరంలేదు. బాగా ఆలోచించండి. మీ పనిమనుషులుగాని, మీ బంధువుల్లోగాని, ఎవరిమీదనైనా అనుమానం వుంటే నాకు ఫోన్ చేసి చెప్పండి. ఒక హత్య చెయ్యడానికి కేవలం లాభమే వుండనవసరంలేదు. పగతో చెయ్యొచ్చు. అసూయతో చెయ్యొచ్చు. ఎందుకు హత్య చేశారు అనేది మనం ఏమీ చెప్పలేం సావిత్రిగారూ!" అన్నాడు ఇన్స్పెక్టర్ దివాకర్.

సావిత్రి ఏదో ఆలోచిస్తూ తల వూపింది.

"మీ రెండో అమ్మాయి పేరు ఝాన్సీరాణి కదూ?"

అవునన్నట్లు తల వూపింది సావిత్రి.

"ఏ కాలేజీలో చదువుతున్నది?"

"సుజాతారెడ్డి జూనియర్ కాలేజీలో."

"థాంక్స్. అవసరమైతే మళ్ళీ కలుసుకుంటాను" అంటూ వెళ్ళి జీప్‌లో కూర్చుని, "సుజాతరెడ్డి జూనియర్ కాలేజీకి పోనియ్" అన్నాడు.

"ప్రిన్సిపాల్ గారూ! ఝాన్సీరాణి అని సావిత్రిగారి అమ్మాయిని ఒకసారి పిలుస్తారా? కొంచెం పనివుంది" అన్నాడు.

"ష్యూర్! ష్యూర్!...." అని ఝాన్సీరాణిని పిలిపించింది ప్రిన్సిపాల్.

సన్నగా పొడుగ్గా కొంచెం సుధారాణి పోలికలు వున్న అమ్మాయి గదిలోకి ప్రవేశించింది. పదహారు, పదిహేడేళ్ళు వుండవచ్చు ఆమెకు.

ఝాన్సీరాణి గదిలోకి రాగానే ప్రిన్సిపాల్ గది

బైటకు వెళ్ళిపోతుంటే "ఫరవాలేదు కూర్చోండి" అన్నాడు ఇన్స్పెక్టర్.

"మీ అక్కయ్య ఆత్మహత్య చేసుకుందని నువ్వు అనుకుంటున్నావు కదూ!"

ఝాన్సీరాణి తల ఊపింది.

"కాని ఆమె ఆత్మహత్య చేసుకోలేదు. ఎవరో హత్య చేశారు."

ఆమె నమ్మలేనట్లు చూసింది.

"నిజం. కాని హంతకులెవరో చాల తెలివైనవాళ్ళు. పట్టుకోవడం సులభంకాదు. కాని ఒకటి మాత్రం చెప్ప గలను. హత్య చేసింది మీ ఇంట్లోవాళ్ళే, ఐ మీన్ మీతో సన్నిహితంగా తిరుగుతున్నవాళ్ళే."

ఆమె కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. చనిపోయిన అక్క జ్ఞాపకం వచ్చి ఏడుపువచ్చింది.

"మీ ఫ్యాక్టరీ మేనేజర్ సీతారామయ్యగారి అబ్బాయి విజయ్ మీ ఇంటికి రోజూ వస్తూ వుంటాడు కదూ?"

తల వూపింది ఆమె.

"ఎందుకొస్తాడు రోజూ?"

"మా తమ్ముడికి, చెల్లికి ట్యూషన్ చెప్తాడు."

"మీ నాన్నగారు చనిపోయి ఎన్నేళ్ళయింది?"

"ఏడేళ్ళు దాటింది."

"అప్పట్నుంచి సీతారామయ్య మేనేజర్గా వుంటున్నాడా?"

"అవునండీ."

"విజయ్ని పెళ్ళిచేసుకోమని మీ అమ్మ మీ అక్కని బలవంతం చేసేరని తెలిసింది. నిజమేనా?"

"నిజమేనండి."

"మీ అక్కకి విజయ్‌ని చేసుకోవడం ఇష్టంలేదు కదూ?"

"అవునండి."

"ఏం? ఏదైనా కారణం వుందా?"

"మా అక్క వెంకటరమణను పెళ్ళిచేసుకోవాలని అనుకుంది."

"వెంకటరమణ ఎవరు?"

"వైజాగ్‌లో యమ్.బి.బి.యస్. చదువుతున్నాడు."

"అతను మీ అక్కకి ఎలా పరిచయమయ్యాడు?"

"నాకు తెలియదండి."

"మీ అక్కని హత్య చెయ్యడానికి ఎవరికైనా అవకాశం వుందా?"

ఝాన్సీరాణి మాట్లాడలేదు.

"విజయ్ అప్పుడప్పుడూ అంటే తరచుగా మీ ఇంట్లోనే డిన్నర్ చేసేవాడనీ, రాత్రిళ్ళు మీ ఇంట్లోనే నిద్రపోయేవాడనీ తెలిసింది. నిజమేనా?"

"అవునండి. మాతో చాలా చనువుగా వుంటాడు."

"థాంక్స్ ఝాన్సీరాణీ! నీకేదయినా తెలిస్తే నాకు ఫోన్ చేసి చెప్పు."

ఆమె తల వూపింది.

# 10

"మీరు కరపత్రం ఏ ప్రెస్‌లో అచ్చు వేశారో కనుక్కోమని చెప్పారుగా. రెండు రోజులు ప్రెస్‌లన్నీ తిరిగాను. ఆఖరికి కల్యాణి ప్రెస్‌వాడు ఒప్పుకున్నాడు తనే అచ్చు వేశానని" చెప్పాడు యస్. ఐ. వెంకట్.

"ఎవరు వేయించారట?" అడిగాడు ఇన్‌స్పెక్టర్

దివాకర్.

"ముందు ఎవరో తెలియదన్నాడు. మానవ హక్కుల సంఘం ప్రెసిడెంట్ అన్నాడు. మరి ప్రెస్ పేరు ఎందుకు వెయ్యలేదంటే నీళ్ళు నమిలాడు. నేను బాగా బెదిరించాను. అందులో వేసినవన్నీ తప్పులు. సుధారాణిని యెవరూ రేప్ చెయ్యలేదు. రేప్ చేసినట్లుగా కరపత్రంలో అచ్చు వేయడంవల్ల ఆమె ఆ అవమానం భరించలేక ఆత్మహత్య చేసుకుందనీ, కేసు అచ్చు వేయించినవాడిమీద, వేసినవాడిమీద పెడతామనీ దబాయించేసరికి ఆ ప్రొప్రయిటర్ నీళ్లు కారిపోయాడు. ఆఖరికి చెప్పాడు సీతారామయ్య వేయించాడని" అన్నాడు వెంకట్.

"నేను అనుమానించినట్టే జరిగింది."

"ఏమిటి మీరు సీతారామయ్యను అనుమానిస్తున్నారా?"

"అవును. లేకపోతే ఇంకెవడికి వుంది ఆ దురద?"

"సీతారామయ్యకి యేం లాభం?"

"లాభం వుంది. లాభం లేకుండా యెవడూ ఏ పనీ చెయ్యడు. అది గుర్తుంచుకో. సీతారామయ్య తన కొడుకు విజయ్‌కిచ్చి సుధారాణి పెళ్ళి జరిపించాలని ప్లాన్ వేశాడు. సుధారాణి తల్లి సావిత్రికి కూడా ఇష్టమే! కాని సుధారాణి మాత్రం ఒక మెడికల్ స్టూడెంట్‌ని లవ్ చేసింది. సావిత్రి భర్త పోయిన తర్వాత సుధారాణి ఫ్యాక్టరీని తనే స్వయంగా నడుపుతూవుంది. సీతారామయ్యను తగు దూరంలోనే వుంచింది. ఇక సుధారాణి తన కోడలయితే తప్ప ఫ్యాక్టరీ పూర్తిగా తన అదుపులోకి రాదు. కాని ఆమె తన కొడు

కుని పెళ్ళి చేసుకోవడానికి సుముఖంగా లేదు. ఇక మిగి లింది ఆమె భవిష్యత్తు నాశనం చెయ్యడమే. ఆ పని సీతారామయ్య చేసి వుంటాడు."

"నిన్న మీరు సావిత్రిని కలుసుకున్నారుగదా! సుధా రాణి పెళ్ళి విషయం మాట్లాడలేదా?" అన్నాడు వెంకట్.

"లేదు."

"ఇప్పుడు ఫోన్ చేసి అడగండి, ఏం చెప్తుందో?"

దివాకర్ ఫోన్ చేశాడు. సావిత్రి రిసీవర్ ఎత్తింది.

"ఇన్‌స్పెక్టర్ దివాకర్ని మాట్లాడుతున్నాను."

"నమస్తే!"

"నమస్తే సావిత్రిగారూ!"

"ఏమిటి ఇన్‌స్పెక్టర్! హత్య చేసింది యెవరో తెలిసిందా?"

"ఇంకా లేదు. మీరు కొంచెం ఓపిక పట్టాలి."

"అలాగే!"

"మిమ్మల్నొక విషయం అడగాలనుకుంటున్నాను."

"అడగండి."

"మీ అమ్మాయి రమణ అనే మెడికల్ కుర్రాడిని ప్రేమించిందనీ, పెళ్ళి చేసుకోవాలనుకుందనీ మాకు తెలి సింది. కాని మీరు ఆ ప్రపోజల్ వ్యతిరేకించారనీ, మీ ఫ్యాక్టరీ మేనేజర్ కొడుకుని చేసుకోమని బలవంత పెట్టారని అనుకుంటున్నారు. మీరు ఏం చెప్తారు?"

"నిజమే ఇన్‌స్పెక్టర్! నేను ఆ పెళ్ళికి వ్యతిరేకించిన మాట నిజమే. కాని విజయ్‌ని పెళ్ళికి చేసుకోమని బల వంత పెట్టలేదు."

"మీరు యేమీ అనుకోకండి. ఆమె ప్రేమించిన

వ్యక్తిని పెళ్ళి చేసుకోవడానికి మీరు యెందుకు వ్యతిరేకించారో తెలియజేస్తారా?"

"ఇందులో పెద్ద కారణం యేమీ లేదు ఇన్‌స్పెక్టర్ గారూ! రమణ డాక్టర్. అమ్మాయి అతన్ని పెళ్ళి చేసుకుని వెళ్ళిపోతే ఫ్యాక్టరీ ఎవరు చూస్తారు చెప్పండి! అదే మా మేనేజర్ కొడుకుని పెళ్ళి చేసుకుంటే ఇక్కడే వుంటాడు. ఫ్యాక్టరీ మేనేజ్‌మెంటు గొడవ వుండదు. ఎందుకంటే మా బాబ్జీ యింకా చిన్నవాడు. అందుకే నేను వ్యతిరేకించాను. అంతకంటే పెద్ద కారణం యేమీ లేదు."

"థాంక్స్ సావిత్రిగారూ!" అని రిసీవర్ పెట్టేశాడు. తనతో ఆమె చెప్పిన విషయాలన్నీ యస్. ఐ. వెంకట్‌తో చెప్పాడు దివాకర్.

"సార్! మనం ఇంతవరకు ఆ రమణనుగాని, విజయ్‌ని గాని కలుసుకోలేదు" అని గుర్తు చేశాడు వెంకట్.

"రమణ వైజాగ్‌లో వున్నాడు. పోతే నువ్వు అతన్ని కలుసుకుని ఏదయినా మనకి పనికివచ్చే సమాచారం వుంటే పట్టుకురా!"

"ఈ హత్య సీతారామయ్య, తన కొడుకు విజయ్‌తో చేయించి వుంటాడని నాకు గట్టి నమ్మకంగా తోస్తోంది సార్! యెందుకంటే విజయ్ ఎం. ఏ. చదివాడు. వాడి తెలివి తేటలన్నీ వుపయోగించి హత్య చేశాడు. అందుకే మనకు యే క్లూ దొరక్క, తికమకపడిపోతున్నాము" అన్నాడు వెంకట్.

"మన నమ్మకంతో కేసుకు పనేముంది? మన నమ్మకం కోర్టులో పనికిరాదు. విజయ్ మీద, సీతారామయ్య మీద కేసు పెట్టాలంటే బలమయిన సాక్ష్యం కావాలి. అది

దొరికితే తప్ప మనం యెవరిమీదా కేసు పెట్టలేం"
అన్నాడు దివాకర్.

"సరే సార్! నేను రేపే మెయిల్లో వైజాగ్ వెళ్తాను. మీరీలోపల విజయ్‌ని ప్రశ్నించండి. సీతారామయ్య చర్యలు గమనించమని మఫ్టీలో మన వాళ్ళని పంపండి" అన్నాడు వెంకట్.

ఇన్‌స్పెక్టర్ యేదో ఆలోచిస్తూ తల వూపాడు.

# 11

పోలీస్ జీప్ సీతారామయ్య ఇంటిముందు ఆగింది.

"నమస్కారం ఇన్‌స్పెక్టర్ గారూ!" అన్నాడు సీతారామయ్య దివాకర్‌ని చూస్తూ.

"మీ ఇంటిని సెర్చి చెయ్యాలి సీతారామయ్యగారూ!" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

సీతారామయ్య ముఖం నల్లబడిపోయింది పెనం మీద అట్టులా.

"ఎందుకు?" అన్నాడు తడి ఆరిపోతున్న గొంతులో.

"ఫ్యాక్టరీలో డబ్బు పోయినందుకు?"

"నాకేం సంబంధం?"

"వుంది కాబట్టే."

"వీల్లేదు. ఫ్యాక్టరీలో డబ్బు ఆ క్యాషియర్ కాజేసి వుండొచ్చు."

"అందుకు అవకాశం లేదు సీతారామయ్యగారూ! సుధారాణి చనిపోయాక సేఫ్ సీల్ తియ్యలేదు. నిన్నటి వరకూ ఆ సేఫ్‌మీద ఆమె సంతకం చేసిన స్లిప్ అంటించి వుంది. నిన్ననే క్యాషియర్ సావిత్రిగారు, నేను అక్కడ వుండగా సేఫ్ తీశాడు. క్యాష్ బుక్ కీ, సేఫ్‌లో క్యాష్‌కి సంబంధంలేదు. అరవై వేలు తక్కువ వున్నాయి.

ఆమె చనిపోవడానికి ముందురోజు వర్కర్లకి జీతాలు ఇవ్వడానికి డ్రా చేసిన డబ్బులో మిగిలింది సేఫ్‌లో వుంచింది ఆమె."

"ఆ సేఫ్‌లో మాయమైన డబ్బుకి నా బాధ్యత ఏమిటి?"

"వుంది సార్ సీతారామయ్యగారూ! సుధారాణిని హత్యచేసింది మీ కొడుకు విజయ్."

"నో....నో...." గట్టిగా అరిచాడు.

"ష్....ఎందుకలా గొంతు చించుకుంటారు? అందువల్ల మీకేం లాభంలేదు. చూడండి ఇప్పటికే మీ ఇంటిముందు జనం గుమిగూడారు."

"మీరు అన్యాయంగా అభాండాలు వేస్తున్నారు."

"ఇందులో అన్యాయం ఏమీలేదు. సుధారాణి స్వంత తాళాలు కన్పించడంలేదు. అవి మీవాడు తెచ్చి మీకు ఇచ్చివుంటాడు. మీరు సేఫ్ తీసి సుధారాణి సంతకం వున్న స్లిప్ దానిమీద అంటించారు."

"సుధారాణి సంతకం నాకెక్కడ దొరుకుతుంది?"

"మనసుంటే మార్గం వుండదా? ఆమె సంతకాలు ఎన్నో ఫైల్సులో మీ ఆధీనంలో వున్నాయి. ఏదోక ఫైలులో కట్ చేసి అంటించి వుంటారు."

"ఆ పని క్యాషియర్ ఎందుకు చేసి వుండడు?" కోపంతో అరిచాడు సీతారామయ్య.

"క్యాషియర్‌కి బాధ్యత వుంది. అతను ఎటువంటి వాడో మాకు తెలుసు."

"ఇన్స్‌పెక్టర్! నా ఇల్లు సోదాచెయ్యడానికి మీకు అధికారంలేదు."

ఇన్స్‌పెక్టర్ నవ్వి సెర్చి వారెంట్ చూపించాడు.

సీతారామయ్యకి కాళ్ళు చేతులు చల్లబడిపోయాయి.

"మీ అబ్బాయి విజయ్ ఎక్కడ?"

"ఊళ్ళో లేడు."

"ఎక్కడికి వెళ్ళాడు?"

"పనిమీద మద్రాస్ వెళ్ళాడు."

ఇన్స్పెక్టర్ తలవూపి తన సిబ్బంది సహాయంతో ఇల్లంతా సెర్చి వేశాడు. గాడ్రెజ్ బీరువాలు రెండు. బట్టల చెక్క బీరువాలు, ట్రంక్ పెట్టెలు అన్నీ పూజ గదిలో సేఫ్ తీయించాడు. అందులో వెయ్యిరూపాయల డబ్బు, కొన్ని నగలు వున్నాయి. అవి సీతారామయ్య భార్యవే. ఆ సేఫ్‌లో నగలు వున్న ఒక అరలో ఒక కవరు దొరికింది. అందులో పన్నెండు ఫోటోలు వున్నాయి.

ఆ ఫోటోలు చూసి షాక్ తిన్నాడు ఇన్స్పెక్టర్ దివాకర్.

సీతారామయ్య తల వంచుకున్నాడు.

'డబ్బు ఎక్కడో దాచివుంటాడు. దొంగసొమ్ము ఇంట్లో వుంచుతాడా?' అనుకున్నాడు ఇన్స్పెక్టర్.

## 12

ఆ ఫోటోలు చూసి సావిత్రి ముఖం పాలిపోయింది. ఆమె శరీరం చలిజ్వరం వచ్చినట్లు గజగజ వణికిపోయింది. ముఖం రెండు చేతుల్లో కప్పుకుని వెక్కి వెక్కి ఏడ్చింది.

ఆ ఫోటోల్లో సావిత్రి నగ్నంగా వుంది. సీతారామయ్య ఆమెతో వివిధ భంగిమల్లో అసభ్యంగా కామక్రీడలు జరుపుతున్న దృశ్యాలు అవన్నీ.

"ఇన్స్పెక్టర్! ఆ ఫోటోలు సీతారామయ్యే తీశాడు మైనారులోని ఒక హోటల్లో. నా భర్త చనిపోయాక నేను అతనితో సంబంధం పెట్టుకున్నాను. ఒకసారి

దసరాకి మైసూరు వెళ్ళాం. అక్కడ ఒకరోజు హోటల్లో నేను బాగా డ్రింక్ చేశాను. వళ్ళు మరిచిపోయి ప్రవర్తించాను. సీతారామయ్య అవన్నీ ఫోటోలు తీసి అప్పట్నుంచి నన్ను బ్లాక్ మెయిల్ చేస్తున్నాడు. చీటికి మాటికి డబ్బు గుంజుతున్నాడు.”

“ఇన్నాళ్ళూ ఈ సంగతి మాకు చెప్పచ్చుగా!”

“పరువుపోతుందని భయపడ్డాను. ఇన్స్పెక్టర్ ప్లీజ్! ఈ ఫోటోలు బైట పెట్టకండి. నా పరువుప్రతిష్ఠ మంట గలపకండి. వాటికి భయపడే నేను సీతారామయ్య చేతిలో కీలుబొమ్మగా ఆడాను. అడిగినంత డబ్బు ఇచ్చాను. ఇన్స్పెక్టర్ నేను నా నేరం ఒప్పుకుంటున్నాను. ఫ్లాస్కులో విషంపోసి వుంచింది నేనే. ఆ తర్వాత పని మనిషి అందులో పాలుపోసింది. విజయ్‌ని పెళ్ళిచేసుకోవడానికి సుధ ఒప్పుకోక పోవడమే ఈ హత్యకి కారణం. సుధ నా కన్నకూతురు కాదు. నాలుగేళ్ళ వయసులో తల్లిపోయింది. నేను ఆయన రెండో భార్యను. సుధ, విజయ్‌ను చేసుకుంటే నాకు శాశ్వతంగా సీతారామయ్య బ్లాక్ మెయిల్ తప్పేది. కాని, సుధ రమణను పెళ్ళిచేసుకుంటానని పట్టుపట్టింది. అలా చేస్తే నేను, నా బిడ్డలు అన్యాయమైపోతామని యీ హత్యకు తలపడ్డాను” ఏడ్వసాగింది సావిత్రి.

“మరి ఆత్మహత్య చేసుకుంటున్నట్లు ఆ లెటర్ రాసిందెవరు?”

“నేనే!” సావిత్రి యేడుస్తూ ఒప్పుకుంది తన నేరం.

—: ఐపోయింది :—

# పొగమంచు

సీరియల్



ముద్దా సురేష్

# (పద్నాల్గవ భాగం)

డా॥ గ్రా—రాణా భుజం ఓదార్పుగా తట్టి యిన్స్ట్రుమెంట్ పానెల్ మీద తన దృష్టి లగ్నం చేశాడు.

తమ పొజిషన్ - అండర్ గ్రౌండ్ బేస్ కి రిపోర్టు చేశాడు. విష మేఘం పల్చబడుతోందని చెబుతూ తమకు తాజాగా ఎదురైన ప్రమాదాలు వివరించాడు.

రాణా చేతివాచి చూసుకుని తాను బయటికివచ్చి కేవలం నలభై నిముషాలు మాత్రమే అయిందని గ్రహించాడు. అతన్కి కొన్ని గంటలు గడిచినట్లుంది.

స్పీకర్లోంచి రహస్య స్థావరంనుండి వస్తున్న మాటలు శ్రద్ధగా వినసాగాడు రాణా.

"హలో, డి. పీ. వన్! బేస్ కాలింగ్ ....యువర్ రిపోర్టు ఎక్నాలెడ్జ్డ్. బొంబాయి పరిసర ప్రాంతాల్లోకి వేలాదిమంది జనం తరలిపోతున్నారు.

నగరం సరిహద్దులో యింటర్న్మెంట్ (ఖైదీల) కాంప్స్ ఏర్పాటు చేయబడ్డాయి. బొంబాయిచుట్టూ స్పెషల్ పోలీస్ మిలటరీ బలగం కాపలా ఉన్నాయి, విచ్చలవిడి రాకపోకల్ని నిరోధిస్తూ.

పట్టణం విడిచిపెట్టే జనాభాని వెంటనే ఖైదీలుగా చేయడం జరుగుతోంది వారి వ్యక్తిగత రక్షణకోసం. చాలామందికి యింకా ఉన్మాదం సోకలేదు. వారికివారే యిష్టపూర్వకంగా సైనికులకి లొంగిపోతున్నారు, తమలో ఉన్మాదం ప్రారంభమైనపుడు అధికారులు రక్షిస్తారన్న ఆశతో.

విష మేఘం మీదుగా పాట్రోల్ చేస్తున్న హెలికాప్టర్లు, మలబార్ హిల్స్ అవతల పార్సీటవర్స్ దగ్గర సముద్ర ప్రాంతంలో విష మేఘం ఉధృతంగా

ఉన్నట్టు రిపోర్ట్సు పంపాయి. ముఖ్యంగా డాక్‌యార్డు పరిసరాల్లో విషమేఘం బాగా విస్తరించినప్పటికీ అంచుల్లో బలహీనమౌతున్నట్లు తెలుస్తోంది.

దేశం నలుమూలలా ఉన్న హెలికాప్టర్లన్నిటిలో కాల్షియం క్లోరైడ్ లోడ్ చేసి బొంబాయి నగరంమీద చల్లడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి. అయితే యిది ఆచరణలో పెట్టడానికి యింకా చాల గంటలు పడుతుంది.

యితర వివరాలు తెలియగానే మీకు తెలియజేయ బడుతుంది. గుడ్‌లక్ అండ్ ఓవర్!"

డోగ్రా వైర్‌లెస్ పరికరం స్విచ్ ఆఫ్ చేసి రాణా వైపు చూసాడు.

"మనం దారితప్పలేదు. సరియైన దారిలోనే ఉన్నాం. అది డాక్‌యార్డు ప్రాంతంలో ఎక్కడో వుండి వుంటుంది."

వారిద్దరూ యిప్పుడు మలబార్ మార్కెట్‌లో ప్రయాణిస్తున్నారు.

డోగ్రా తిరిగి సౌండ్ స్విచ్ నొక్కాడు.

"వాడెవడో చూడు!" రాణా ఎదురుగా రోడ్డు మీద పొగమంచులోంచి బైటికి వస్తున్న ఆకారంవైపు చూపుడువ్రేలితో చూపించాడు.

ఆ వ్యక్తి ఒక సర్దాజీ.

దట్టమైన గడ్డం.

నగ్నంగా వున్నాడు.

చేతిలో ఖడ్గం ఊపుతూ వాన్‌వైపు ఉరకబోతున్నాడు.

స్టీరింగ్ వీల్ బలంగా తిప్పుతూ వెంట్రుకవాసిలో

ప్రమాదాన్ని తప్పిస్తూ అతని ప్రక్కగా టర్నింగ్ కొట్టాడు రాణా.

రాణా ఏమాత్రం అలస్యం చేసినా, సర్దార్జీ టాంకు వాహనంక్రింద పచ్చడి అయివుండేవాడు.

రాణా ప్రక్క తలుపులోంచి చూసాడు ఆ వ్యక్తి కోసం.

కాని అప్పటికే అతను పొగమంచులో మాయమయ్యాడు.

వాన్ మలుపు తిరిగి యిరుకైన సందులోకి ప్రవేశించింది. విండ్ మిర్రర్ పై పేరుకుపోతున్న పొగమంచును తిట్టుకుంటూ కళ్ళు పెద్దవి చేసుకొని ముందుకు చూస్తున్నాడు డోగ్రా.

వాన్ తిరిగి విశాలమైన మెయిన్ రోడ్డులోకి ప్రవేశించింది, మలబార్ మార్కెట్ ని వొదిలిపెట్టి.

యాభై అడుగులు ప్రయాణించకముందే రాణా సడన్ బ్రేక్ తో వాన్ ని ఆపేశాడు.

"అక్కడ చూడు" అన్నాడు రాణా రోడ్డుకు కుడి వేపు చూపిస్తూ. పొగమంచులోంచి కళ్ళు పెద్దవిచేసుకుని చూసాడు డోగ్రా.

అతను ఆమెను స్పష్టంగా చూడకముందే కెవ్వున ఆమె పొలికేక వినబడింది.

ఆమెకు పదిహేను సంవత్సరాలకంటే ఎక్కువ వయసు ఉండదు.

ఓ గుమ్మంలోకి భయంగా ఒదిగి నిలబడిందామె.

అంతదూరంలో కూడా భయాందోళనలతో వెడల్పయిన ఆమె కళ్ళు కనబడుతున్నాయి రాణా, డోగ్రాలకి.

ఆమె పెట్టే పొలికేకలు వాన్ స్పీకర్ల ద్వారా

లోపలిభాగంలో భయంకరంగా ప్రతిధ్వనిస్తున్నాయ్.

యిద్దరు బలిష్ఠులైన వ్యక్తులు నవ్వుతూ ఆమెవేపు అడుగులేస్తున్నారు.

వారి భుజాలమీద, చేతులమీద బురద పేరుకుని వుంది, వారి ఆకారాలకు మరింత భయంకరాకృతిని కల్పిస్తూ.

వారిద్దరూ పెద్ద కంఠంతో బూతులు తిడుతూ ముందుకు అడుగులేస్తున్నారు. ఆమె లేత శరీరాన్ని కొద్ది క్షణాల్లో ఏం చేయబోతారో ఆమెకు పచ్చిగా చెబుతూ.

"బాస్టర్డ్స్!" పళ్ళు పటపట కొరికాడు రాణా. ఉద్రేకంతో.

"లుక్ హియర్ సర్! వాహనం విడిచి మనం బైటికి వెళ్ళడానికి వీల్లేదు. ఈ లోహపు దుస్తుల్లో నేనే విధంగాను సహాయం చేయలేను. యికపోతే - మీ ప్రాణాలు ప్రస్తుతం చాల విలువైనవి. ఎవరు కష్టంలో వున్నా మనం మజిలీలు చేసుకుంటూపోతే, అసలు మనం న్యూక్లియస్‌ను చేరలేం...."

"షటప్" అన్నాడు రాణా నెమ్మదిగా.

అతని కాలు యాక్సిలేటర్ మీద బలంగా పడింది. ఒక్క కుదుపుతో ముందుకు ఉరికింది వాహనం.

వాన్ కుడివేపు చక్రాలు ప్లాట్‌ఫాం అధిరోహించగా, తారాజువ్వలా ముందుకు కదిలింది వాన్.

ఆ యిద్దరు దృఢకాయులు ఉలిక్కిపడి వాన్ వేపు చూసారు.

అప్పటికే ఆలస్యమైంది.

వాన్ మిలటరీ టాంకులా వారిద్దర్నీ ఢీకొంది. ఒక

దృఢకాయుడు, వాన్ చక్రాలకింద మాయమయ్యాడు. రెండో వ్యక్తి శరీరం బొమ్మలా ఎగిరి, ఎదురుగా వున్న బిల్డింగ్ గోడకు విసురుగా గుద్దుకుంది.

ఆ యిద్దరి వ్యక్తుల ఆఖరి ఆర్తనాదం, యువతి భయంతో పెట్టిన పొలికేక రాణా మెదడులో ప్రతి ధ్వనించాయ్.

కీచుగా శబ్దం చేస్తూ ఆగింది వాన్.

ఆ కుదుపుకి డోగ్రా, ఎదురుగా వున్న ఇన్‌స్ట్రుమెంట్ పానెల్ మీదకు తూలిపడ్డాడు.

రాణా ప్రక్క కిటికీలోంచి బైటికి చూసాడు.

ఆ యువతి ముఖానికి చేతులడ్డం పెట్టుకొని, పరిగెడుతోంది పొగమంచులోకి.

రోడ్డుకడ్డంగా, విగతజీవుడై, పచ్చడైన శరీరంతో పడివున్న దృఢకాయుడి శరీరాన్ని చూసాడు రాణా.

మరో వ్యక్తి శరీరం, గోడవారగా పడివుంది వంకర తిరిగిన మెడతో, విచిత్రమైన యాంగిల్ లో.

ఆ భీకర దృశ్యాన్ని చూడలేక రాణా దృష్టి మరల్చుకొని, స్టీరింగ్ వాన్‌మీద తల ఆన్చాడు వొకచేత్తో నుదురు రుద్దుకుంటూ, క్రిందికి శూన్యంగా చూస్తూ....

డోగ్రా ముందుకు కదిలి రాణా భుజం ఊపాడు సున్నితంగా.

రాణా ఏమీ మాట్లాడకుండా, తలపైకెత్తి నెమ్మదిగా వాహనాన్ని ముందుకి పోనిచ్చాడు.

దార్లో ఎదురౌతున్న మరికొన్ని విషాద సన్నివేశాలు గమనిస్తూ వాళ్ళిద్దరూ మౌనంగా ప్రయాణిస్తున్నారు....

డోగ్రా, అప్పుడప్పుడు రహస్య స్థావరానికి రిపోర్టులు పంపుతున్నాడు, తాము చూస్తున్న సన్నివేశాల

గురించీ.

పంటల గురించీ,....

జన నష్టం గురించీ,....

అకస్మాత్తుగా అడిగాడు డోగ్రా, రాణాని వెంటనే వాన్ ఆపుచేయమని. రాణాకి, తాము యిప్పుడు ఎక్కడ ఉన్నదీ స్పష్టంగా అర్థంకాలేదు.

డాక్ యార్డుకి సమీపాల్లో ఎక్కడో వున్నట్టు ఊహించాడు అంతే.

రాణా ప్రశ్నార్థకంగా డోగ్రావైపు చూసాడు.

"మనం యిప్పుడు నూక్లియస్ ఉనికిని కోల్పాయాం" అన్నాడు డోగ్రా విచారంగా.

అతను చకచకా ఇన్స్ట్రుమెంట్స్ చెక్ చేసి, రహస్య సావరాన్కి రిపోర్టుచేసాడు వేగంగా, క్లుప్తంగా.

"ఎలా?" అన్నాడు రాణా.

"విషమేఘంపైన తిరిగే హెలికాప్టర్ ద్వారా మనం గైడ్ చేయబడ్తున్నాం" చెప్పాడు డోగ్రా "మైక్రో ప్లాస్మా ఉనికిని ట్రాక్ చేస్తూ ఆ హెలికాప్టర్‌లో సెన్సర్ యంత్రాలు పనిచేస్తాయి. అప్పుడు హెలికాప్టర్‌లోని సిబ్బంది ఆ నూక్లియస్ ఎక్కడవుందో, ఎటువైపు కదుల్తోందో హెడ్‌క్వార్టర్స్‌కి చెప్తారు వాళ్ళు. మన వాన్‌లోని దిక్సూచిని అక్కడ్నించే ఆపరేట్ చేస్తారు.

మనం ఏ దిక్కుగా వెళ్ళాలో, ఏ ప్రాంతంలో, వెళ్ళాలో ఈ దిక్సూచి తెలుపుతుంది. యిప్పుడు ఈ దిక్సూచి అకస్మాత్తుగా పనిగేయడం మానేసింది."

అంతలో స్పీకర్ నుండి ఓ కంఠం, కాబిన్‌లో ప్రతిధ్వనించసాగింది.

"హల్లో, డి.వి. 1 బేస్ హియర్ ఎగైన్. డు యు

రీడ్?"

డోగ్రా ఎక్‌నాలెడ్జ్ చేయగానే, ఆ కంఠం కొనసాగింది. కాప్టర్ టూ నూక్లియస్ ఉనికిని అకస్మాత్తుగా కోల్పోయిందని చెప్పడానికి విచారిస్తున్నాం. హెలికాప్టర్‌లోని యంత్రాలు నూక్లియస్ ఉనికిని అకస్మాత్తుగా కోల్పోయాయట. వాళ్లు మళ్ళీ నూక్లియస్ కనబడేవరకూ చుట్టుప్రక్కల ప్రాంతాల్లో సెర్చిచేస్తారు. అది అకస్మాత్తుగా ఎలా మాయమైందో మాకు అర్థం కావడంలేదు. డాక్‌యార్డు దగ్గర సముద్రంలో దాక్కొని ఉంటే తప్ప.... మీరు ఆ ప్రాంతానికి దగ్గర్లోనే వున్నారు.... కాని అలా జరిగివుండకపోవచ్చు. మీరు యిప్పుడు చేయాల్సిన పని ఓర్పుగా వాన్‌లో కూర్చోవడమే! మళ్ళీ మేము సూచనలు యిచ్చేవరకూ. ఎక్కువసేపు పట్టదు. అయామ్ ష్యూర్. ఓవర్ అండ్ ఔట్."

డోగ్రా సీట్లో వెనక్కి జార్లబడ్డాడు "గాడ్!"

"మనం విషమేఘం గుండెకాయకి దగ్గర్లోనే ఉన్నాం."

"వాళ్ళు మళ్ళీ దాన్ని లొకేట్ చేయగలరంటావా?" అడిగాడు రాణా.

"ఎవరికి తెలుసు? యింతకుముందు యిలాగే ఓసారి కాంటాక్టు కోల్పోయారు," చుట్టూ యిబ్బందిగా చూస్తూ అన్నాడు డోగ్రా.

"మళ్ళీ ఆర్డర్స్ ఎప్పుడు వస్తాయో ఏమో? మనం యిలా ఓపెన్‌గా ఉండడం మంచిది కాదు."

"ఆల్‌రైట్! రోడ్డుమధ్యగా ఉండటం ప్రమాదమే. అక్కడేదో బిల్డింగ్ షెల్టర్ ఉన్నట్టుంది. అక్కడకు పోదాం."

నెమ్మదిగా రోడ్ క్రాస్‌చేస్తూ వాన్‌ని కుడివైపు

నడపసాగాడు రాణా.

సరిగ్గా అదే సమయంలో....

పొగమంచులోంచి రాక్షసుడిలా—ఓ బస్సు బయటికి వేగంగా దూసుకువచ్చింది!

ముందుభాగంలో రక్తపు మరకలతో ....

ఆ బస్సు యిప్పుడు తిన్నగా వాన్ వైపు తారా జువ్వలా పరిగెడుతోంది....

డ్రైవర్ ఉద్దేశాన్ని ఊహిస్తూ, త్వరగా రోడ్డు వొదిలిపెట్టే ఉద్దేశంతో గాభరాగా రాణా యాక్సిలేటర్ నొక్కాడు.

అప్పటికే ఆలస్యమైంది....

కనురెప్పపాటున దఢాలున గుద్దుకుంది వాన్ ప్రక్క భాగాన్ని ఆ బస్.

పర్వతంలాంటి ఆ తాకిడికి, రాణా డ్రైవ్ చేస్తున్న వాన్ రివ్వున పైకెగిరి తలక్రిందులుగా నేలమీద లాండయింది.

ప్రపంచం వొక్కసారిగా చీకటైంది.

•  •  •

ఆ ఉదయాన, రెండోసారి తల తిరిగినట్లయింది జాలేఖాకి. నాలుగైదు రోజులుగా తను కొద్ది గంటలు మాత్రమే నిద్రపోయానన్న విషయం ఆమెకు తెల్సు. కాని తాను నిర్విరామంగా శ్రమించక తప్పదు. లెక్కపెట్టలేనన్ని జీవితాలు, తనమీద, తన సహచరుల మీద ఆధారపడి వున్నాయి.

ప్రమాదకరమైన ఈ విషమేఘం వ్యవహారంలో రాణా ఒక్కడూ ప్రభుత్వం చేతిలో పావులా ఉపయోగ పడుతున్నందుకు విచారించిందామె.

అసలు పొరపాటు వారిది.

కాని వాళ్ళుచేసిన పొరపాటు సరిదిద్దుకోడాన్కి రాణాని ఉపయోగించుకుంటున్నారు.

"కాని, అది తప్పనిసరి" లోలోన అనుకున్నది జులేఖా. రాణా తప్పక శాస్త్రజ్ఞులకు సహాయం చేయ గలదు, మైకోప్లాస్మా శాంపిల్ తెచ్చి క్లూ యివ్వడం ద్వారా.

జులేఖా ఎదురుగా వున్న రిపోర్ట్ మీద దృష్టిని కేంద్రీక రించడాన్కి ప్రయత్నించింది.

తాము యింతకుముందు ఓ పేషంట్ పై చేసిన రేడి యాలజీ ట్రీట్ మెంట్ చక్కని ఫలితాన్నిచ్చింది!

అదృష్టవశాత్తూ ఆ వ్యక్తిని సరియైన టైంలో తమ వద్దకు చేర్చడంవల్ల.

మిగతా పేషంట్లు అంత అదృష్టవంతులు కాక పోవచ్చు.

ఇది యింకా ప్రారంభ దశ మాత్రమే.

విష మేఘం బాధితులు యింకా వందల్లో, వేలల్లో, లక్షల్లో వస్తారు.

దాదాపు ప్రపంచం అంతా భారతదేశానికి సహా యంగా నిలిచింది.

ఇతర దేశాల సైంటిస్టులు అనేకమంది అప్పుడే ఇండియా వచ్చారు.

కారణం—యిలా రేపు ఎక్కడైనా జరగొచ్చు.

ఏ ఖండంలో, ఏ దేశంలోనైనా విష మేఘం ప్రమాదం ఏర్పడవచ్చు.

యిలాంటి అనుకోని ప్రమాదాలు ఏర్పడినప్పుడు, వారు కూడా యితర దేశాల సహాయం ఆశిస్తారు సహజంగా

యిప్పుడు బయటవాళ్ళు తమకు అభయ హస్తం యిస్తు న్నట్లుగా నే.

'అలాటి భారీ సహాయం వచ్చే మరికొద్ది రోజుల్లో మరీ అవసరం' అనుకున్నది జులేఖా.

* * *

తల దిమ్మను వొదిలించుకోడాన్కి తీవ్రంగా తల విదిలించసాగాడు రాణా.

నొప్పి ఉధృతం కావడంతో ఆ ప్రయత్నం మధ్యలో విరమించాడు. షాక్ నుండి తేరుకోడానికి ప్రయత్నిస్తూ, అతను అలాగే చతికిలబడి ఉన్నాడు కొద్దినిముషాలపాటు.

నెమ్మదిగా కళ్ళు తెరిచి ప్రకాశవంతమైన సూర్య కాంతిని చూసి ఆశ్చర్యపోయాడు రాణా.

ఎక్కడ్నుంచో ఓ కంఠం విన్పిస్తోంది....

అసహజంగా వున్న ఆ కంఠం ఆతృతతో, కంగా రుగా పలుకుతోంది ...

తల భారంగా పైకెత్తి, పరిసరాలు కలియజూసాడు రాణా.

అతన్ని ఆశ్చర్యపరుస్తూ, కొద్ది అడుగుల దూరంలో స్పెషల్ వాన్ తలక్రిందులుగా పడివుంది.

తెర్చుకున్న, కాబిన్ లోంచి వినవస్తోంది ఆ కంఠం....

అది రేడియోలో వచ్చే కంఠం అని గుర్తించగలిగాడు రాణా.

భూగర్భ రహస్య స్థావరం డిమాండ్ చేస్తోంది, ఏం జరిగిందో తెల్సుకోవడాన్కి.

వాన్ లోంచి తను 'తూలి' బయటపడి ఉండాలి! బస్సు, వాన్ కి ఢీకొనగానే తలుపు స్మాష్ అయివుండాలి.

తలక్రిందులవుతుండగా, ఆ వొత్తిడికి తలుపు తెర్చుకొని

ఉండాలి, తనను రోడ్డుమీదకు విసిరేస్తూ.

తన శరీరంలో ఎముకలు ఏమీ విరిగినట్లు లేదు. ముఖం భగభగ మండుతోంది, ఎవరో రోడ్డుమీద ముఖం వ్రేలాడుతుండగా లాక్కెళుతున్నట్లు.

మోకాళ్ళు పచ్చిపుళ్ళులా, గాయం మీద కారం అద్దినట్లు మండుతున్నాయి.

ఆ డామేజి మినహా, తను క్షేమంగానే ఉన్నట్టు గ్రహించాడు రాణా.

డోగ్రా?

డోగ్రా ఎక్కడ ఉన్నట్టు??

రాణా శరీరంలో యింద్రియాలు వేగంగా అదుపులోకి వచ్చాయి. చేతిని రోడ్డుమీద మోపుతూ కూర్చోగలిగాడు రాణా.

మెల్లగా స్పెషల్ వాన్ వైపు తిరిగాడు.

'అతను యింకా లోపాలే చిక్కుకుపోయి ఉండాలి' తనలోతను అనుకున్నాడు.

భగవాన్!

అతనికేం ప్రమాదం లేదుగదా?

వణుకుతూ పైకిలేచి నిలబడ్డాడు.

తూలుకుంటూ కాబిన్ వైపు నడిచాడు....

"డోగ్రా!" పిల్చాడు చీకటిగా వున్న కాబిన్‌లో తలదూర్చి.

లోపలంతా ఖాళీ!!!

గిర్రున వెనక్కి తిరిగాడు రాణా. వాహనాన్ని ఆధారంచేసుకు నిలబడుతూ.

"డోగ్రా!...."

పిల్చాడు మళ్ళీ—ఈసారి గట్టిగా.

అప్పుడు చూసాడు రాణా—ఆ ఆకారాన్ని.

డోగ్రా పడుతూ, లేస్తూ, వాన్ కి దూరంగా నడుస్తున్నాడు—నడుందాకా వంగిపోయి, రెండు చేతులతో ముఖాన్ని కప్పుకొని—బాధలో ఉన్నట్లుగా.

అతను ఎట్లాటి బస్సు వున్న దిక్కుగా అడుగులేస్తున్నాడు....ఎక్కడికి వెళ్తున్నాడో తెలిసో, తెలియకుండానో....

డోగ్రా ఆకారం, బస్సును సమీపిస్తోండగా, కొంత మంది జనం, ప్లాట్ ఫాం దిగుతూ అతనివైపే కన్నార్పకుండా చూస్తూ నిలబడ్డారు మౌనంగా.

ఆ గుంపులో ఒకడు చేత్తో డోగ్రాని చూపిస్తూ, కిచకిచ నవ్వాడు.

"డోగ్రా....కమ్ బాక్!" గాభరాగా అర్చాడు రాణా, అతను మాస్క్ హెల్మెట్ లేకుండా నడుస్తూ—పొగమంచుకి బహిర్గతమౌతున్నాడని గ్రహించి....

కాని డోగ్రాకి అతని మాటలు వినపడలేదు. కాలు జారి మోకాలి మీద పడ్డాడు డోగ్రా, యింకా బస్సులోంచి దిగుతున్న జనం ముందుగా.

జనంలో చాలామంది, అతని అవతారాన్ని చూసి పగలబడి నవ్వసాగారు, చేత్తో చూపిస్తూ....తోటి ప్రయాణికుల్ని డోగ్రా అవస్థ చూడ్డానికి రమ్మని పిలుస్తూ.

బస్సు ముందు భాగం, షాపులోకి చొచ్చుకుపోయి ఉంది.

కాని ఓ ఆకారం, ఆ శిధిలాలనుండి మెల్లగా బయటికి వచ్చింది, ముక్కలైన విండ్ మిర్రర్ లోంచి.

తర్వాత ఆ ఆకారం, బస్సునానుకుంటూ నిలబడింది ఆయాసంతో.

అతను రోడ్డు ట్రాన్స్‌పోర్టు కార్పొరేషన్ యూనిఫాం ధరించి ఉన్నాడు.

నుదుటిమీంచి రక్తం ధారగా కార్తోంది.

అతను పళ్ళు బయటపెట్టి గర్వంగా నవ్వుతున్నాడిప్పుడు.

రాణా ముందుకి కదిలాడు ఆందోళనగా, డోగ్రాకి హెచ్చరిక చేయడానికి.

కాని అతని పాదాలు సహకరించలేదు.

మోకాళ్ళలో పట్టుసడలి జారిపడ్డాడు రాణా, బాధగా మూల్గుతూ.

జనం కేసి చేయి చూపుతూ డోగ్రాని కేకపెట్టి హెచ్చరించాడు రాణా.

కాని అతన్ని అక్కడ పట్టించుకునే వాళ్ళెవరూలేరు.

ఒంటికాలిమీద చతికిలబడి, నాభిలోంచి వస్తున్న మూలుగుతో, బాధగా అటూ ఇటూ వూగుతున్న డోగ్రా మీద నిలబడి వున్నాడిప్పుడు డ్రైవర్.

ఆ దృఢకాయుడు తన బూటుకాలిని రివ్వున వూపి, వెనక్కి జరిగి పగలబడి నవ్వాడు—ముద్దగా వెనక్కి తూలి పడిన ఆకారం కేసి చూస్తూ.

ఎవరో ముందుకి అడుగేసి, మళ్ళీ ఆకారం కడుపులో బలంగా తన్ని వెనక్కి నడిచారు.

మిగతా జనం నవ్వులో శృతి కలిపారు.

ఉన్నట్టుండి అకస్మాత్తుగా యేదో రహస్యమైన ఒప్పాదానికి వచ్చినట్లుగా, ఆ జనమంతా ముందుకు వంగి వున్న ఆ శరీరం చుట్టూ గుంపుగా చేరి మూకుమ్మడిగా కుళ్ళబొడవనారంభించారు.

"నో!....నో!...." పొలికేక పెట్టాడు రాణా.

కాని యెవరూ అతని ఉనికిని గ్రహించలేదు.

వారంతా హింసాకాండను నిర్విఘ్నంగా కొనసాగించడంలో నిమగ్నమైపోయారు.

రాణా ఆశ్చర్యం మేరకు, లోహపు దుస్తులను ధరించిన డ్రోగా కాళ్ళమీద, చేతులమీద ఆనుకుంటూ కదిలాడు.

ఒక్క క్షణం డ్రోగా కళ్ళు దూరంగా వున్న రాణాని గుర్తించాయి.

కాని, ఆధారంగా నేలమీద మోపిన అతని చేతుల్ని ఎవరో భద్రంగా తన్నారు, డ్రోగా నోరు తెరవకముందే.

బహిర్గతంగా ఉన్న డ్రోగా తల, కాంక్రీట్ రోడ్డుకి తక్కున కొట్టుకుంది.

అతను రోడ్డుమీద బోర్లా సాగిలపడిపోయాడు చలనరహితంగా.

గుంపు మధ్య నవ్వులు-వికటాట్టహాసాలుగా మారాయి.

వారంతా అతని శరీరంమీద నిలబడి తన్నుతూ, పొడుస్తూ, కుమ్ముతూ ప్రాణాన్ని బైటికి వెడలగొట్టించే ప్రయత్నం చేయసాగారు అమానుషంగా.

కట్టలు తెంచుకున్న ఉద్రేకంతో, దశదిశలు దద్దరిల్లేట్లు సింహగర్జన చేస్తూ మెరుపులా ముందుకి కదిలాడు రాణా గుంపుని ఛేదిస్తూ.

పిచ్చివాడిలా అరుస్తూ, దొరికినవాడినల్లా నేల కరిపిస్తూ, ఫుట్ బాల్ లా తన్నుతూ, జనాన్ని చెల్లాచెదరు చేయసాగాడు రాణా.

ఆ మహాత్పరిణామానికి ఒక్కక్షణం వారందరిలో భయం ఆవహించింది.

అతను తమలాంటి వ్యక్తి కాదని గుర్తిస్తూ, దూరంగా

జరిగి నిలబడిపోయారు వాళ్ళంతా భీతితో.

అందరూ....

ఒక్క డ్రైవర్ తప్ప!

రాణా కళ్ళకు అడుగు దూరంలో వున్న డోగ్రా మృతదేహం కనబడుతోంది.

బిగుసుకు పోయిన ముఖంతో డోగ్రా కనురెప్పలు మూయబడి వున్నాయి.

నోటి నుంచి రక్తం ధారగా చారిక కట్టి వుంది. అతని ప్రక్క బెముకలు విరిగి, ఊపిరితిత్తుల్లోకి చొచ్చుకుపోయాయని చెప్పడానికి అది ఖచ్చితమైన సూచన.

ఆ ప్రమాదం యాక్సిడెంట్ లో జరిగిందో, ఉన్మాదుల చిత్రహింసలవల్ల జరిగిందో రాణాకు పూర్తిగా అర్థం కాలేదు.

అతనికి అర్థమైందల్లా ఒకటే! అతనిలాగానే తనను కూడా చంపేదాకా ఈ ఉన్మాదులు విడిచిపెట్టరు.

రాణామీద యేదో బరువు హఠాత్తుగా పడింది.

ఓ బూటుకాలిదెబ్బ కడుపులో లాండయి రాణాని వెల్లకితలా పడగొట్టింది.

రాణాకి ఒక్కక్షణం ఎదురుగా వున్న ఆకారం కనబడింది, పొగమంచుతో కూడుకున్న ఆకారం.

పొగమంచులోంచి కొంతమంది తలలు తనవైపు చూస్తూ కనబడ్డాయి, గుంపువాళ్ళు చుట్టుముడుతుండగా.

వాళ్ళంతా తనను బలికాపోతున్న మేకలా చూస్తున్నారు కసాయివాళ్ళలా నవ్వుతూ.

రాణా గుండెలు పీచుపీచుమంటున్నాయి. పిచ్చి కుక్కల బోనులోకి విసిరినట్లయింది అతని పరిస్థితి.

దృఢకాయుడి ముఖం—రాణా ముఖంమీదికి వాలింది.

అతని చేయి రాణా జుట్టును చేజిక్కించుకుని పైకి క్రిందికీ కుదిపింది. అతని చూపులు సూటిగా రాణా ముఖంలో నిల్చాయి.

బాధతో అప్పుడు చూశాడు రాణా స్పష్టంగా, ఆ కళ్ళల్లోని ఉన్మాదసిత్తి—పైశాచిక ఆనందం....

అకస్మాత్తుగా రాణాకి గుర్తొచ్చింది పిస్తోలు!

మెల్లగా చేతిని కోటులోపలి షోల్డర్ హోల్‌స్టర్ వైపుకు పోనిచ్చాడు రాణా.

సేఫ్టీ కాచ్ లూజ్ చేస్తూ, పిస్తోలుని జాగ్రత్తగా బయటకి తీసుకొచ్చాడు రాణా.

అంతే!

చిన్న బారెల్ ని—బస్ డ్రైవర్ గడ్డాన్కి నొక్కిపెట్టి, ట్రిగర్ నొక్కాడు....కసిగా.

"ఢాం"....డ్రైవర్ తల బాంబులా పేలింది. రక్తంతో కూడిన మాంసఖండాలు, ఎముకలు గాల్లోకి రివ్వున వెదజల్లబడ్డాయ్.

ఛిద్రమైన తలతో, డ్రైవర్ మొండెం వెనక్కి కూలిపోయింది.

రివ్వున పైకిలేచాడు, రాణా పిస్తోలు మరోసారి పేల్చడాన్కి సన్నద్ధమౌతూ. కాని ఆ అవసరం అతనికి కలగలేదు.

ఉన్మాదుల గుంపు బొమ్మల్లా నిల్చిపోయింది, ముద్దలా పడి చివరి ప్రాణాలతో కొట్టుకుంటున్న డ్రైవర్ శరీరాన్ని తదేకంగా చూస్తూ.

మెల్లగా వెనక్కి అడుగు వేయసాగాడు రాణా, ఉన్మాదుల గుంపునుంచి దృష్టి మరల్చకుండా.... ఏక్షణంలోనైనా వారినుండి రియాక్షన్ కోసం ఎదురు చూస్తూ.

చాలమంది తమ ముఖాల మీదకి చిమ్మిన రక్తాన్ని తుడుచుకుంటూ రక్తసిక్తమైన చేతులు ఆశ్చర్యంగా పరిశీలించుకుంటున్నారు.

ఆ గుంపులోని ఓ ఎర్రచీర యువతి.... చేతి కంటిన రక్తాన్ని నాకడం గమనించాడు రాణా, వెనక్కి అడుగు లేస్తూ.

ఆమె చూపులు అటూ ఇటూ ప్రసరించి, తన సహచరులమీద నిల్చాయి.

తర్వాత నేలమీది శవాలవైపు....తర్వాత వెనక్కి నడుస్తున్న రాణావైపు.

కోపంతో గుర్రుమంటూ వెలువడింది ఓ పొలికేక ఆమె నోటి నుండి!

రాణా వెనక్కి తిరిగి పరుగు లంకించుకున్నాడు.

బస్సుకి దూరంగా....

గుంపుకి దూరంగా....

శవాలకి దూరంగా....

స్పెషల్ వాన్‌కి దూరంగా....

....పొగ మంచులోకి.

వెనకనుంచి కేకలు వినబడుతున్నాయి....

వాళ్లు వెంట తరుముతున్నారని గ్రహించాడు రాణా. అతని మోకాళ్ళు యింకా కలుక్కుమంటున్నాయి నొప్పి రేగగొడుతూ....యాక్సిడెంట్ ప్రతిఫలం....

కాని తను ఆగడాన్కి వీల్లేదు....

ఆగితే తను మళ్ళీ చంపాలి.

తర్వాత తనని వాళ్ళు చంపుతారు.

పిస్తోలులో ఎనిమిది గుళ్ళే వుంటాయి.

పొగమంచులో పరిగెడుతున్నాడు రణా వొగరుస్తూ.

ఎక్కడ్నించో ఓ కారు దూసుకుంటూ వచ్చి అతని ముందు సడన్ బ్రేక్‌తో 'కయ్యి'న శబ్దం చేస్తూ ఆగింది. ఆ హఠాత్పరిణామాన్ని నిలదొక్కుకోలేక తూలి బానెట్ మీద పడ్డాడు రాణా.

అది ఓ పాతబడ్డ ఫియట్ కారు.

చాలాచోట్ల తుప్పుపట్టి వుంది.

కాని కార్లో జీవం యింకా వుంది.

బానెట్ మీంచి దొర్లి, డ్రైవర్ డోర్ వైపు ఉరికాడు రాణా. దడాలున తలుపు తెర్చి, లోపలి వ్యక్తిని రాణా బైటకు లాగపోతుండగా మాటలు వినబడ్డాయి.

"దయచేసి నన్ను వొదిలిపెట్టండి.... ఈ పిచ్చివాళ్ళ నుండి నన్ను దూరంగా పోనీండి...."

తటపటాయించాడు రాణా.

తల వొంచి స్టీరింగ్ ముందున్న వ్యక్తివేపు పరిశీలనగా చూసాడు.

అతనికి వయస్సు నలభై వుంటుంది.

ఖరీదయిన దుస్తులు ధరించాడు.... మెడకు సెక్సై.

అన్నిటికంటె ముఖ్యం.... అతని కళ్ళు అర్థిస్తున్నట్లుగా భీతిల్లినట్లుగా కనబడ్డాయ్.

ఉన్మాద వ్యాధి లక్షణం అతని చూపుల్లో కనబడ్డం లేదు.

ఆ వ్యక్తి రాణావైపు దీనంగా చూసాడు.

"ప్లీజ్ లెట్ మీ గో...." మళ్ళీ అభ్యర్థించాడు.

అడుగులచప్పుడు దగ్గరయింది.... కేకలు దగ్గరయ్యాయి.

"ప్రక్కకి జరుగు!" కమాండింగ్‌గా అన్నాడు రాణా వణుకుతున్న అతన్ని ప్రక్కకు తోసి తను డ్రైవింగ్

సీటు ఆక్రమించుకుంటూ. డోర్ మూసి, ఫస్టు గేర్ వేసి కారుని ముందుకి వురికించాడు రాణా.

త్రుటిలో ప్రమాదం తప్పింది రాణాకి.

అప్పటికే అక్కడికిచేరి కారు తలుపులకి వేలాడుతున్న ఉన్మాదులు, వాహనం ఒక్క జర్కుతో ముందుకు కదల డంతో ప్రక్కలకు విసిరివేయబడ్డారు.

ఓ ఆకారం దారి కడ్డంగా రావడంతో కారు ప్రక్క భాగం ఢీకొని రివ్వున యెగిరి గోడకు గుద్దుకుంది.

స్పెషల్ వాన్ తిరగబడ్డ స్థలాన్ని చేరుకోగానే ఫియట్ ప్లాట్ ఫాం ఎక్కి కీచుగా అరుస్తూ 'U' టర్న్ కొట్టింది.

ఉన్మాదుల గుంపు భయం యిక లేదని నిర్ధారించు కున్నాక కారు వేగం తగ్గించాడు రాణా పొగమంచులో మరో కార్ని గుద్దుకుంటానేమోనన్న భయంతో.

తన చేతిలో పిస్తోలు యింకా అలాగే ఉన్నట్లు, దాని వంకే ఫియట్ యజమాని తదేకంగా చూస్తున్నట్లు గ్రహించాడు రాణా.

పిస్తోలు తిరిగి హోల్ స్టర్ లో అమర్చి, రిలీఫ్ గా వది లిన ఆగంతకుడి నిట్టూర్పును విన్నాడు.

"నువ్వు మిగతావాళ్ళలాంటివాడివి కాదు. అవునా?" అడిగాడతను భయం భయంగా.

రాణా తల త్రిప్పి అతనివేపు చూసాడు.

భయంగా చూస్తూ, అతను దూరంగా జరిగాడు ఎడమ తలుపుదాకా.

అతని మొహం తెల్లగా పాలిపోయి వుంది.

"మిదతావాళ్ళలా....అంటే?" అడిగాడు రాణా, జాగ్రత్తగా.

"యూ నో....మాడ్....అందరూ పిచ్చివాళ్ళయ్యారు. ఆ విష మేఘంవల్ల....దయచేసి నువ్వు అలా కాలేదని చెప్పు.... టెల్ మీ యు అర్ ఓ. కే!....నాలాగే...."

ఇది ఎలా సంభవం?

మరోసారి అతని ముఖంలోకి దేనినో వెతుకుతున్న వాడిలా చూసాడు రాణా.

అతనికి ఉన్మాదం సోకకపోవడం ఎలా సంభవం? అతను సాధారణంగానే కనబడుతున్నాడు.

బెదురు చూపులు........

"నేను పిచ్చివాడ్ని కాదు" చెప్పాడు రాణా తన జవాబుకు తనే ఆశ్చర్యపోతూ.

ఇన్ని విచిత్ర సంఘటనలు చూసిన వ్యక్తి వున్మాదిగా మారకుండా వుండగలడా?

ఆగంతకుడు నవ్వాడు. "థాంక్ గాడ్" అన్నాడతను సంతృప్తిగా. "నేను ప్రతినిముషం ఓ పీడకలలా గడుపుతున్నాను. పిచ్చివాడిగా మారకుండా నే నొక్కడినే మిగిలానని యింతవరకూ అనుకున్నాను. నాకు ఎదురయిన హృదయవిదారక సంఘటనలు చెబితే నువ్వు నమ్మవు...." చెమ్మగిల్లిన కళ్ళను చేత్తో తుడుచుకున్నాడతను.

"నా....భార్య నన్ను హతమార్చడానికి ప్రయత్నించింది. ఉదయం మేం బ్రేక్‌ఫాస్టు తీసుకుంటున్నాం. విష మేఘం అంటే ఏమిటో....దాని ఆకారం ఏమిటో మేము గ్రహించలేదు....దాని అర్థం మాకు తెలీదు. అది ఏర్పడానికి కారణం తెలేదు. మేము విన్న విషమేఘం మాకు తటస్థపడలేదు....మాహిమ్ దుర్ఘటన తాలూకు పొగ మంచు....నేను తలెత్తి చూసాను....ఆమె ఎదురుగా

కూర్చుని వుంది.... నావేపు కన్నార్పకుండా చూస్తూ.... పెదవులపై ఆహ్లాదకరమైన నవ్వుతో....ఎందుకు నవ్వుతున్నావని అడిగాను. జవాబు చెప్పలేదామె. యింకా నవ్వింది. ఆమె కళ్ళు....ఆమె చూపుల్లో చాలా మార్పు వొచ్చింది....కళ్ళు పెద్దవి చేసుకొని చూస్తోంది....నిజానికి ఆ చూపులు మామూలుగా వున్నట్లు లేవు...." అతను శబ్దం కాకుండా వెక్కి వెక్కి ఏడ్వడం ప్రారంభించాడు.

"ఆఁ....అది మహాదారుణం....ఇట్ వజ్ హారిబుల్" గుండెల నిండుగా గాలిపీల్చుకొని కొనసాగించాడు ఆగంతకుడు.... "ఆమె పైకిలేచి టేబుల్ చుట్టూ నడిచి నా వెనక్కి చేరింది. ఆమె చేతిలో పళ్ళుకోసే బాకువున్నట్లు నాకు తెలీదు. ఏదో అడగాలని వెనక్కి తిరిగాను. అప్పుడు చూసాను ఆమె కత్తిని విసురుగా కిందకు దింపడం. నే.... నేను చాల అదృష్టవంతుడ్ని....బాకు నా భుజంలో గుచ్చుకుని మడతబడింది. అప్పుడు గ్రహించాను నేను అసలు కారణం—

విష మేఘం....

దానికి కారణం విష మేఘమేనని గుర్తించాను.

నేను జంప్ చేసాను. యిద్దరూ కలియబడ్డాం.... ఆమెను దెబ్బతీయడం నా ధ్యేయంకాదు. కాని.... భగవాన్! ఆమెలో విచిత్రమైన శక్తి ప్రవేశించింది. అంతకుముందు ఆమె ఎంతో సున్నితంగా ఉండేది, నా భార్య—కాని అకస్మాత్తుగా ఆమెలో పైశాచిక బలం ప్రవేశించింది. నన్ను టేబుల్ మీదకి పడదోసింది. అక్కడే యిద్దరూ పోరాడాం....జుట్టూ జుట్టూ పట్టుకుని నేలమీద పడేదాకా....

పడిపోవడంలో ఆమె తల పగలకొట్టుకుంది....స్పృహ

కోల్పోయింది.... నాకు ఏం చెయ్యాలో తోచలేదు.... కాళ్ళు చేతులు ఆడలేదు...." అలసటగా ఆగిపోయాడు ఆగంతకుడు. అతని శరీరం గతాన్ని గుర్తుచేసుకుంటూ బలహీనంగా కంపించసాగింది....

"టేక్ యిట్ ఈజీ" అన్నాడు రాణా ఓర్పుగా, ఆగంతకుడి పరిస్థితికి లోలోన జాలిపడుతూ.

ఉదయం — యిలాంటి అనుభవాలే ఎన్ని వేలమందికి ఎదురయ్యాయో....

ఎన్ని వేలమంది ప్రేమికులు, ఒకరిపై ఒకరు కలియబడ్డారో పరస్పరం హతమార్చుకోవడానికి....

తమను తాము చంపుకున్న ప్రజలు ఎందరో?....

"ఆ విషయం గురించి అస్తమానూ గుర్తుచేసుకుని బాధపడొద్దు" చెప్పాడు రాణా, "నిన్ను ఒక సురక్షిత ప్రదేశానికి చేర్చడానికి ప్రయత్నిస్తాను."

ఆగంతకుడు కన్నీళ్ళు అదుపులోకి తెచ్చుకుంటూ తలెత్తి రాణావైపు చూసాడు. "లేదు. ఆ విషయం గురించి మాట్లాడి బాధపడ్డం నాకూ యిష్టంలేదు. నాకు తోడుగా దొరికిన సాధారణ వ్యక్తివి నువ్వొక్కడివే. నేను ఓదార్పు కోసం, సహాయం కోసం యితరుల దగ్గిరపోతూ ప్రయత్నించాను. కాని వాళ్ళంతా ఒక్కటే! అందరూ పిచ్చివాళ్ళే.... కాని.... కాని.... మనం ఎందుకు పిచ్చివాళ్ళం కాలేదు? దాని ప్రభావం మనల్ని ఏమీ చేయలేకపోయింది ఎందువల్ల?"

రాణా తటపటాయించాడు.

త్వరలో వ్యాధి తను యిద్దరికీ సోకుతుందని చెప్పాలా? అతి త్వరలో—ఆ వ్యాధి తనతోపాటు అతని మెదడు కణాలని కూడా నాశనం చేస్తుందని చెప్పాలా?

పారసైట్ కణాలు తమ సంఖ్య పెంచుకోడానికీ, ప్రభావం చూపించడానికీ, తీసుకునే సమయం మనిషికీ మనిషికీ తేడా ఉంటుందని చెప్పాలా?

బహుశా ఈ అగంతకుడ్ని—సమయం మించిపోయే లోగా డాక్టర్ జులేఖాకు అప్పగిస్తే ఉపయోగం ఉంటుందేమో.

"నువ్వు బయలుదేరేముందు నీ భార్యని జాగ్రత్తగా బంధించావా? ఐ మీన్ ....ఆమెకు ఆమె అపకారం చేసు కోకుండా!" అడిగాడు రాణా, రోడ్డువైపు జాగ్రత్తగా చూస్తూ, భూగర్భ రహస్య స్థావరానికి ప్రయాణమౌతూ.

"ఓహ్! ఆమెను నేను వొదిలిపెట్టలేదు" జవా బిచ్చాడు అగంతకుడు ...."రోజీని నేను వొదిలిపెట్టలేను... ఆమె అంటే నా కెంతో అనురాగం....ప్రాణం....బైటి వారి దయాదాక్షిణ్యాలకు వదిలిపెట్టి ఆమెను బంధించి ఎలా వచ్చెయ్యగలను?....

"....బట్ యు సీ....అసహ్యంగా చూసే ఆమె చూపులు....ప్రేలాపన....పిచ్చివాగుడు.... నేను సహించ లేక పోయాను....

"ఆమెను ఒంటరిగా వొదిలి ఎలా పారిపోగల్ను? రోజీ నాకు చాల విలువైనది....అందుకే నాకూడా తీసుకు వచ్చాను....ఆ విధంగా చూడకుండా....ఆ విధంగా అసహ్యంగా మాట్లాడకుండా చేసి, ఆమెను బాక్ సీట్లో ఉంచాను. అదిగో ఆమె!....స్వీట్ రోజీ....నీ వెనకనే ఉంది... బాక్ సీట్లో...."

రాణా చటుక్కున వెనక్కి చూసాడు.

అంతే! ప్రక్కలో బాంబుపడ్డట్టు అదిరిపడ్డాడు రాణా. కళ్ళు చీకట్లు కమ్మినట్లూ, చెరణాకోలతో ఎవరో

బాదినట్లుగా....ఫీలయ్యాడు....

ఆమె....శిరశ్ఛేదన చేయబడింది!!

"ఫ్రెండ్! .. యు....సీ....ఆమెను నేను వొంటరిగా వొదిలిపెట్టలేకపోయేను...." ఆగంతకుడు నిర్వికారంగా తాపీగా చెప్పుకుంటూ పోతున్నాడు.

"రోజీ పలికే మాటలు నేను సహించలేకపోయాను. ఆమె చూపులు భరించలేకపోయాను.... అందుకే .... 'రంపం' ఉపయోగించాను. నిజాన్ని చెప్పాలంటే.... ఆ పని నిర్వర్తించడం చాల కష్టమైంది....సామానంతా చిందరవందరైంది....ఎలాగో పని ముగించాక, బట్టలు మార్చుకోక తప్పలేదు....ఆ పని చేస్తున్నంత సేపూ.... బెచారీ....వాగుతూనే ఉంది....పని ముగిసేసరికి ఆమె-మాటలు ఆపడం తప్పలేదు." ఆగంతకుడి కంఠం విచారంగా పలికింది "కాని ఆమె ఆ విచిత్రపు చూపులు చూడ్డం మాత్రం మానలేదు....తల బైటికి లాగేసినా సరే....పిచ్చిదానిలా అలా చూస్తూనే ఉంది—చూడు కావాలంటే! యిప్పటికీ ఆమె అదే విధంగా చూస్తోంది" ఆగంతకుడు వెనక్కి తిరిగి, సీటుమీంచి వంగి, క్రింద దేనిగురించో వెతికాడు.

తర్వాత చేయి పైకెత్తాడు.

రాణావైపు గంభీరంగా చూస్తూ అన్నాడు. "చూడు! నామాట అబద్ధమనుకుంటే...."

అతను చేత్తో రక్తం ఓడుతున్న స్త్రీ తలకాయను జుట్టుతో పట్టుకొని, రాణా ముఖం మీదకు ఊపాడు.

అతను చెప్పింది నిజమే! ఆమె కళ్ళు తదేకంగా చూస్తున్నాయ్!!

రాణా భయంకరంగా అర్చాడు; బిక్కచచ్చిపోయి

వెనక్కి జరుగుతూ.

అతని వెన్నులోంచి చలిపుట్టుకొచ్చింది....

శరీరంమీద రోమాలు నిక్కబొడుచుకున్నాయ్. పిచ్చిగా అరుస్తూ గాల్లో ఊగుతున్న తలకాయను విసిరి కొట్టాడు రాణా.

రోడ్డుప్రక్క షాపుల్ని గుద్దుకోబోతున్న కారుని అతి కష్టంమీద కంట్రోల్ లోకి తెచ్చాడు, చెమటలుకక్కుతూ.

రాణా ప్రక్కనున్న వ్యక్తి ఆశ్చర్యంగా చూసాడు, తన భార్య తలకాయని అతను విసిరికొట్టినందుకు.

"నా రోజీని కొడతావా? అం....కొడకా!" అరిచాడు ఆగంతకుడు తలకాయని మళ్ళీ తన ఒళ్ళో సున్నితంగా దాచుకుంటూ.

తిరిగి వెనక సీట్లోకి వొంగాడతను, ఒళ్ళో వున్న తలకాయ దొర్లి పడకుండా ఎడంచేత్తో పట్టుకుంటూ.

ఈసారి అతని చేయి పైకివచ్చింది రక్తశిక్తమైవున్న రంపంతో—

"మైతుర్ఝు మార్ దూంగా సాలే...." గర్జించాడు ఆగంతకుడు.

"మిగతా వాళ్ళలాగే నువ్వు పిచ్చాడివి!" అంటూ పదునైన పళ్ళతో మెరుస్తున్న అంపాన్ని రాణా మెడ వెనుక మోపాడు.

కాని కారు అకస్మాత్తుగా పేవ్ మెంట్ కి గుద్దుకొని దానిమీదుగా దూసుకుపోడంతో ఆ కుదుపుకి ఆగంతకుడు వెనక్కి తూలాడు.

అంపం రాణా భుజంమీంచి జారి క్రిందపడింది.

కారు బ్రేకులు కాళ్ళతో నొక్కుతూ, పిడికిలి బిగించి ఆగంతకుడి దవడమీద గాకెట్ పేల్చాడు రాణా.

కీచుమంటూ ఆగింది ఫియట్.

రాణా దడాలున తలుపు తెరిచి—పైకిలేస్తున్న ఆగంతకుడి కాళ్ళు పట్టుకుని నిర్దాక్షిణ్యంగా రోడ్డుమీదికి ఈడ్చాడు.

కాంక్రీట్ రోడ్డుమీద ఠప్పున తాకింది ఆగంతకుడి తల.

మాడిపోయిన బల్బులా, స్పృహతప్పాడు ఆ ఉన్మాది.

అతనితోపాటు దొర్లుకుంటూ రోడ్డుమీద పరిగెత్తింది అతని భార్య తల!

భయంకరమైన చూపులతో, రోడ్డుకడ్డంగా పడివున్న ఆ శిరస్సును, తప్పించుకుంటూ కారుని తిరిగి వేగంగా ముందుకి పోనిచ్చాడు రాణా. ఆలోచనలతో అతని మస్తిష్కం వేడెక్కిపోతోంది.

రెండు నిముషాల తర్వాత తాను చీకటిలో కప్పివేయ బడ్డట్టు గుర్తించాడు రాణా.

ఎదురుగా దారి సరిగా కనబడ్డంలేదు.

చీకటి!

బ్రేక్స్‌ని అదిమాడు రాణా.

బలహీనంగా అరుస్తూ అంధకారంలో ఆగిపోయింది వాహనం.

రాణా చుట్టూ చూసాడు భయంగా....

ఎదురుగా—తనకటూ ఇటూ—పూర్తి అంధకారం.

కార్లోని మొండెం గురించిన ఆలోచనలు బలవంతంగా మస్తిష్కంలోంచి త్రోసిపుచ్చాడు రాణా.

ముఫై అడుగుల వెనకాల బలహీనంగా ఓ వీధి దీపం వెలుగుతోంది.

ఏం జరిగిందో క్రమంగా అర్థమైంది రాణాకి.

తాను పల్లంలోకి వచ్చినట్లు గుర్తు!

ఆఁ! పరధ్యానంగా తాను ఓ టన్నెల్‌లోకి డ్రైవ్

చేసాడు. తనకుముందే ఆ విషయం తెలియవల్సింది.

కాని, కార్లోని మొండాన్ని ఎలా వదిలించుకోవాలా అని ఆలోచిస్తూ అన్యమనస్కంగా ఈ మార్గంలోకి వచ్చేసాడు.

దగ్గర్లో డాక్‌యార్డు ఉండాలి.

యిది సముద్ర కోస్తా ప్రాంతం.

పెద్ద నల్లరాతి కొండ—లోభాగాన తొలిచిన త్రోవ.

"బ్లాక్ రాక్ టన్నెల్!" గట్టిగా అరిచాడు రాణా.

ఖచ్చితంగా అదే అయ్యుండాలి.

పరధ్యానంలో తను మెయిన్‌రోడ్డు వదిలిపెట్టి ఏట వాలు త్రోవగుండా వచ్చాడు—టన్నెల్‌లోకి.

మెయిన్ రోడ్డులో హెవీ ట్రాఫిక్‌ని తగ్గించడానికి ఈ త్రోవను దొల్చారు కొండలో.

నిజానికి ఆ కొండలో రెండు టన్నెల్స్ ఉన్నాయి సమాంతరంగా.

కాని రెండూ, వేరువేరుగా దూరంలో ఉన్నాయి అదే కొండలో.

వన్‌వే ట్రాఫిక్!

మహాలక్ష్మి. బ్రీచ్‌కాండీ ప్రాంతాలనుండి, వర్లీ, ష్వర్, మలబార్ పోర్టుప్రాంతాలకి వెళ్ళేవారికి మొదటి త్రోవ ఉపయోగపడుతుంది. అలాగే యిటునుంచి ఉత్తరం దిక్కుగా ప్రయాణించేవారికి రెండో టన్నెల్ ఉపయోగపడ్తుంది.

మొదటి భూగర్భ త్రోవ, బ్లాక్ రాక్ హిల్‌లో 1960 లో దొల్చబడింది. రెండో టన్నెల్ 1971 లో నిర్మించబడింది.

రాణా—బొంబాయి ఉత్తర దిక్కుగా వెళ్ళడాన్కి

ఉపయోగించే పాత టన్నెల్‌లో ఉన్నాడు.

తను వెనుదిరిగి దక్షిణానికి వెళ్ళేముందు, చేయవల్సిన పని గుర్తుచేసుకున్నాడు రాణా.

తన వెనక సీట్లో పడివున్న ఆ భయంకరమైన మొండాన్ని వదిలించుకోవాలి.

రాణా కుడివైపు తలుపుతీసి, క్రిందికి దిగాడు.

డ్రైవింగ్ సీటు ముందుకు ఎత్తి, చేయి లోపలికి పోనిచ్చాడు రాణా.

అతను నిరభ్యంతరంగా, కార్లో లైటువేసుకుని ఆ పని పూర్తి చేయవచ్చు.

కాని తలలేని ఆ స్త్రీ మొండాన్ని వెలుగులో చూడదల్చుకోలేదు రాణా.

ముప్పై అడుగుల వెనుక, రోడ్డుమీదించి వస్తున్న అర్థ కాంతి చాలు.

బంధించబడిన కాళ్ళు తగిలాయ్ చల్లగా, రాణా చేతులకి.

చిన్న కుదుపుతో పైకెత్తాడు శరీరాన్ని....

రాణా ఆమె కాళ్ళుతప్ప మరెక్కడా ముట్టుకోలేదు.

తలలేని భుజాలు తాకితే తనకు వెంటనే వాంతి అవుతుందని అతనికి తెలుసు.

రాణా ఆ మొండాన్ని తేలిగ్గా ఎత్తి టన్నెల్ గోడవారగా దింపాడు.

ఆ భయంకర స్పర్శను మర్చిపోవడం కోసం, అతను చేతులు బట్టలకు రుద్దుకున్నాడు.

టన్నెల్ లోపలికి యధాలాపంగా చూసిన రాణా ఉలిక్కిపడ్డాడు.

తను ఊహించుకుంటున్నాడా?

లేక అక్కడ నిజంగా దీపపు కాంతి కనబడిందా? ఆ అండర్‌గ్రౌండ్ త్రోవ అంతా పొగమంచుతో కమ్ముకుని ఉంది. చీకటికి కళ్లు అలవాటుపడ్డాక నిర్ధారించుకున్నాడు రాణా.

దూరాన్నుంచి సన్నని కాంతి వస్తోంది.

సందేహంలేదు.

టన్నెల్ వంకర మలుపులో అది రిఫ్లెక్ట్ అవుతోంది.

అది పగటికాంతి కావడాన్కి వీల్లేదు.

ఎందుకంటే దాని 'అవతలివైపు' ప్రవేశ ద్వారం అర మైలు దూరంలో ఉంటుంది.

టెన్నెల్‌లో మార్గం వంపులు తిరిగివుంటుంది కూడా. అందుచేత సూర్యకాంతి అంత లోపలికివచ్చే ప్రసక్తిలేదు.

ఒక విధంగా జరిగివుండాలి.

ఏదో కారు లోపల ఆగి ఉంటోంది హెడ్‌లైట్ల కాంతితో. తను కార్లో దానికి ఎదురుపడ్డం క్షేమంకాదు. నడిచివెళ్ళి ఆ విషయం తెల్సుకురావాలి.

రాణా ఆ నిశ్శబ్ద వాతావరణంలో, జాగ్రత్తగా పల్లంలోకి నడవసాగాడు—ఆ భయంగొలిపే వెలుగువైపు.

అతను ముందుకు నడిచేకొద్దీ—ఆ వెలుగు పెద్దది కాసాగింది....

విచిత్రమైన లేతపసుపుకాంతి అది!

రాణాకి మరాఠా దుర్గంలోని వెలుగు గుర్తుకు రాసాగింది.

పరిచయమున్న, ఒక వింత భయం రాణాని ఆవహించసాగింది....

రాణాకి క్రమంగా—ఆ కాంతికి మూలకారణంపై అనుమానం ఉదయించింది.

అతని గుండె వేగం హెచ్చింది.

ముందుకు వెళ్ళేకొలదీ ఊపిరిపీల్చడం కష్టమౌతోంది..

సన్నని, పదునైన వాసనని పసిగడుతూ టన్నెల్లోని వొంపు తిరిగాడు రాణా, అర్ధచంద్రాకారంలో ఉన్న గోడని ఆధారంచేసుకుని నడుస్తూ....

మలుపు తిరిగి ఆగిపోయాడు రాణా.

టన్నెల్లోని మిగతా భాగమంతా వెలుగుతో ప్రకాశిస్తోంది!

ప్రయోగాలకు బలై, విషపూరితమైన మైక్రోప్లాస్మా! తను కనుక్కున్నాడు!!

విషమేఘం గుండెకాయని తను వెతికి పట్టుకున్నాడు!! హెలికాప్టర్లో యంత్రాలు ఎందుకు సఫలీకృతం కాలేదో యిప్పుడు అర్థమైంది రాణాకి.

దాదాపు భూగర్భంలో దాక్కుని ఉండటంవల్ల— హెలికాప్టర్లో యంత్రాలు దాని ఉనికిని పసిగట్టలేక పోయాయి.

అలా జరగడం సాధ్యమేనా?

తనకుతానుగా విషమేఘం యిందులో దాక్కోవడం!

నో, అది హాస్యాస్పదంగా ఉంది.

అయినా తను కనుక్కున్నాడు మొదటిసారి, మైక్రోప్లాస్మా ఆమరాతా కట్టడంలో దోబూచులాడుతుండగా.

కాని వాళ్ళు దాని ఉనికిని తిరిగి కోల్పోయారు!

ఇది నిజంగా ప్రమాదవశాత్తూ యిక్కడ చిక్కుకుందా? ఈ మానవ నిర్మితమైన గుహలాంటి షెల్టర్లో.

చాల నిముషాలు అలాగే ఉండిపోయాడు రాణా, వెలుగులోకి తదేకంగా చూస్తూ—దానికిగల ఆకర్షణ శక్తికి లోబడి ముందుకుపోవాలనే కోరికను బలవంతంగా

అణుచుకుంటూ.

అతని మెదడులో చిన్న భాగం తీవ్రమైన ఒత్తిడి తెస్తోంది. ముందుకుపోమని.... ఆ వెలుగులోకి.

కాని అది ఎంత ప్రమాదకరమో గుర్తు తెచ్చుకుని బలవంతంగా వెనక్కి అడుగేశాడు రాణా.

శక్తివంతమైన స్థితిలో ఉన్న ఆ మైక్రోప్లాస్మా వద్దకు చేరితే తన పూర్వపు వ్యాధి నిరోధక శక్తి సన్నగిల్లి తప్పక తిరిగి పిచ్చిపడుతుందని అతనికి తెల్సు.

ఎవరో హెచ్చరించినట్లుగా రాణా అకస్మాత్తుగా వెనక్కి పరిగెట్టాడు కారువైపు.

తళుక్కున మెరిసింది అతని మెదడులో ఓ ఆలోచన!

యిక ఆలస్యం చేయలేదు రాణా.

ఫియట్ లోకి జంప్ చేసి, యింజన్ ఫైర్ చేసి, లైట్లు వేయకుండా కారుని టన్నెల్ ద్వారంవైపు రివర్స్ చేసాడు రాణా.

* * *

రాణా—అటూ ఇటూ నడిచే పిచ్చివాళ్ళకు కనబడకుండా ఓ షాపు లోపలి భాగంలో వేచి వున్నాడు. రోడ్డు మధ్యగా, తలక్రిందులుగా పడివున్న స్పెషల్ వాన్ అతనికి స్పష్టంగా కనబడుతోంది.

రోడ్డుమీద పొగమంచు యిప్పుడు పల్చబడింది. గాలికి పసుపుతనం మాయమౌతోంది.

రాణా—తిరిగి వెనక్కి, యాక్సిడెంట్ జరిగిన స్థలాన్ని చేరుకోవడంలో అత్యంత శ్రద్ధతీసుకున్నాడు—అతను స్పెషల్ వాన్ లోని వైర్ లెస్ యంత్రం చేరుకోడం మీదే భవిష్యత్తు ఆధారపడి వుంది గాబట్టి.

ప్రభుత్వ పథకం అమలు జరగాలంటే అతనికి వెను

వెంటనే భూగర్భ రహస్య స్థావరం నుండి సహాయం కావాలి. కొన్ని పరికరాలు కూడా.

బ్లాక్ రాక్ టన్నెల్ నుండి, రాణా చేసిన తిరుగు ప్రయాణంలో మళ్ళీ ఎన్నో ఆటంకాలు ఎదురయ్యాయి.

అయితే రాణా, అతి మెలుకువతో, ఏ గందరగోళం లోను కలుగజేసుకోకుండా వేగంగా స్పెషల్ వాన్ తిరగబడ్డ స్థలాన్ని చేరుకున్నాడు.

రాణాకు తట్టిన కొత్త ఐడియా చాలా సింపుల్.

సైంటిస్టు విశ్వామిత్రచే మార్పులు చేయబడ్డ ప్రమాద కరమైన మైక్రోప్లాస్మా వొకసారి భూమిలో బంధించ బడింది చాల సంవత్సరాల పాటు.

యిప్పుడు అది తిరిగి—మరో మానవ నిర్మితమైన భూగర్భ త్రోవలో చిక్కుకుంది. అందుకే....ఆ త్రోవకు అటూ ఇటూ వున్న మార్గాల్ని మూసివేస్తే?

కొండలో దొల్చబడ్డ గుహలో తిరిగి భూస్థాపితమై పోతుంది విషమేఘం గుంపేకాయ!

యిక అప్పుడు ఏ ప్రమాదమూ లేదు.

అందుకే—రాణా తిరిగి స్పెషల్ వాన్ ప్రమాదాన్ని గురి ఐన స్థలాన్ని చేరుకున్నాడు.

వైర్‌లెస్ సాధనాన్ని ఏ పిచ్చివాడు పాడుచేయ లేదని తెల్సుకుని రాణా ఎంతో సంతోషించాడు.

రాణా అక్కడికి చేరేటప్పటికి అది యింకా శబ్దం చేస్తోంది (ఓ కంఠం ప్రభుత్వ భూగర్భ రహస్య స్థావరంనుండి గాభరాగా పలుకుతోంది పది నిముషాల కోసారి—వాహనంలో ఉండే రాణా, ద్రోగాలేమైనారో తెలియక—ఆందోళనతో.)

తిరిగి రాణా కంఠం విన్పించగానే బేస్ (BASE)లో ఉండే అధికార్ల ఆనందాన్కి పగ్గాల్లేవు.

రాణా యిచ్చిన ఇన్‌స్ట్రక్షన్స్‌ని వెంటనే ఎక్‌నాలెడ్జ చేసారు.

అతని ఉపాయాన్ని అభినందించారు.

రాణా—గనుల త్రవ్వకాన్కి ఉపయోగించే శక్తివంతమైన డైనమెట్లనీ, ఓ ఎక్స్‌ప్లోజివ్స్ నిపుణుడినీ వెంటనే సావరంలో ఉన్న రెండో స్పెషల్ వాన్ ద్వారా తనవద్దకి పంపమని కోరాడు.

తనెక్కడున్నాడో వారికి వివరించి చెప్పాడు. శరవేగంతో ఈ ఏర్పాట్లు చేయమని కూడా ఆదేశించాడు.

అటువైపు కంఠం—రాణాని ప్రమాదం కలగకుండా సురక్షిత ప్రదేశంలో తాము వచ్చేటప్పటికి ఎంత సేపయినా సరే ఎదురుచూస్తూ కూర్చోమని అభ్యర్థన చేసింది.

అతనిని ఎవరైనా ఎటాక్ చేస్తే వెంటనే కాల్చి చంపామని మరోసారి గుర్తుచేసింది.

రాణా నవ్వుకున్నాడు.

యిప్పుడు అతనికి—చంపడం బాధాకరంగాలేదు.

ఉన్మాదులపై జాలి చూపించి ఉపయోగం లేదని అతనికి అప్పటికే పూర్తిగా అర్థమైంది.

ర ర ర

రెండు గంటల తర్వాత పొగమంచును చీల్చుకుంటూ ప్రవేశించి ఆ రోడ్డుమీద ఆగింది రెండవ డివాస్టేషన్ వెహికిల్!

రాణా తలుపు తెర్చుకుని, తను దాక్కున్న షాపులో నుండి బైటికి వచ్చాడు. (ఇంకా వుంది)

## "ముఖచిత్ర వాఖ్యాల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖచిత్రాలకు సంబంధం వుండేటట్లుగా ఒక్క-మాటలోగాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డు సైజు తెల్ల కాగితంపై వ్రాసి, ఈ నెల 7 వ తేదీ లోపు మాకు చేరేటట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి. సభ్యులు కానివారు తమ వ్యాఖ్యలతో 50 పైసల స్టాంపులు పంపాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు రు. 25/- నగదు బహుమతి పంపుతాము.

## "హోమ్ డెలివరీ

మీరు 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరితే, నెల నెలా పత్రిక మరియు సప్లిమెంట్ రెండూ కలిపి రు. 9/- లకే మా ఏజెంట్ ద్వారా గాని, వి.పి. ద్వారాగాని మీ యింటి దగ్గర అందజేస్తాము. ఇందుకు అయ్యే ఖర్చులన్నీ మావే.

మీరు చేయవలసిందల్లా రు. 5/-లు పంపి 'హోమ్ డెలివరీ' సభ్యత్వము పొందటమే.

'హోమ్ డెలివరీ' వల్ల మీకు కాపీలు నెలనెలా గ్యారంటీగా, త్వరితంగా చేరుతాయి. మీ ఇంటిదగ్గరనే డబ్బు చెల్లించి కాపీలు పొందవచ్చును. కాపీలకోసం మీరు ఏజెంట్ చుట్టూ తిరగాల్సిన అవసరం వుండదు. కాపీలు దొరకలేదనే నిరాశ, పోస్టుతో పోయే సమస్య, ఎంతమాత్రం లేదు.

నెల నెలా వి. పి. తీసుకోవటం కష్టమనుకునేవారు ఏడాది పైకము రు. 108/-లు ముందుగా పంపవచ్చును. •



# క్రైమ్‌లో తమాషాలు

[ఈ శీర్షికలో ప్రచురింపబడే ప్రతి రచనకు రు. 5 లు పారితోషికం ఇవ్వబడును—ఎడిటర్]

## మామూలు?

బజారు ఆ సాయంకాలం రద్దీగా వుంది. కార్లు ఆటోలు, సిటీ బస్సులు, టాక్సీలు అటు—ఇటు పరుగెడుతున్నాయి. రెండువైపులా వున్న పేవ్‌మెంట్లు, వాటిమీది దుకాణాలు కూడ హడావిడిగా వున్నాయి.

జాలయ్యకి రెండు చేతులు చాలడంలేదు. సాయానికి కుర్రవాడ్ని పెట్టుకున్నా రద్దీ తట్టుకోవడం కష్టంగా వుంది.

జాలయ్యది చిన్న బడ్డీకొట్టు. వర్షంలేకపోవడంవల్ల చిన్న బల్లలు బయటవేసి దానిమీద పెద్ద స్టవ్‌లుపెట్టి పకోడీలు, మిరపకాయలు, కోడిగుడ్డు పకోడీ వేస్తున్నాడు. జాలయ్య సరకులు రుచిగా, శుచిగా వుంటాయి. ఒకరోజు రుచి చూస్తేచాలు, మర్నాడు రావాల్సిందే.

మధ్యాహ్నం రెండు గంటలనుంచి, రెండో ఆట విడిచేదాకా సాగుతుంది అతడి వ్యాపారం. మధ్యలో టీ త్రాగటానికి, సిగరెట్ కాల్చుకోడానికి కూడా వ్యవధివుండదు. అలాంటి సెంటరులో వుంది కొట్టు.

“ఏరో జోరుగా చేస్తున్నావు యాపారం!”

జాలయ్య తల ఎత్తాడు. పోలీసు చంద్రలోకం. కోడిగుడ్డు పకోడీ రుచిచూశాడు. అరవైఐదుపైసలికి అమ్ము

తాడు దాన్ని. చంద్రలోకం దానితో తృప్తిపడకుండా అయిదు మిర్చి కాగితాన్ని చుట్టి సంచిలో పడేసుకున్నాడు.

"నన్ను పంపేస్తే పోతానుకదా!" నవ్వాడు యింకా ఏదో వున్నట్లు.

మామూలు! జాలయ్యకర్థమైంది. ఓ రూపాయితీసి యిచ్చాడు. చంద్రలోకం గుప్పెడు పకోడీలు నోట్లో పోసుకుని నడిచాడు.

బేవార్సుగా తినేసా ఏనుగులా అయిపోతున్నావు— జాలయ్య మూలుక్కున్నాడు. తిన్నా కృతజ్ఞతలేదు. అధి కారం చలాయించడం! కాకీబట్టల మహత్యమేమో!

నాలుగు రోజులు గడిచాయి. జాలయ్య రద్దీగా వున్నప్పుడు చంద్రలోకం వచ్చాడు. మామూలుగా రూపాయి యిచ్చాడు.

"ఇయాళనుంచి రెండు! తియ్యి యింకో రూపాయి."

"యాపారాలు బాగోలేవుసామీ!"

"నువ్వు పాతకేడీగాడివని మరచిపోక,"

చంద్రలోకం వుంటే యింకా ఏం వాగుతాడోనని రెండు యిచ్చి పంపాడు! నలుగురిలో అలా అనడం చిన్న బుచ్చినట్లయింది.

జాలయ్య రెండేళ్ళ క్రితం నల్గొండజిల్లానుంచి హైద్రాబాదు వచ్చాడు. రిక్షా తొక్కేవాడు. దాన్ని ఎవరో దొంగిలించారు. రిక్షా ఓనరు దొంగతనం అంటగట్టి జైలులో వేయించాడు.

విడుదలయ్యాక కూలిపని చేసుకుంటూ మునాఫ్‌బడ్డీలో పనివాడుగా చేరాడు. మునాఫ్ చనిపోయాక ఆ బడ్డీ కొనుక్కున్నాడు. నీతిగా బ్రతుకుతున్నాడు.

వారం రోజులు గడిచాయి. చంద్రలోకం రివాజుగా

వచ్చాడు। మామూలు జేబులో పెట్టుకుని "పై నుంచి దొరగారు వచ్చారు కోడ్ని పట్టుకెళ్లాలి. ఓ పదిరూపాయిలు అప్పుగా యియ్యి" అడిగాడు.

అది తిరిగిరాదని తెల్సు. ఇష్టంలేకపోయినా యిచ్చాడు. చంద్రలోకం యిదే బాగుందనుకున్నాడు. ఎవరో వచ్చారంటూ పది—యిరవై పట్టుకుపోతున్నాడు.

ఓ రోజున జాలయ్య "మధ్యాన్నం నుంచి కొట్టు తీయలేదు సామీ! యిప్పుడే వచ్చాను. యివాళ కొదిలెయ్।" పరోక్షంగా చెప్పాడు.

"ఏరో....కూతపట్టావు! ఈ ప్రక్కన దొంగతనం జరిగింది బట్టల కొట్టులో. పాత కేడీగాళ్ళని లాక్కపోతున్నాం. నువ్వు వాన్ ఎక్కుతావా?"

"నేను దొంగను కాదయ్యా! నాకేం తెలియదు।"

"దొంగవో దొరవో స్టేషన్‌కి వచ్చి చెప్పుకో యస్పయిగారితో।"

ఇటు వ్యాపారమూ పోతుంది। అటు చెడ్డపేరూ వస్తుంది. జాలయ్య ఆలోచించాడు. చంద్రలోకానికి పది నోటు యిచ్చాడు।

"రూల్సు మాట్లాడుతున్నావు స్టేషన్‌కిరా।"

జాలయ్య బ్రతిమాలుకున్నాడు. చంద్రశేకం టీవిగా లాఠీతిప్పుతూ. "జాగ్రత్త! పోలీసోడ్ని ఎదిరించి బ్రతకలేదు... నాలుగు పచ్చికోడిగుడ్లు కట్టు ...చుట్టాలు వచ్చారు" అని పట్టుకెళ్ళాడు।

"జలగలా పట్టుకున్నావురా।" జాలయ్య బాధపడిపోయాడు.

ఓ రాత్రి బాగా పొద్దుపోయాక చంద్రలోకం వచ్చి స్టూలుమీద కూర్చున్నాడు. రోజూలా ఏం తినలేదు.

"మిర్చి యివ్వనా సామీ!"

"ఏం వద్దురా! ఒంట్లో బాగాలేదు." చంద్రలోకం తినలేదు. కాస్సేపు కూర్చుని లేచాడు. వెళ్ళేముందు చల్లగా చెప్పాడు. "ఇల్లు కడుతున్నానురా... 27 కిటికీ నీమీద పెట్టాను. ఎంతో అవదులే. నూటయాభై. నాల్గు రోజుల్లో వస్తా."

జాలయ్య గుండె గుబేల్మంది. "అంతిచ్చుకోలేను సామీ! కలిగినకాడికి యిచ్చుకుంటాను... ఓ యాభై!"

"నేను అన్నది యివ్వాల్సిందే!"

"క్షమించాలి సామీ....యాభై కంటే యివ్వలేను."

"చూస్తా!" చంద్రలోకం కోపంగా వెళ్ళిపోయాడు. రెండురోజులు కొట్టుదగ్గరకి పోలీసు రాలేదు. మూడోనాడు జాలయ్య కొట్టు తీస్తుండగా వచ్చి "నిన్ను యస్సయిగారు పిలుస్తున్నారు....రా....పాపిరెడ్డి దుకాణం చోరీలో నీకూ సంబంధం వుంది. అందులో ఒకడు దొరికాడు. నీ పేరు చెప్పాడు ...పైకి సీతి కబుర్లు! చేసేవి దొంగపనులు" కేకలుపెట్టాడు.

"నాకా దొంగతనం తెలియదు. యస్సయి బాబుతో అదే చెబుతాను!" జాలయ్య కూడ స్టేషన్‌కి వెళ్ళాడు.

చంద్రలోకం లోపలికి తొంగిచూసి "యస్సయిగారు బయటికి వెళ్ళారు ...వచ్చేదాకా వుండు!" అని చెప్పి వెళ్ళిపోయాడు.

రెండుగంటలు గడిచాయి. యస్సయిరాలేదు. జాలయ్య పోయి మళ్ళా వస్తానన్నాడు. చంద్రలోకం ఒప్పుకోలేదు. "వచ్చేదాకా వుండు!"

వాస్తవానికి యస్సయి సెలవులో వున్నాడు. పదింటిదాకా ఆపుచేసి "పోయి.... రేపురా!" అన్నాడు చంద్రలోకం.

"ఇవాళ యాపారం పోయింది" జాలయ్య బాధపడ్డాడు.

ప్రొద్దుటే వచ్చి స్టేషన్ దగ్గర వేపచెట్టుక్రింద కూర్చు న్నాడు. చంద్రలోకం సాయంత్రం దాకా కూర్చోపెట్టి పొమ్మన్నాడు.

రెండోరోజు కూడ వ్యాపారం పోవడంతో జాలయ్య ఆందోళనపడ్డాడు! ఇలాగయితే వ్యాపారం మట్టిగడిచి పోతుంది. చంద్రలోకం కక్ష తీర్చుకుంటున్నాడు. అధి కారం చేతిలో వుంది. ఇక ఎదురేముంది? వాడు కోరిన డబ్బు పడేస్తే తద్దినం వదులుతుందేమో!

జాలయ్య కష్టపడి నూటయాభై ప్రోగుచేసి యిచ్చాడు. చంద్రలోకం తీసుకుంటూ "ఈ తెలివి ముందరేవుంచే? రెండురోజులు వ్యాపారం పోకుండా వుండును కదా!" వెక్కిసంగా నవ్వాడు.

పదిహేను రోజులు గడిచాయి! ఓ సాయంత్రం చంద్రలోకం సైకిల్ ప్రక్కగా ఆపి స్టూలుమీద కూర్చు న్నాడు.... జాలయ్య బిజీగా వున్నాడు.

"నా పర్సు!" ఓ వ్యక్తి గోలపెట్టాడు. ఉద్యోగస్తుడిలా వున్నాడు. నాగరికంగా వున్నాడు. "ఇప్పుడు చూశాను.... యిక్కడివారే తీసివుండాలి."

జాలయ్య దుకాణం ముందు పదిమంది వున్నారు. "వెతకండి బాబూ ...కొత్తవాళ్ళని రాకుండా చూస్తాను. దుకాణానికి చెడ్డపేరు వస్తే నాకు వచ్చినట్లే!"

ఓ వ్యక్తి అందర్నీ తణిఖీచేశాడు. వారి వస్తువులు చూశాడు. చంద్రలోకం సంచీ (సైకిల్‌కివుంది) లో పర్సు దొరికింది.

"నాదే. ఆరొందల అరవైఒకటి....నా ఫోటో బస్ పాస్ వుంటాయి."

ఆ వ్యక్తి చెప్పినట్లున్నాలు. సైకిల్ చంద్రలోకంది.
"పోలీసులు కూడా దొంగతనాలకి దిగుతున్నారా? ఛఛ ..."
అక్కడివారు చంద్రలోకాన్ని ...షన్‌కి తీసుకుపోయారు.

చంద్రలోకాన్ని సస్పెండ్ చేశారు. తర్వాత హెడ్ కానిస్టేబుల్‌నుంచి పోలీస్‌గా రివర్షన్ యిచ్చి ఏజెన్సీ: పడేశారు.

'మామూలు' బాధపడలేక జాలయ్య—ఓ స్నేహితుడి ద్వారా నాటకం ఆడి—పర్స్ చంద్రలోకం సంచీలో ప శాడు. ఎత్తు ఫలించింది.

—చెల్లూరి సీతారాజేశ్వరరావు.

## నడివీధిలో శవం?

"హల్లో....ఇన్‌స్పెక్టర్ రంజిత్‌కుమార్ హియర్...."

"సార్! నేను 304 ని మాట్లాడుతున్నాను. ఇక్కడ మెయిన్ రోడ్‌లో సుమారు పాతికేళ్ళ యువతిని చచ్చి పడుంది. ఇక్కడ గుంపుగా చేరినవాళ్లు ఆ యువతి చూడ్డా నికి వాళ్ళల్లో వాళ్లు కుమ్ములాడుకుంటున్నారు సార్! మీరు వెంటనే బయల్దేరి రండి....లేకపోతే చాలా ప్రమాదం...." అవతలినించి పలికింది కానిస్టేబుల్ కంఠం.

"ఫరవాలేదు....వాళ్ళని చూడనివ్వవయ్యా. శవాన్ని ఎవరయినా గుర్తిస్తే మన పని సులువవుతుంది కదా!"

"అయ్యో....వాళ్లు కుమ్ములాడుకునేది శవాన్ని గుర్తించ డానికి కాదుసార్. ఆ యువతి వొంటిపైన చిన్న నూలు పోగు కూడా లేదు" ఆందోళనగా పలికాడు కానిస్టేబుల్.

—యం. వీరాస్వామి, మల్కాజిగిరి.

